# మావో మార్గదర్శకం

## లెనినిజమూ కాదు - పిడివాదమూ కాదు

యస్. ఏ. డాంగే

(భారత కమ్యూనిస్టుపార్టీ అధ్యక్షులు)

విశాలాంధ్ర ప్రచురణాలయం

విజయవాడ - 4

# 1

# మిత్రత్వంనుండి శత్రుత్వానికి

"రివిజనిస్టుల ప్రతిబింబం" అంటూ మార్చి 9న చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర పత్రిక "పీపుల్సుడైలీ" సంపాదకీయం వ్రాసింది. భారత కమ్యూనిస్టుపార్టీపైన, దాని విధానాలపైన, నాయకత్వంపైన ఈ సంపాదకీయం తీవ్రమైన దాడిచేసింది. ఇది పెకింగ్‌రేడియోనుంచి అనేకభాషలలో ప్రసారం చేయబడింది. ప్రపంచమంతటా పత్రికలలో ప్రచురించబడింది. అందుచేత మేము జవాబు ఇవ్వవలసిన అవసరం ఏర్పడింది.

చైనా కమ్యూనిస్టుపార్టీతో వివాదంలోకి దిగడం మాకు సులభమూ కాదు, సంతోషకరమైన విషయమూ కాదు.

చైనా కమ్యూనిస్టుపార్టీ గొప్ప పార్టీ. దాని నాయకత్వాన 60 కోట్ల ప్రజలు సామ్రాజ్యవాదంతోనూ, భూస్వామ్య విధానంతోనూ పోరాడారు. తమ దేశాన్ని విముక్తి గావించారు. సోషలిజంవైపు కొన్ని చర్యలు తీసుకున్నారు. అలాంటి పార్టీతో విభేదాలు గాని, ఘర్షణలుగాని కలిగియుండడానికి ఏ కమ్యూనిస్టూ కోరుకోడు.

వారి విజయాలతో పోల్చిచూస్తే, భారతదేశంలో మాది చిన్న పార్టీ. విప్లవం సాగించిన కీర్తి మాకు లేదు. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాటం సాగించుతున్న కాలంలో, వాస్తవానికి మా పార్టీ చైనాపార్టీనుండి అప్పుడప్పుడూ సహాయకరమైన సోదర

సలహాలను పొందింది. కాకలుతీరిన చైనా విప్లవ నాయకత్వానికి రాజకీయ ధోరణిలో సలహాయిచ్చే అహంభావ వైఖరిని మేము వహించే సమస్య లేదు.

చైనా కమ్యూనిస్టుపార్టీ పట్ల, చైనా ప్రజలపట్ల ప్రాతికూల్యం గాని, విరోధంగాని పెట్టుకునే పరిస్థితి మా పార్టీకి రాలేదు. మా జాతీయ పరిసరాలుగాని, చరిత్రగాని అలాంటి ప్రభావం కలిగించలేదు.

## చైనా విప్లవంతో సంఘీభావం

బ్రిటిష్ పాలన కాలంలో భారత ప్రజల సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని నడిపిన జాతీయ కాంగ్రెసూ, దాని నాయకత్వమూ, చైనా విప్లవంతో స్నేహ సహకార సంబంధాలు కల్గియుండేవి. కాంగ్రెస్ నాయకత్వం సకుచితంగా, జాతీయత అనే గూడుకే పరిమితమైయున్న రోజుల్లో, జవహర్లాల్ నెహ్రూ తన యోగ్యతవల్ల, పీడితప్రజల, పీడిత దేశాల పోరాటాన్ని బలపర్చేటట్టుగా జాతీయోద్యమాన్ని రూపొందించారు. అందుచేతనే జాతీయకాంగ్రెసు, చైనాకు వైద్యబృందాన్ని పంపింది. ఆ బృందం మావో సే-టుంగ్ ప్రధాన కార్యాలయమున్న యేనాన్‌కూ, విముక్తి ప్రాంతాలకూ వెళ్ళిందేకాని, చంగ్ కై-షేక్ వద్దకు వెళ్ళలేదన్న విషయం జ్ఞాపకముంచుకోవాలి. చైనా విప్లవం సామ్రాజ్యవాదుల అగ్నిజ్వాలలకు గురి అవుతున్నప్పుడు, మన జాతీయపోరాటంలో "చైనా నుండి వైదొలగండి" అనే ఉద్యమం ఒక భాగంగా ఉండేది.

స్పానిష్ విప్లవంతో జాతీయ కాంగ్రెసు సంఘీభావాన్ని ప్రదర్శించింది. ఫ్రాంకో ఫాసిస్టు విప్లవ ప్రతీఘాతానికి వ్యతిరేకత చూపెట్టింది. జాతీయ బూర్జువాయే ముఖ్యమైన నాయకత్వంలో ఉన్నప్పటికీ ఆ రోజుల్లోనే జాతీయోద్యమం పీడితజాతులపట్ల అంతర్జాతీయ సంఘీభావాన్ని ప్రదర్శించింది. ఆ విధంగా మన ప్రజలు, మన జాతీయ ఉద్యమం, చైనా ప్రజా విప్లవంతో సోదర సంఘీభావ సంబంధాలను కల్గిఉన్నారు. మన రెండు దేశాల చరిత్రలో స్నేహానికి మాత్రమే గాని శత్రుత్వానికి ఎక్కడా చోటులేదు.

1920–24 మధ్య విజృంభించిన జాతీయ విప్లవంలోనుండి మా కమ్యూనిస్టు పార్టీ 1925 లో ఉద్భవించింది. చైనా విప్లవంలో స్నేహ సంఘీభావాలు గల జాతీయ వాతావరణంలో పెంపొందింది. చైనా కార్మికవర్గంతో మా పార్టీ శ్రామికవర్గ అంతర్జాతీయ సంఘీభావం చూపించవలసి వచ్చినప్పుడు జాతీయ ఉద్యమం మాకేమీ అడ్డురాలేదు.

అయితే, ప్రపంచంలో ఒకే ఒక సోషలిస్టు దేశమయిన సోవియట్ యూనియన్ విషయంలో పరిస్థితి వేరు. సామ్రాజ్యవాదం దానిపై నిరంతరం దాడి చేస్తూనే ఉంది. సోషలిజం, జాతీయ స్వాతంత్ర్యాలకు మొట్టమొదటి కోటయైన సోవియట్ యూనియన్‌తో, మా కొద్దిమంది కమ్యూనిస్టుల జట్టు బహిరంగంగా సంఘీభావం ప్రదర్శించి నిలబడింది. ఈ విషయంలో కాంగ్రెస్ నాయకత్వం నుండీ సహాయం గాని, సానుభూతిగాని మాకులేదు. అయితే, మాకు ఎక్కువ వ్యతిరేకత కూడా లేదు. కాంగ్రెస్ ఉద్యమంలోనూ, సంస్థలోనూ మేము స్వేచ్ఛగా పనిచేశాం.

ఆ రోజుల్లో అది నిజమే కావచ్చు కాని, భారతదేశం స్వాతంత్ర్యం పొందిన తర్వాత, భారతదేశంలో బూర్జువావర్గం అధికారానికి వచ్చిన తర్వాత, చైనాలో కమ్యూనిస్టుపార్టీచే సోషలిస్టురాజ్యం నెలకొల్పబడిన తర్వాత, పరిస్థితులు నిజంగా మారిపోయాయి అని ఎవరైనా అనవచ్చు.

## శత్రుత్వం తప్పనిసరి కాదు

రెండు విభిన్నవర్గాలకు చెందిన ఈ రెండు ప్రభుత్వాలు తప్పనిసరిగా శత్రుత్వం పెంచుకోవలసిన అవసరంలేదు. భారత, చైనాలలో అలాంటి పరిణామం తప్పనిసరి అయ్యే భౌతిక పరిస్థితులు లేవు. అక్కడా ఇక్కడా ఉన్న విభేదాలుండవచ్చు. శాంతియుత సహజీవనం అనే పంచశీల సూత్రాలను ప్రపంచానికి భారత, చైనాలు ఇచ్చాయి. ఆ విధంగా రెండు విభిన్న సామాజిక విధానాలుగల రాజ్యాలు స్నేహ సహకారాలను ఎలా పెంపొందించుకోవచ్చో, ఈ రెండుదేశాలూ చూపించాయి. ఈ రెండు దేశాలు స్వాతంత్ర్యం పొందిన తర్వాత,

సోషలిస్టు చైనా, బూర్జువా ఇండియాలమధ్య అనేక సంవత్సరాలవరకు శత్రుత్వం పెరగలేదు పైగా తద్విరుద్ధంగా 1954 లో పంచశీల సంధిపై సంతకాలు చేశాయి. ఇటువంటి పంచశీల ప్రపంచంలోనే మొట్ట మొదటిదని వ్రాసికెక్కింది.

భారతదేశం బూర్జువాదేశం గనుక, చైనా సోషలిస్టు దేశం గనుక, అది చైనాతో ఘర్షణపడాలి అని ఎవరూ అనలేరు. వాస్త వానికి ఈ రెండూ కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశాలు గనుక, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఈ రెండు దేశాలకు ఒకేరకమైన దృక్పథం వుంది. శాంతికోసం ఒకేరకమైన వాంఛ ఉంది. అందుచేత, యుద్ధానికి నయావలసవిధానానికి వ్యతిరేకంగా ఉమ్మడి శాంతిశిబి రంలో చేరాయి.

అయితే, ఎవరైనా ఇలా ప్రశ్నించవచ్చు: బూర్జువా ఇండియా కన్న సోషలిస్టు చైనా వైఖరివల్లనే, ఈ రెండుదేశాల మధ్య శత్రుత్వం లేకపోవడానికి స్నేహసంధి ఏర్పడటానికి కారణమై యుండవచ్చు గదా? లేదా భారత బూర్జువావర్గం ఏదో మోసపు ఎత్తుగడ కార ణాలవల్ల అలాంటి స్నేహసంధి చేసికొని యుండవచ్చుగదా? లేదా? సోషలిస్టు చైనా పేరాశగల (భారత) పెట్టుబడిదారీ వర్గాన్ని సోష లిస్టు రాజ్యంతో స్నేహితులుగా ఉండవలసిందిగా ఒప్పించి, భారత దేశానికి లాభకరంగా ఉదారమైన కొన్ని సౌకర్యాలను ఇచ్చి ఉండ వచ్చుగదా?

ఇవన్నీ వ్యర్థమైన ప్రశ్నలు, 1954 సంధిప్రకారం భారతదేశం, బ్రిటిషు సామ్రాజ్యవాదంనుండి సంపాదించుకున్న హక్కులన్నిటినీ వదులుకొంది. మాక్‌మాహన్‌శ్రేణివంటి బ్రిటిషు సామ్రాజ్యవాదుల అక్రమ ఆక్రమణలన్నింటినీ వారసత్వంగా పొందాలని భారతదేశం కోరుతున్నట్లు భావించేవారూ, దానికి అభివృద్ధినిరోధకమైన విస్తరణ ధోరణి ఉందని ఆరోపించేవారూ ఒక విషయం గుర్తుంచుకోవాలి: 1954 ఒడంబడికలో, టిబెట్ చైనా అంతర్భాగం అని భారతదేశం గుర్తించింది. బ్రిటిషు పరిపాలన తర్వాత అధికారంలోకి వచ్చిన భారత దేశం టిబెట్‌లో, తన ఎక్స్‌ట్రాటెరిటోరియల్ హక్కుల్ని వదులు

కొంది. (భారతదేశానికి ఈ హక్కులుంటే, టిబెట్‌లో భారతీయుల పైన విచారణజరిపే అవకాశం చైనాకు ఉండదు - అను) టిబెట్‌నుండి భారతదేశం తన సైనికదళాలను ఉపసంహరించుకొంది. అక్కడి పోస్టల్, టెలిగ్రాఫ్ కేంద్రాలనూ ఇతర భవనాలనూ చైనాకు అప్పగించింది.

తర్వాత, టిబెట్‌లో దలైలామా తిరుగుబాటు జరిగినప్పుడు భారత-చైనా విభేదాలు ముందుకు వచ్చాయి. దలైలామాకు భారత ప్రభుత్వం ఆశ్రయమిచ్చినప్పటికీ, అత డొనరించిన కొన్ని అపాయకర రాజకీయకార్యకలాపాలపట్ల ఉపేక్షవహించినప్పటికీ, టిబెట్ సమస్యను ఐరాసలో లేవనెత్తాలని భారతదేశంలోని కొన్ని అభివృద్ధినిరోధక పార్టీలు కోరినకోర్కెను అది అంగీకరించలేదు. 1962 అక్టోబరు ఘటనల తర్వాత చైనా పెద్దపెట్టున దాడి చేసిన తర్వాత ఇప్పటికికూడా, టిబెట్‌ను విముక్తిచేయాలని మాట్లాడే ఆ అభివృది నిరోధకులను బల పరచే వారిక్కడ ఎక్కువమంది లేరు.

భారత ప్రభుత్వంలో అనేకమంది అభివృద్ధి నిరోధక వ్యక్తులున్నప్పటికీ, అది బూర్జువా ప్రభుత్వం అయినప్పటికీ, అమెరికా లేక బ్రిటిష్ సామ్రాజ్యవాదులుగాని, భారతదేశంలోని వారి మిత్రులుగాని ఆదేశించిన విధానాలను అది కొనసాగించలేదు. కనుకనే ఇది సాధ్యమయింది.

చైనా నాయకత్వం ఈ విషయాన్ని అంగీకరించిందా? ఇదివరలో అంగీకరించారు. కాని ఇపుడు అంగీకరించడంలేదు.

1959 మే 6 వ తేదీన "పీపుల్సుడైలీ" లోని "టిబెట్‌లో విప్లవం, నెహ్రూ తాత్విక దృక్పథం" అనే వ్యాసంలో ఇలా ఉంది:

"అంతర్జాతీయ వ్యవహారాల్లో, ప్రధాని నెహ్రూ నాయకత్వాన ఉన్న భారత ప్రభుత్వం, భారతప్రజల అభీష్టాన్ని సాధారణంగా ప్రతిబింబించుతూవుంది; చైనాతోను, సోవియట్ యూనియన్‌తోను, ఇతర సోషలిస్టుదేశాలతో స్నేహపూర్వకమైన విదేశాంగ విధానం కొనసాగించుట ద్వారాను, అమెరికా సామ్రాజ్యవాద సైనికకూటమిలో చేరకుండుటలోను, శాంతిని కాపాడుటలోను, యుద్ధాన్ని, వలసవిధానాన్ని వ్యతిరేకించుటలోను ప్రముఖమైన, ప్రశంసార్హమైన పాత్ర

వహించుతోంది... కాని కొన్ని చారిత్రక కారణాలవల్ల భారతదేశపు బడా బూర్జువావర్గం బ్రిటిష్ వలసపాలకులనుండి కొన్ని వారసత్వాలను పొంది వాటిని కొనసాగించడానికి ప్రయత్నించుతున్నది."

అందుచేత, బ్రిటిష్‌సామ్రాజ్యవాదంతో బడా బూర్జువాకు సంబంధాలు ఉన్నప్పటికీ "ప్రధాని నెహ్రూ నాయకత్వాన ఉన్న భారత ప్రభుత్వం" సామ్రాజ్యవ్యతిరేకమైనది; యుద్ధ వ్యతిరేకమైనది; శాంతి శిబిరంలో వుంది. చైనాతోను, సోషలిస్టుదేశాలతోను స్నేహంగా వుంది... వగైరా...

ఇవి, పీపుల్స్‌డైలీ, అనగా చైనా కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం, 1959 మే 6 వ తేదీన అన్నమాటలు.

1962 అక్టోబరు 27 వ తేదీన "భారత చైనా సరిహద్దు సమస్య దృష్ట్యా నెహ్రూ తాత్విక దృక్పథంపై మరికొంత..." అనే వ్యాసంలో వారు మరో వైఖరిని అవలంబించారు. దీనిలో అదే చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం ఇలా వ్రాసింది :

"చైనా స్వాతంత్ర్యం ప్రకటింపబడిన తర్వాత నెహ్రూ నాయకత్వాన భారత పాలకవర్గాలు, బ్రిటిషు వలసపాలకుల నుండి పొందిన వారసత్వాలను నిలబెట్టడానికి తమ శాయశక్తులా కృషి చేశారు; వారి జాతీయ దురహంకార విస్తరణవాద విధానాన్ని కొనసాగించుటలో వారు సిగ్గువిడిచి మరీ మరీ ప్రవర్తించారు."

ఈ రెండు ప్రకటనలను సరిపోల్చిచూస్తే, భారతదేశ పరిస్థితిని అర్థంచేసుకోడంలో చైనా నాయకత్వానికి ఉన్న గందరగోళం బోధపడుతుంది. ఈ రెండు అంచనాలు మొరటుగాను, స్పష్టంగాను పరస్పర విరుద్ధంగా ఉన్నాయి.

నెహ్రూ నాయకత్వాన భారత పాలకవర్గాలకు విస్తరణ వాంఛలు ఉన్నట్లయితే వారు సామ్రాజ్యవాదుల ఆజ్ఞలనూ, ఆదేశాలను అనుసరించి పని చేస్తున్నట్లయితే, టిబెట్ స్థావరాలను వారు వదలుకొని యుండేవారు కాదు. తమ సైన్యాలను ఉపసంహరించుకొని 1954 లో స్నేహసంధిని చేసుకొని యుండేవారు కాదు. 1959 లో పునరారోహించడానికి తమకు అనమకూలమైన పరిస్థితుల లోనూ

ప్రాంతాల్లోనూ, యుద్ధాన్ని ఆహ్వానించడానికి 1954 లో టిబెట్ పీఠ భూమినీ, ఉన్నత ప్రదేశాలనూ వారు చేజేతులా వదలుకొని యుండే వారు కాదు.

భారత బడా బూర్జువాకు, దాని నాయకుడు నెహ్రూకు, ఆయన సామ్రాజ్యవాద సలహాదారులకు ఈ మాత్రం లోకజ్ఞానం ఉ ఋందని తన పరిశీలనలో "పీపుల్సు డైలీ" గ్రహించి యుండాలిసి వుంది. 1959 మే నెలలో నెహ్రూ తాత్విక దృక్పథంపై చైనావారి ప్రథమ పరిశీలనలో ఆయన సామ్రాజ్యవాద వ్యతిరేకిగా, చైనా స్నేహితుడిగా కన్పించారు. కాని 1962 అక్టోబరులో 'మరింత పరిశీలన అనంతరం' "మరికొంత వెలుగు" వచ్చి ఆయన తద్విరుద్ధంగా కన్పించారు.

## మూలవిధానం మార్పుచెందిందా?

అసలు ప్రశ్న ఇది: శాంతి, తటస్థ విధానం, వలసవిధాన వ్యతిరేకత అనే భారతదేశ విదేశాంగ మూల విధానం పూర్తిగా మార్పు చెందిందా? లేక చైనా నాయకత్వదృష్టి, పరిశీలనా మార్పు చెందిందా?

ఈ ప్రశ్న చాలా తీవ్రమైనది. మాపార్టీని అది చాలాకాలం గందరగోళపరచింది. విప్లవ సమస్యలను అంత విజయవంతంగా పరిష్కరించిన చైనాపార్టీ, మార్క్సిజం – లెనినిజం సిద్ధాంతంలో గతితార్కిక చారిత్రక వాదంలోనూ బాగా దిట్టయైన చైనాపార్టీ చేసిన నిర్ణయాలను, సంగతులను ఎవరైనా ఎలా అనుమానించగలరు? పైగా భారత దేశం పరిస్థితి గురించి వారు ఉదహరించిన కొన్ని సంగతులు, వారు వచ్చిన నిర్ధారణలు నిజమనే ప్రాతిపదికను ఏర్పరుస్తాయి కూడా.

భారతదేశం స్వాతంత్ర్యం పొందినమాట వాస్తవమైనప్పటికీ, సామ్రాజ్యవాద పెట్టుబడి అవశేషాలు ఇంకా ఉన్నాయి. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత పదేండ్లలో బ్రిటిషు పెట్టుబడి రెండింతలయింది. భారత ఆర్థిక విధానంలోకి చాలావేగంగా అమెరికా పెట్టుబడి చొచ్చుకుపోయింది. భూ సమస్య పరిష్కరింపబడలేదు, రైతులలో

అసంతృప్తి పెరిగింది. పారిశ్రామిక, వ్యావసాయికఉత్పత్తి సంక్షోభంలో పడింది; అనుకొన్న విధంగా ఈ ఉత్పత్తి పెంపొందటంలేదు. కొద్దిమంది చేతుల్లో సంపద కేంద్రీకృతమయింది. పంచవర్ష ప్రణాళికలనబడేవి, పెట్టుబడివిధానంలో, సహజంగా ఇమిడిఉన్న తీవ్రమైన చిక్కులను ఎదుర్కొంటున్నాయి ; రోజురోజుకూ విదేశీసహాయంపైన, ముఖ్యంగా అమెరికా సహాయంపైన ఆధారపడుతూ ఉన్నాయి సమ్మెలు వగైరా లలో వ్యక్తమౌతూ వచ్చిన ప్రజల అసంతృప్తిని ప్రభుత్వం హింసా కాండతో అణచివేస్తోంది. అభివృద్ధి నిరోధక పార్టీలు, ముఠాలు మరింత బలపడి సామ్రాజ్యవాదులతో మిలాఖత్తై, దేశాన్ని అమెరికా శిబిరంలోకి ఈడ్చాలని, తటస్థవిధానాన్ని విడనాడేటట్లు చేయాలని, ప్రయత్నిస్తున్నాయి.

ఉన్నవి ఉన్నట్లు పైన పేర్కొన్న ఈ విషయాలను తీసుకుంటే, మొత్తంమీద తప్పా ? కావు. అందుచేత ఒకచోట, చైనా నాయకత్వం ఈ క్రింది నిర్ధారణకు వచ్చింది :

"ఆర్థికంగా భారతదేశం సామ్రాజ్యవాదంమీద ఆదారపడటం నుండి విముక్తి కాలేదని ఈ విషయాలు రుజువు చేస్తున్నాయి. భారత దేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద గుత్తాధికార స్థానాన్ని అమెరికా సామ్రాజ్యవాదం క్రమంగా తీసుకొంటున్నదన్న విషయం గతానికీ ఇప్పటికీగల భేదం"

ఇంతేగాక :—

"ఒక్కమాటలో తమ స్వంత అవసరాలను సంతృప్తి పరచుకో డానికీ, అమెరికా సామ్రాజ్యవాదం కోర్కెలను తీర్చడానికీ, వారుచేసే ప్రయత్నాలలో నెహ్రూ నాయకత్వానగల భారత పాలకవర్గాలు చైనా వ్యతిరేక అంతర్జాతీయ ప్రచారంలో పావికలయ్యారు. భారత చైనా సరిహద్దు వివాదానికి మూలకారణం, పూర్వవృత్తాంతమూ అది."

గీతలు నావి : డాంగే

వాస్తవంగా ఈ విషయాలన్నీ అలా ఉన్నట్లయితే, ఈ నిర్ధారణలతో ఏ మార్క్సిస్టు-లెనినిస్టు విభేదించుతాడు ?

చైనాపార్టీ చేసిన అలాంటి నిర్ధారణలతో భారత కమ్యూనిస్టు పార్టీ విభేదించడమేగాక, ఈ విషయాలను గురించి చెప్పే ప్రకటనతో గూడ తీవ్ర విభేదాన్ని కల్గియుంది.

ఒక్కొక్క అంశం వేరుగా తీసుకొంటే, సరియైనదే. కాని అది సమగ్రం కాదు. అందుచేత, సమగ్ర స్వరూప చిత్రణను చైనా తప్పుగా ఇస్తున్నది. **అసమగ్రంగా** విషయాలను పేర్కొనడం, **పాక్షికంగా** మాత్రమే వున్న విషయాన్ని అధ్యయనం చేయడం, మార్క్సిస్టు-లెనినిస్టు పద్ధతికాదు. "వైరుధ్యాలను" గురించి బోలెడంత మనకు బోధించగల అనుభవజ్ఞులైన చైనా నాయకులకు, ఆ విషయాలను అన్ని ముఖాల నుండి అధ్యయనం చేయాలని మనం చెప్పాలా?

విదేశీ పెట్టుబడి రెట్టింపుకాలేదా? అమెరికా పెట్టుబడి పెరగలేదా? అయింది! అయితే **భారత అర్థిక విధానంలో ఇంకా కొన్ని విషయాలు కూడా జరిగాయి.** అవి:

(అ) ఆంగ్లో-అమెరికన్ లేక సామ్రాజ్యవాద పెట్టుబడితోపాటు సోషలిస్టుదేశాలనుండి కూడా ఋణాలను, సహాయాన్ని భారతదేశం పొందింది. సోషలిస్టుదేశాల నుండి వచ్చిన సహాయం భారతదేశంలో ముఖ్యమైన కీలక పరిశ్రమల నిర్మాణానికి ఉపయోగపడింది. తద్వారా భారతదేశం సామ్రాజ్యవాద సహాయంపై ఆధారపడటం తగ్గించబడింది. భారతదేశంయొక్క స్వాతంత్ర్యం దృఢపడింది. అలాగని ఆంగ్లో-అమెరికన్ పెట్టుబడులున్నా మన స్వాతంత్ర్యానికి ప్రమాదం లేదని అర్థంకాదు.

(ఆ) సోషలిస్టు దేశాలనుండి తీసుకున్న పెట్టుబడితో కూడా కలుపుకొని భారతదేశపు పెట్టుబడీ, బలమూ అమెరికా పెట్టిన పెట్టుబడితో పోల్చితే ఎక్కువగా పెరిగింది. నూతనంగా విముక్తిచెందిన ఏ కూటమికి చెందని దేశంలో ఈ విషయానికి చాలా ప్రాముఖ్యం వుంది.

(ఇ) భారతదేశంలో ప్రయివేటురంగంలో పెట్టుబడితోపాటు, ప్రభుత్వరంగంలోని పెట్టుబడికూడా పెరిగింది. ఈ రంగం ప్రభుత్వ పెట్టుబడిదారీ స్వభావం కల్గివుంది. కాని వెనుకబడిన ఆర్థికవిధానంలో,

ప్రజాతంత్ర శక్తుల ఒత్తిడిక్రింద అది అభ్యుదయకరపాత్రను వహించగలదు.

భారత ఆర్థికరంగంలో పారిశ్రామికాభివృద్ధికి సంబంధించిన ఈ మూడు ముఖ్య వాస్తవాంశాలు చైనా చిత్రీకరణలో కన్పించవు. ప్రభుత్వరంగం గురించి వారు ప్రస్తావించారు కాని, గుత్తాధిపతుల ముఠాలకు సేవచేస్తున్న నిరంకుశాధికార గుత్తాధిపతుల పెట్టుబడిగా దానిని వర్ణించి ఖండించారు. సామ్రాజ్యవాదుల కిష్టంలేని భారతదేశ పరిశ్రమలలోని **నూతన సాంకేతిక పునాదిని గురించీ,** అభివృద్ధినిరోధకులు భయపడే నూతన కార్మికవర్గం, మేధావివర్గం గురించీ చైనా చిత్రీకరణలో ఎక్కడా కన్పడదు.

భూసమస్య పరిష్కారం కాలేదు, రైతు అసంతృప్తి చెంది వున్నాడు. కాని భూస్వామ్య విధాన యధాతథస్థితిని పూర్తిగా రద్దు చేయకపోయినా, అది చాలవరకు అణచివేయబడింది. భూసంస్కరణలకు మరింత పట్టుదల అవసరం, అది సాధ్యంకూడా.

సంపద కేంద్రీకరణకు వ్యతిరేకంగా పోరాటం, ప్రజల హక్కులను, స్వాతంత్ర్యాలనూ రక్షించడం, మితవాద అభివృద్ధి నిరోధకులు తలయెత్తి పెంపొందినప్పటికీ బలపడుతూనేవుంది. దీనికి కేరళలో మంత్రివర్గం ఏర్పడటం ఒక తార్కాణం.

ప్రభుత్వం సమ్మె పోరాటాలను అణచివేస్తున్నది కాని కార్మికులుకూడా విజయాలు సాధించి, తమ కోర్కెలను నెరవేర్చుకోగల్గుతున్నారు. అత్యవసర పరిస్థితి కాలంలోను, భారత రక్షణ చట్టం నిబంధనల పరిపాలనా కాలంలోనూ, వేతన నిర్ణాయక సంఘాలు జీతాల పెంపుదలను ప్రకటించాయి. వాటిని మొండిగా ఎదిరించిన యజమానులు కార్మికుల కోర్కెలను, సమ్మెలను ఎదుర్కోవలసి వచ్చింది.

"బడా బూర్జువా భూస్వాముల నియంతృత్వం" తన పార్లమెంటరీ విధానాన్ని, వయోజనుల వోటింగుహక్కు అనే ప్రాతిపదికపై ఎన్నికలు జరిపే బూర్జువా ప్రజాతంత్ర విధానాన్నీ వదలివేయలేదు. చైనా చిత్రీకరణలో ఈ అంశాలుకూడా కనిపించవు.

ఇంతేగాక, భారతదేశంలో ఇతర ప్రజాతంత్ర శక్తులతోపాటు కమ్యూనిస్టుపార్టీ కూడా పనిచేస్తున్నది. కమ్యూనిస్టుపార్టీ పాలకపార్టీ యైన కాంగ్రెసుకు ప్రథమ ప్రతిపక్షపార్టీగా వుంది.

ప్రభుత్వ విదేశాంగవిధానం ప్రధానంగా శాంతి, తటస్థత వలస వ్యతిరేకతలతోకూడిన విధానం. అదేసమయంలో అభివృద్ధి నిరోధకుల ఒత్తిడికి అది ఊగిసలాడుతూ, బలహీనపడుతూ ఉంటుంది.

"భారత పాలకముఠా విదేశాంగ విధానం ఇటీవలి సంవత్సరాలలో, అమెరికాయొక్క ఆమోదమూ, హర్షమూ ఎక్కువగా పొందుతూ వచ్చింది." అంటూ 1961 డిసెంబర్ 7 న చైనా నాయకత్వం వ్రాసింది. సరిగ్గా, అదే రోజుల్లో. డిసెంబర్ 18 న భారత సైన్యం గోవాలో ప్రవేశించి, నాలుగువందల సంవత్సరాల పోర్చుగీసు పరిపాలననుండి దానిని విముక్తిచేసింది. నెహ్రూపై బ్రిటన్, అమెరికాలు ఆగ్రహావేశం చెందాయి. ఐ రా స ను జోక్యం కలుగచేసుకోవాలని కోరాయి కాని సోవియట్ వీటో వాటిని అరికట్టింది. చైనా చిత్రీకరణలో ఒక్కమాట కూడా ఈ విషయం గురించిలేదు.

## అంతర్గర్భితమైన ముఖ్యవిషయాలను వదలివేశారు

భారతదేశం గురించి క్లుప్తంగా చెప్పాలంటే వాస్తవ విషయాలవి. కాని చైనావారు చెప్పుతున్నదానిని చదివితే, భారతదేశ పరిస్థితిలో అంతర్గర్భితమైన ఈ అత్యంత ముఖ్యవిషయాలు కన్పించవు. ఇలాంటి అంతర్గర్భితమైన ముఖ్యవిషయాలను వదలిపెట్టి, లేదా కావాలని విస్మరించి, తాము మనస్సులో పెట్టుకొన్న అభిప్రాయాలతో తమ కిష్టమైన విషయాలను మాత్రమే చూస్తూ చైనా నాయకత్వం, భారత చైనా ఘర్షణకు మూలకారణం విషయమై పైన చెప్పిన నిర్ధారణకు వచ్చింది.

వారు చెప్పినది మూలకారణం కాదని సుస్పష్టమే. భారత దేశాన్ని సంక్షోభంలోకి నెట్టడంలో సామ్రాజ్యవాదుల భారతదేశ అభివృద్ధినిరోధకుల బాధ్యత వుంది. దానిని మేము కాదనడం లేదు.

అయితే అదే సమయంలో, భారత – చైనా వివాదానికి మూలకారణం, ప్రపంచా న్నెదుర్కొంటున్న ప్రధాన సమస్యలను అవగతం చేసుకోవ డంలోను, వాటిని పరిష్కరించే విధానంలోను చైనా నాయకత్వం తన ధోరణి మార్చుకున్నందువల్ల నే అని అంటున్నాం.

భారతదేశం ఇప్పటికే, అమెరికా సామ్రాజ్యవాదులకు వేదిక యనీ, "అమెరికా డాలర్లకు నెహ్రూ కీలుబొమ్మ" అనీ, "అమెరికా సహాయం మొత్తం పెరిగినకొలదీ, అందుకు తగినట్లుగా భారతదేశంలో చైనా వ్యతిరేక ప్రచారోద్యమం పెరుగుతూంది" అనీ, భారత ప్రజానీకం పై ప్రభుత్వాన్ని కూలదోయడానికి ఆతృతతో వేచియుంటూ, అందుకు సంసిద్ధంగా ఉన్నారనీ చైనా నాయకత్వం భావించింది. అందుచేత అలాంటి ప్రభుత్వంతో సాయుధ సంఘర్షణ, భారతప్రజల, చైనాప్రజల ప్రయోజనాలదృష్ట్యా అవసరమూ, తప్పనిసరీ అని అభిప్రాయపడింది. ఎందువల్లనంటే, సాయుధ సంఘర్షణద్వారానే ఎక్కడైనా, ఏ సమస్య పైన ఐనా, మానవజాతికి శత్రువులైన అమెరికా సామ్రాజ్యవాదులను, వారి తొత్తులను పోరాడి కూల దోయాలి. ప్రపంచ విప్లవం పరిపక్వమై సంసిద్ధంగావుంది; ఆధునిక రివిజనిస్టులు మాత్రమే దారికి అడ్డుగా నిలు స్తున్నారు. ఇదీ చైనా నాయకత్వం ధోరణి.

ఈ కర్తవ్యంలో, నీఫా సరిహద్దులో తమ పురోగమనానికి భారత కమ్యూనిస్టుపార్టీ దేశం లోపలినుండి దాడి చేయుటద్వారా సహాయపడాలనీ, ఆ విధంగా నెహ్రూ ప్రభుత్వాన్ని ఒకరకంగా అడ కత్తెరలో పెట్టాలనీ చైనా నాయకత్వం కోరింది. 1962 అక్టోబర్ 27 వ తేదీ ప్రకటనలో వారు దానిని సూచించారు.

అందుచేత సరిహద్దు వివాదానికి మూలకారణం, భూగోళ పటాలుగాని, గత చరిత్రగాని కాదు. రాజకీయ, సిద్ధాంత వైఖరులే కారణం. భారత చైనా దేశాలమధ్య మిత్రత్వంపోయి శత్రుత్వంరావడా నికీ, ప్రతిష్టంభన పోయి 1962 అక్టోబరు నవంబరులలో దాదాపు యుద్ధంతో సమానమైన దాడి ప్రారంభం కావడానికి మూల మిదే.

ఒకే ఒక సామ్రాజ్యవాద దేశపు దురాక్రమణఫలితంగా ఏర్పడ్డ మాక్‌మాహన్ శ్రేణిని చైనా నాయకత్వం బర్మా సరిహద్దుకు సంబంధించినంతవరకు అంగీకరించుతున్నప్పటికీ, భారత సరిహద్దువిషయంలో అంగీకరించకపోవడానికి మూలకారణమిదే.

# 2

# శత్రుత్వానికి మూలకారణం

సరిహద్దు విషయమై ఇండియా - చైనా దేశాల మధ్య వచ్చిన తగాదాకు నిజమయిన కారణాలు ఏమిటో కనుగొనటం మా పార్టీకి చాలా కిష్ట సమస్యగా తయారయిందని యిదివరకే ఉదహరించాం. చాలాకాలంవరకు సరిహద్దు విషయమై ఎలాంటి స్పష్టమయిన వైఖరినీ మా పార్టీ నిర్ణయించలేదు. మ్యాపులు (సరిహద్దు పటాలు) గందరగోళపరచడమే గాకుండా అంతకంటే ఈ సమస్యనుగురించిన రాజకీయాలు అగమ్యగోచరంగా ఉండేవి అనుభవం కలిగిన మార్క్సిస్టు - లెనినిస్టులైనా చైనా నాయకులు ఈ సరిహద్దు సమస్యలో అంత పట్టుదలను పిడివాద ధోరణిని అనుసరించుతారని మే మనుకోలేదు. అదే విధంగా నెహ్రూ ప్రభుత్వం రాజ్య విస్తరణకు చైనాతో యుద్ధానికి తయారవుతూం దన్న అభిప్రాయాన్ని మేము అంగీకరించలేక పోయాము.

ఐతే చైనా-భారతదేశాల మధ్య తగాదాను రెచ్చగొట్టేదుకు సామ్రాజ్యవాదులు, భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులు కాంక్షించు తున్నారనీ, అందువల్ల, ఉభయదేశాలు బలహీనపడతాయనీ మేము గుర్తించకపోలేదు. అందుచేతనే ప్రతీఘాతక శక్తులను హెచ్చరించటంతోబాటు రాయబారాలద్వారా శాంతియుత పరిష్కారం చేసుకోవాలని ఎలుగెత్తి చాటాము. చైనా ప్రకటించిన సరిహద్దు పటాలు సరైనవా, లేక ఇండియా ప్రభుత్వానివి సరైనవా? ఏ సరి

హద్దు రేఖ సరైనది అనే విషయంపై మేము యిదమిద్ధమని నిర్ణయించ లేదు.

1959 ఆగస్టు చివర్లో లాంగ్జూవద్ద ఒక సరిహద్దు ఘర్షణ జరిగింది. తత్ఫలిత గా భారతదేశంలో ఉద్రిక్తత పెరిగింది చైనా ప్రధానమంత్రి చౌ-ఎన్‌లై సెప్టెంబరు 8 వ తేదీన నెహ్రూకు దీర్ఘమైన జాబు వ్రాశారు. మార్చి 22 వ తేదీన నెహ్రూ వ్రాసిన జాబుకు సమాధానంగా ఆరు నెలల దీర్ఘకాలానంతరం ఈ జాబు వ్రాయబడింది. దీనిలో మాక్‌మాహన్ రేఖ "బ్రిటిష్ దురాక్రమణ రాజనీతి' వల్ల సృష్టించబడినది" చైనా ప్రభుత్వం పేర్కొన్నది. దానిని గుర్తించ నిరాకరించింది. ఆ రేఖకు దక్షిణంగావున్న 90 వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతం తమదని చైనా డిమాండు చేసింది. ఆ లేఖలో యిలావుంది :

"ప్రధాన మంత్రీ! చట్టవిరుద్ధమైన అలాంటి రేఖను చైనా ఎలా బలవంతాన అంగీకరించుతుంది? అంత విశాలమైన ప్రాంతాన్ని అమ్ముటద్వారా తమ హక్కులను వదలుకోడానికి అంగీకరించి తన్ను తాను ఎలా అవమానపరుచుకు టుంది?"

## మా వైఖరి రూపొందిన విధం

లాంగ్జూ సరిహద్దు ఘర్షణ అనంతరం ఉద్రిక్తత పెరిగిన సమయంలో అభివృద్ధి నిరోధకులు మా పార్టీపై దాడి చేయడానికి పై లేఖను వినియోగించుకున్నారు అంతేకాదు. నిజాయతీపరులైన దేశ భక్తులు సైతం, సరిహద్దు సమస్యలో చైనా కోర్కెలయెడల మా పార్టీ వైఖరి ఏమిటో స్పష్ట రచాలని డిమాండు చేశారు. మాక్‌మాహన్ రేఖను అంగీకరించుతామా లేదా? చైనా దురాక్రమణ జరుపుతూందని ఒప్పుకు టామా లేదా? అని సూటిగా ప్రశ్నించ సాగారు.

అలాంటి పరిస్థితులలో మా పార్టీ కేంద్ర కార్య నిర్వాహకవర్గం కలకత్తాలో సమావేశమయింది. 1959 సెప్టెంబరు 5 వ తేదీన ఒక తీర్మానం చేసింది. కాని ఆ తీర్మానం సందిగ్ధంగా వుందని జనసామాన్యం అభిప్రాయపడింది. తీర్మానంలో యిలా వుంది :

'...ఈ విభేదాలను స్నేహపూర్వక చర్చలద్వారా, సంప్ర తింపులద్వారా పరిష్కరించుకోవచ్చు. చైనా మ్యాపులనుగాని, మాక్ మాహన్ శ్రేణినిగాని అంగీకరించాలని ఏ పక్షమూ ముందుగానే షరతులు పెట్టకుండా రాయబారాలు ప్రారంభించాలి'

దురాక్రమణ విషయమై తీర్మానంలో యిలా వుంది :

'భారతదేశంయొక్క ప్రాంతీయ సమగ్రతను కాపాడటంలో యావత్తుప్రజలతోపాటు మా పార్టీకూడ బద్ధకంకణ మౌతుందనీ, ఎవ రికీ తీసిపోదనీ కార్యనిర్వాహకవర్గం పునరుద్ఘాటించుతుంది. ఐనప్పటికీ సోషలిస్టుచైనా ఎన్నడూ భారతదేశంపై దురాక్రమణ చేయబోదని కమిటీ విశ్వసించుతోంది. అలాగే చైనాపై దురాక్రమణ చేయాలనే వుద్దేశం మన దేశానికి లేదని నమ్ముతోంది."

తీర్మానంలోని యీ భాగంవల్ల కొన్ని కీలకమైన ప్రశ్నలు ఉదయించాయి రెండు కొలతబద్దలు ప్రయోగించారని మమ్ము తీవ్రంగా విమర్శించారు. సోషలిస్టు విధానం వుంది కాబట్టి తత్కారణంగా సోష లిస్టు చైనా దురాక్రమణ చేయడమనే సంగతే వుండజాలదంటున్నారు. కాని, పెట్టుబడిదారీ విధానంక్రిందవున్న భారతదేశానికి, కాంగ్రెస్ నాయకత్వంచేత, నెహ్రూచేత ప్రస్తుతం నడపబడుతున్న భారతదేశా నికి, దురాక్రమణ జరిపే వుద్దేశ్యం లేదంటున్నారు. సోషలిజం మూల సిద్ధాంతాలపై ఆధారపడి చైనా విషయంలో దురాక్రమణ అసంభవమని తోసివేస్తున్నారు. పెట్టుబడిదారీ విధానం మూలసిద్ధాంతాలపై ఆధార పడిన ఇండియావిషయంలో దురాక్రమణ అసంభవమని తోసివేయలేరు. తటస్థ విదేశాంగ విధానాన్ని, శాంతియుత సహజీవన సూత్రాన్ని భారతదేశం పెట్టుబడిదారీ విధానంక్రిందవున్నప్పటికీ అనుసరించడం వల్లనే దురాక్రమణ వుద్దేశం దానికి ఉండదంటున్నారు.

మార్క్సిస్టు-లెనినిస్టు అవగాహనకు సంబంధించినంతవరకు పైన తెలిపిన విచక్షణ సరైందే కావచ్చు: కాని సామాన్య ప్రజల దృష్టికి మాత్రం సిద్ధాంత రూపమైన అలాంటి సూక్ష్మాంశాలు (నైసిటీస్) అగమ్యగోచరంగా వుంటాయి. అందుచేత సహజంగానే మమ్ములను అపార్థం చేసుకున్నారు.

దీనికితోడు 'న్యూఏజ్' మాసపత్రికలో వ్రాసిన వ్యాసం మరింత అపార్థం కలిగించింది. ఏమంటే ఆ వ్యాసంలో చైనా కోర్కెలు సరైనవే నని దాదాపు అంగీకరించటం జరిగింది. పార్టీ కేంద్ర ఆఫీసు ఒక ప్రకటనచేస్తూ ఆ వ్యాసాన్ని ఖండించవలసి వచ్చింది.

ఉద్రిక్తత, ఘర్షణ పెరుగుతున్న ఆ పరిస్థితులలో కేంద్ర కార్య నిర్వాహకవర్గం ఒక రాయబారవర్గాన్ని కలకత్తా తీర్మానంతో చైనాకు పంపింది. పెకింగ్‌లో అక్టోబర్ ఉత్సవాల సందర్భంలో రాయబారవర్గం చైనా నాయకత్వాన్ని కలుసుకుంది.

భారత సరిహద్దుగా మాక్‌మాహన్ రేఖను గుర్తించ నిరాక రించడంలో చైనా వైఖరి సరికాదనే నిర్ణయానికి మా పార్టీ అప్పుడే వస్తోంది. అయినప్పటికీ ఈ సమస్యను సోదరపార్టీతో చర్చించేవరకూ, వారికి ముందుగా మా అభిప్రాయాలను తెలిపేవరకూ, ఎలాంటి ప్రకటనా చేయరాదనుకున్నాం.

అదేవిధంగా టిబెట్ తిరుగుబాటు సందర్భంలో భారత ప్రతీ ఘాతుక శక్తుల పాత్రను మేము ఉపేక్ష చేయకపోయినప్పటికీ, "నెహ్రూచే రెచ్చగొట్టబడినద"ని భారతదేశ పాత్రను గురించి చైనా చేసిన ప్రకటనను మేము అంగీకరించలేము.

సాధారణ మర్యాదలను, వివిధ పార్టీలమధ్య సత్సంబంధాలను దృష్టిలో ఉంచుకొని, ఈ విధంగా మేము సరైనవనుకున్న అభిప్రాయా లను, సోదరపార్టీ వైఖరికి వ్యతిరేకమౌతాయని ప్రజలకు చెప్పకుండా వుండటంలో మా పార్టీ విజ్ఞతను కనపరచిందా?

## భారత నాయకత్వంపై ఏవగింపు

రాయబారవర్గాన్ని పంపకముందు మా అభిప్రాయాలను చైనాపార్టీకి తెలియజేయకపోలేదు. ఐనప్పటికీ మా నాయకత్వాన్ని చైనా కామ్రేడ్స్ ఏహ్యభావంతో చూశారు. మా పార్టీ ప్రధాన కార్యదర్శి అజయ్‌ఘోష్ అనేకసార్లు వ్రాశారు. టిబెట్ సంఘటనలను గురించి 1959 మే 3, 5 తేదీలలో రెండు దీర్ఘమైన జాబులు వ్రాశారు. వాటిలో భారత అభివృద్ధి నిరోధకులు సాగించుతున్న చైనా వ్యతిరేక

ప్రచారాన్ని, కొన్ని నెహ్రూ ప్రకటనలను ఖండించడంతోపాటు, చైనా నాయకుల ప్రకటనల్లోని తప్పులను చూపి, వాటిని సరిదిద్దుకోవాలని కోరబడింది.

ఈ పొడుగాటి జాబుకు క్లుప్తంగా కటువైన సమాధానంమాత్రం వచ్చింది: "ఉభయదేశాల మైత్రి క్లిష్టపరిస్థితులను ఎదుర్కొంటు న్నప్పుడు, కమ్యూనిస్టు వుద్యమానికే ముఖ్యమైన సమస్యలను గురించి యిలాంటి సమాధానం సోదరపార్టీనుండి వస్తుందని మేము ఆశించ లేదు." (1960 డిసెంబరు 27 తేదీ సమావేశంలో జాతీయసమితి ఆమోదించిన మెమొరాండం)

1959 అగస్టు 20 తేదీన మరల ఒక జాబు చైనా కమ్యూనిస్టు పార్టీకి వ్రాయబడింది:

"...చైనాకు వ్యతిరేకంగా క్రమంగా వృద్ధిచెందుతున్న ఆందోళన, భారతదేశ విదేశాంగ విధానానికి, భారత-చైనా స్నేహానికి, భారత కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా జరుపుతున్న వుద్యమమే. ప్రస్తుతమున్న విభేదాలు యింకా తీవ్రమయితే, భారత విదేశాంగ విధానానికే ప్రమాదం ఏర్పడుతుంది. భారతదేశాన్ని అమెరికా వైపుకు నెట్టడానికి మితవాదులకు అవకాశ మిస్తుంది. భారత కమ్యూనిస్టుపార్టీపై దాడికి దోహదమిస్తుంది... ..."

## సంప్రదింపులు సాగించాలని విజ్ఞప్తి

సరిహద్దు ఘర్షణలు కొన్ని జరిగినస దర్భంలో 1959 సెప్టెంబరు 13వ తేదీన తిరిగి మరొక లేఖ పంపబడింది. అందులో ఇలా ఉంది:

"చైనా ప్రజా రిపబ్లిక్, భారతప్రభుత్వమూ పరస్పరం తమ అభిప్రాయాలు తెలియజేసుకోవాలనీ, సంప్రతి పులకు కొన్ని చర్యలు తీసుకోవాలనీ నేను చిత్తశుద్ధితో కోరుతున్నాను. ఏమాత్రం ఆలస్యం జరిగినా, చైనాకు వ్యతిరేకంగా శత్రుత్వం సృష్టింపజూస్తున్న శక్తులకు, ఆంగ్లో-అమెరికన్ శిబిర వైపు భారతదేశాన్ని లాగాలనిచూచే శక్తులకు సహాయపడుతుంది. అలాంటి పరిణామం, శాంతికీ, ఆఫ్రికా — ఆసియా సంఘీభావానికి హానికరమైన నష్టాన్ని కలుగజేస్తుంది ...

'జాతీయ రక్షణ', 'జాతీయ ప్రయోజనాలు' పేరిట మా పార్టీకి వ్యతిరేకంగా, ప్రజాతంత్రానికి వ్యతిరేకంగా, కాంగ్రెసులోని అభివృద్ధి కాముకులకు వ్యతిరేకంగా, మితవాదులదాడికి అది సుగమం చేస్తుంది.

ఇంత జరిగినా, మా కేంద్ర కార్యనిర్వాహకవర్గం, మాక్‌మాహన్ శ్రేణిపైన, చైనాతో విభేదించే ధోరణిని అవలంబించలేదు. దురాక్రమణ విషయంలో వారిని మా ప్రతినిధివర్గం కలుసుకొని, వారి ధోరణి ఎలాంటి కీడు కల్గించుతోందో నచ్చజెప్పడానికి ప్రయత్నించేవరకూ, చైనాతో విభేదించే ధోరణిని అవలంబించలేదు. సోదర పార్టీలమధ్య ప్రవర్తన విషయమై అవలంబించవలసిన సూత్రాలను అనుసరించడానికి మేము ప్రయత్నించుతూ వచ్చాము. కాని ఆ సూత్రాలనుగురించి పెద్ద నిగర్గోలుచేసి చైనానాయకులు వాటిని ఎన్నడో గాలికి వదలివేశారు.

అందుచేత 1959 సెప్టెంబర్ 25 నాటి కలకత్తా తీర్మానంలో, సోషలిస్టుదేశం దురాక్రమణ చేయదనీ, భారతదేశం — చైనా రెండూ కూడా ఒకదానిపై ఒకటి యుద్ధం చేయాలని కోరడంలేదనీ, శాంతి యుతంగా జీవించ కోరుతున్నాయనీ మేము ప్రకటించాం.

"ఏ దురాక్రమణకు వ్యతిరేకంగా నయినా దేశ సమగ్రతను రక్షించుతాం" అని మేము అన్నప్పుడు, మా మనస్సులో ఎవరి దురాక్రమణగురించి ఉన్నదని ప్రజలు అడుగుతూ ఉండేవారు. మేము రక్షణ గురించి మాట్లాడినపుడు, మాలో ఎవరూకూడా బహిరంగంగా చాలా కాలంవరకు అది భారత — చైనా సరిహద్దు ఘర్షణకు సంబంధించినదని చెప్ప సాహసించేవారం కాదు; దురాక్రమణ అన్న పదం చైనా చర్యలకు, వాదనలకు సంబంధించి ఉన్నదనికూడా చెప్ప సాహసించేవారం కాదు. భారతదేశంలాంటి దేశంపట్ల చైనా సరిగా ప్రవర్తించడం లేదని వేలాది పార్టీసభ్యులు భావించారు. కాని చైనాను దురాక్రమణదారుగా పేరిడటానికి బహిరంగంగా ఎవరూ సాహసించలేకపోయారు.

దురాక్రమణ విషయంలోను, మాక్‌మాహన్ శ్రేణిపైన మేము నిశ్చయాభిప్రాయానికి రాలేకపోవడంవల్ల, భారత ప్రజల దృష్టిలో మా పార్టీ దేశభక్తిని గురించి దురభిప్రాయం ఏర్పడింది. పార్టీగా

మేము అపజయాలు పొందడమేగాక, సాధారణ ప్రజాతంత్ర ఉద్యమం, భారత – చైనా మిత్రత్వం చాలా వెనకడుగు వేశాయి.

అపుడుకూడా, టిబెట్ సంఘటనలుగాని, సరిహద్దుసమస్య గాని మనస్సులలో ప్రధానంగా నాటుకొని వుండలేదు. 1959 లో, ప్రజా సామాన్యంలో ప్రభుత్వ అంతరంగిక విధానాలపట్ల కార్మికోద్యమం ప్రజాసమస్యల విషయంలో ప్రభుత్వ ప్రతికూలవైఖరిపట్ల, ధనికవర్గాల రక్షణకు అది పూనుకొనడంపట్ల అసంతృప్తి పెరిగింది. టిబెట్ ఘటనలకన్నా సరిహద్దు సంఘటనలకన్నా ఎక్కువగా కాంగ్రెస్ పరిపాలనకు వ్యతిరేకత రాజకీయ చైతన్యం గల పజల మనస్సులలో ఎక్కువగా ఉండిపోయింది. ఇది ప్రభుత్వ ఉద్యోగుల సమ్మెలో స్పష్టం అయింది. శాంతి, తటస్థత విషయాలలో ప్రభుత్వ విదేశాంగవిధానాన్ని ప్రజలు సాధారణంగా బలపరుచుతూ వచ్చారు. అయితే అదే సమయంలో, పీడిత ప్రజానీకం పట్ల ప్రభుత్వం అవలంబించే అంతరంగిక విధానాలను ప్రజలు వ్యతిరేకించారు.

లడక్ ప్రాంతంలో భారతీయ సైనికులను కాల్చిన సంఘటన (1959 అక్టోబరు) దేశాన్ని ఊపివేసింది. ప్రజల ఆగ్రహావేశం నూతన స్థాయికి లేచింది. పార్టీ ప్రధాన కార్యదర్శి అజయఘోష్ 1959 అక్టోబరు 24 న ఒక ప్రకటన చేయవలసివచ్చింది. దురదృష్టకరమైన ఆ ఘటనపట్ల తీవ్ర ఆగ్రహాన్ని అందులో ప్రకటించారు. మౌనంగా కూర్చోడం ఇక మాకు ఏ మాత్రమూ సాధ్యం కాలేదు.

భారత కమ్యూనిస్టుపార్టీ పెద్ద భారాన్ని మోయవలసి వచ్చింది. చైనా కమ్యూనిస్టుపార్టీతో ఘర్షణ పడటం సులభమైన విషయంకాదు. ఈ సమస్య విషయంలో సిద్ధాంతీకరించడంలోగాని, విషయాలను అంచనా వేయడంలోగాని మాది సరియైనదేనా అన్న విశ్వాసం కూడా మాలో కొందరికి లేదు.

ఒక సోషలిస్టుదేశానికి, మరో బూర్జువా ప్రజాతంత్ర దేశానికీ మధ్య–రెండూ ఒక శాంతి శిబిరానికి, వలస వ్యతిరేక శిబిరానికి చెందిన దేశాలై ఉండికూడా–సరిహద్దు ఘర్షణ వచ్చినప్పుడు మార్క్సిస్టు–లెనినిస్టు పార్టీ విధి ఏమిటి ? బూర్జువా పాలనలో ఉన్న భారతదేశం తప్పు చేయ

వచ్చు కాని కమ్యూనిస్టు నాయకత్వాన ఉన్న చైనా తప్పుచేస్తుందా ? రెండు దేశాల ప్రజల, రెండు మిత్ర దేశాలమధ్య సంబంధాలలో సరిహద్దుకు విలువఏమిటి ? మునుపటి వలస బానిసత్వ చిహ్నాలను అతిక్రమించడానికి ప్రయత్నించుతున్న, నూతనంగా విముక్తిచెందిన దేశపు స్నేహాన్ని నిలబెట్టుకోడమా లేక వదులుకోడమా అనే ప్రశ్న ఎదుర్కొన్నపుడు, అధికారంలోవున్న కమ్యూనిస్టుపార్టీ సరిహద్దు లేక ప్రాదేశిక సమస్యకు ఏమి విలువఇవ్వాలి ?

అలాటివి, ఇంకా తదితర ప్రధాన సమస్యలు మమ్మల్ని తొందర పెట్టినయ్. అయినా మేమా విషయాలను పార్టీ అనుయాయులలో చర్చకు పెట్టలేదు. చైనా నాయకత్వానికి జ్ఞానం కలిగి సమస్య పరిష్కారం అవుతుందిలే అని దాదాపు విధిమీద భారంవేసిన రీతిగా మేము ఆశించాము కాని అలా జరగలేదు.

## గతాన్నిగురించి ఈ ఆలోచన ఎందుకు ?

గతాన్నిగురించి ఇదంతా మేము ఎందుకు చెబుతున్నాం ?

మొదటిది : పరిస్థితులు ఎలా పరిణామం చెందుతూ వచ్చాయో జ్ఞాపకం చేయడానికి, ఎలాంటి వైరుధ్యాలలో, అసాధ్యమైన పరిస్థితులలోకి చైనా నాయకత్వం తననూ, మన పార్టీని మన రెండు గొప్పదేశాలనూ నెట్టిందో తెలియజెప్పడానికి.

రెండవది : అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతో తన వివాదాలలోను, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోను, సోదరపార్టీల మధ్య ప్రవర్తనా నియమావళి గురించి చైనా నాయకత్వం పెద్దగా గోలపెడుతున్నది. కాని. సోదర పార్టీల మధ్య ప్రవర్తనావళిని మేము ఉల్లంఘించలేదని కొందరికి జ్ఞాపకం చేయదలచుకొన్నాం.

మూడవది : చైనా వాదనలతోను, సిద్ధాంతాలతోను విభేదించేది మా పార్టీ ప్రస్తుతం నాయకత్వంలేక వారు పిలుస్తున్నట్లు "ముఠా" మాత్రమే కాదని, ఎన్నడో అజయ్‌ఘోష్ నాయకత్వాన ఆనాటి జాతీయ సమితి ఆధ్వర్యాన మన పార్టీ, చైనా పార్టీతో పూర్తిగా విభేదించే నిర్ధారణలకు వచ్చిందని తెలియజేయ దలిచాం.

నాల్గవది: 1962 జనవరిలో కామ్రేడ్ అజయ్‌ఘోష్ మరణించే ముందు, చైనా దృక్పధాన్ని బహిరంగంగా ఖండించుతూ నిశితమైన ఒక ప్రకటన చేశారు. ఆ ప్రకటన చేసినందుకు ఆయన "నెహ్రూ వెనుక తోకపట్టుకుని పోతున్నాడు" అనే అభినందన చైనా వారినుండి పొందాడు. (1961 డిసెంబర్ 7)

భారత – చైనా సమస్య పైననేగాక, యావత్తు కమ్యూనిస్టు ప్రపంచానికి, ప్రపంచ ప్రజాతంత్రం, శాంతికి సంబంధించిన తీవ్రమైన సమస్యలగురించి చాలా వినాశకరమైన విషయాలు జరిగాయి. అందు చేత ఈ ఘటనలుజరిగిన చాలా రోజులకు మమ్మ మరింత తీవ్రంగా ఖండించారు

ప్రపంచంలోని యెక్కువమంది కమ్యూనిస్టుపార్టీల తోనూ, వారందరినీ కలిపివుంచే సమష్టి అవగాహనతోనూ చైనా కమ్యూనిస్టు పార్టీ డీకొన్నది. ప్రపంచ వివాదంలో భారత – చైనా సమస్య ఒక ఘటన మాత్రంఅయింది. ఒక స్థానిక విషయంనుండి ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాన్నంతటికీ సంబంధించే విషయంగా లేవనెత్తబడింది; ప్రపంచ రాజకీయాలలో చైనా ఆలోచనా ధోరణికి, చర్యకు సంబంధించిన సమస్యగా పైకివచ్చింది.

ప్రస్తుత శకం, యుద్ధమూ, శాంతి సమస్యలు, సామ్రాజ్యవాద వ్యతిరేకత, శాంతియుత సహజీవనం, జాతీయ స్వాతంత్ర్యం, వర్గ పోరాటం, నూతనంగా విముక్తిచెందిన దేశాలపాత్ర, వాటి విప్లవ పోరాటాలు, సోషలిజానికి పరివర్తనా దశలు, ఆధునిక రివిజనిజం, పిడివాదాల సమస్యలు. వీటి అన్నిటిపైనా చైనా నాయకత్వానికి గల పొరపాటు అవగాహనయే భారత–చైనా సరిహద్దుపైన 1962 అక్టోబర్, నవంబరులనాటి విపత్తుకు ప్రధానంగా మూలకారణం. ప్రతి దేశానికీ, ప్రతి పార్టీకి వర్తించే ఈ సమస్య లన్నిటిపైనా చైనా నాయకత్వం ప్రపంచంలోని అత్యధిక సంఖ్యాక పార్టీలతో ఘర్షణపడింది. 1960 నాటి 81 దేశాల మాస్కో స్టేట్‌మెంటులో ఏకగ్రీవంగా వచ్చిన సమష్టి అవగాహనతో కూడా ఘర్షణపడింది.

అందుచేత, భారతదేశంలోని వర్గ సంబంధాలగురించి, రాజకీయ

ఆర్థిక పరిస్థితిగురించి చైనా నాయకత్వం ఎలా అంచనా కట్టుతుంది అనే దొక్కటే సమస్యకాదు. యావత్తు ప్రపంచ పరిస్థితినీ వారెలా చూస్తు న్నారనేదే నేటి సమస్య. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో నేడు చర్చలు జరుగుచున్న సిద్ధాంత సమస్యలలో భారత-చైనా సమస్య ఒక భాగం అయింది.

ఈ వివాదం, కమ్యూనిస్టుపార్టీ అంతరంగిక చర్చలలో మాత్రమే కొనసాగించ బడుటలేదు. యావత్తు ప్రపంచం పూర్తి దృష్టిలో, "అందుకు పొంగిపోయే శత్రువు" దృష్టిలోకూడ ఈ వివాదం కొనసాగు తున్నది. ఇది ఎప్పుడు, ఎందుకు, ఎలా జరిగింది?

# 3

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో మూలవిభేదాలు

ఇండియా – చైనా సరిహద్దు తగాదా ప్రపంచంలో వివిధాభిప్రాయాలు గల వారందరినీ ఆకర్షించింది. 1954 నాటి స్నేహ ఒడంబడికను సామ్రాజ్యవాదులూ, దేశంలోని అభివృద్ధి నిరోధకులూ హర్షించలేదు కాని, సరిహద్దు తగాదా, 1959 నాటి ఘర్షణలు వారికి సంతోషం కలిగించాయి. ప్రపంచ కమ్యూనిస్టు పార్టీలూ, సోషలిస్టుదేశాలూ తద్విరుద్ధంగా 1954 నాటి స్నేహ ఒడంబడికకు ఆనందించాయి. 1959 ఘర్షణలకు విచారం తెలిపాయి. అయినా ఒక్క చైనా తప్ప మరే కమ్యూనిస్టుపార్టీగాని, ఏ సోషలిస్టు దేశం గాని సరిహద్దు ఘర్షణను గురించి బహిరంగంగా ఏమీ చెప్పలేదు. సమస్య శాంతియుతంగా పరిష్కరించబడాలనే వారంతా కోరారు.

అయినా లాంగ్జూ ప్రాంతంలో ఘర్షణ జరిగి ఉద్రిక్తలు పెరిగివున్న సమయంలో 1959 సెప్టెంబరు 9 వ తేదీన సోవియట్ వార్తా సంస్థ 'టాస్' ఒక ప్రకటన చేసింది. ఒక సోషలిస్టు దేశమో, కమ్యూనిస్టు పార్టీయో ఈ తగాదా గురించి విచారం బహిరంగంగా తెలపడం ఇదే ప్రథమం.

ఆ ప్రకటనకు చైనా కమ్యూనిస్టు పార్టీ తీవ్రవ్యతిరేకత కనబరచింది. ఆ ప్రకటన చైనాను ఖండించలేదు. కాని, వారు దానిని ఖండనగా తీసుకొన్నారు. ఆ ప్రకటనచేసి సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, సోవియటు ప్రభుత్వమూ "సోషలిస్టు చైనాకు వ్యతిరేకంగా బూర్జువా నెహ్రూను బలపరిచాయి" అన్నారు. ఆ ప్రకటన చేయడంలోనూ, దాంట్లో కనబరచిన వైఖరిలోనూ సోవియట్ కమ్యూనిస్టుపార్టీ శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాన్ని అతిక్రమించిందన్నారు. సోవియట్ యూనియన్ మినహాయింపులు లేకుండా చైనాను బలపరచాలని వారి అభిప్రాయం.

"కాంప్ డేవిడ్" చర్చలు జరగవలసివున్న రోజులవి. ఆనాడు అమెరికన్ సామ్రాజ్యవాదాన్నీ, అధ్యక్షుడు ఐసెన్‌హోవరునూ సంతృప్తిపరచేటందుకే సోవియట్ యూనియనూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఈ పని చేశాయని వారు ఆరోపించారుకూడా.

ఆవిధంగా సోవియట్ కమ్యూనిస్టుపార్టీ అమెరికన్ సామ్రాజ్యవాదానికీ, పెట్టుబడిదారీ భారతదేశానికీ అనుకూలంగా సోషలిస్టు చైనాను విడనాడి, శ్రామికవర్గ అంతర్జాతీయతను విసర్జించిందన్నారు. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, కృశ్చేవ్ రివిజనిజం రొంపిలో కూరుకుపోయారన్నారు.

ఈ వివాదానికి హేతువైన 'టాస్' ప్రకటనలో వున్నదేమిటి? అందులో ఇలా ఉంది:

"సోవియట్ మంత్రిమండలి అధ్యక్షుడు ఎన్. ఎస్. కృశ్చేవ్, అమెరికా అధ్యక్షుడు డి. ఐసెన్‌హోవరులు పరస్పరం కలుసుకోనున్న సమయంలో పరిస్థితులను క్లిష్టపరిచేటందుకూ, అంతర్జాతీయ ఉద్రిక్తతలు తగ్గకుండా నిరోధించేటందుకూ ప్రయత్నిస్తున్న జనం పాశ్చాత్య దేశాలలో ముఖ్యంగా అమెరికాలో వున్నారు. వారీ అవకాశాన్ని దొరకపుచ్చుకోవడం గమనించతగివుంది. ప్రచ్ఛన్న యుద్ధాన్ని అంతరింపచేసే విషయమై సోషలిస్టు దేశాలతో ఒక ఒప్పందానికి రావాలని పాశ్చాత్య దేశాలలో విస్తరిస్తున్న వాంఛను ఆ విధంగా నిరోధించగలమని వారి అభిప్రాయం.

"చైనా – ఇండియా సరిహద్దులో ఒక దుర్ఘటన జరిగినందుకు ఎవ్వరూ విచారించకుండా వుండరు. చైనా ప్రజాప్రభుత్వమూ, భారత రిపబ్లిక్కూ రెంటితోనూ సోవియట్ యూనియను స్నేహ సంబంధాలు కలిగివుంది.

"చైనా, సోవియట్ ప్రజలమధ్య అభేద్య సోదర మైత్రీ సంబంధాలున్నాయి. వాటికి శ్రామికవర్గ అంతర్జాతీయతా సూత్రాలు ప్రాతిపదికలు. సోవియట్ యూనియన్‌కూ, భారతదేశానికీ మధ్య శాంతియుత సహజీవన అభిప్రాయాలకు అనుగుణంగా మైత్రీ సహకారం జయప్రదంగా వృద్ధిపొందుతూంది.

"చైనా–భారత సరిహద్దులలో జరిగిన దుర్ఘటనను ప్రచ్ఛన్న యుద్ధ వ్యాపికి ఉపయోగించుకొనేటందుకూ, దేశాలమధ్యగల మైత్రిని ధ్వంసం చేసేటందుకూ జరిపే ప్రయత్నాలను గట్టిగా ఖండించాలి."

"టాస్" ప్రకటనలో ఇంకా ఇల్లావుంది :

"అంతర్జాతీయ పరిస్థితి చక్కబడ్డానికి బదులు, క్షీణించాలనేవారి కోరికలు నెరవేరేటట్లుగా చైనా ప్రజారిపబ్లిక్కూ, భారత రిపబ్లిక్కూ ఈ దుర్ఘటనను కొనసాగించవనే విశ్వాసాన్ని సోవియట్‌లోని ఉన్నత వర్గాలు వెలిబుచ్చాయి. చైనా–భారత దేశాలమధ్య అనూచానంగా వస్తున్న మైత్రియే తమ ఉభయులకూ ప్రయోజనకారి యని గ్రహించి రెండు ప్రభుత్వాలు తమ వైమనస్యాలను పరిష్కరించుకొంటాయని సోవియట్ అగ్రనాయక వర్గాలు విశ్వాసం వెలిబుచ్చాయి. శాంతినీ, అంతర్జాతీయ సహకారాన్నీ కోరే శక్తుల కిది దోహదం చేస్తుంది."

## సోవియట్ పార్టీపై ఆరోపణలు

ఆ ప్రకటనకు చైనా నాయకత్వం చూపే అభ్యంతరం ఏమిటి ? వారిల్లా వ్రాశారు :

"మంచి – చెడ్డల మధ్య అంతరం చూపించకుండా ఆ ప్రకటన సరిహద్దు ఘర్షణమీద 'విచారం' ప్రకటించింది. అంటే నిజానికి చైనా వైఖరి సరైనదయినప్పటికీ దానిని ఖండించిందన్నమాట. అది 'దురదృష్టకర'మనీ 'విచారకర'మనీకూడ చెప్పింది. ఒక పెట్టుబడిదారీ

దేశంలోని అభివృద్ధి నిరోధకులు రెచ్చగొట్టే సాయుధచర్యలు చేస్తూంటే ఖండించడానికి బదులు ఒక సోషలిస్టుదేశం మరో సోదర సోషలిస్టు దేశాన్ని, అది సాయుధ దాడిని ఎదుర్కొంటున్నసమయంలో ఖండించడం చరితలోకల్లా ఇది ప్రప్రథమం "విభేదాలు ఎప్పటినుండి"— [పీపుల్సు డైలీ 1963 ఫిబ్రవరి 27 సంపాదకీయం, విదేశీభాషా ప్రచురణాలయం— పెకింగ్—పుట 11–12]

సహృదయంతో చేసిన ప్రకటనలక్కూడా చైనావారు ఏ విధమైన అర్థాలు తీస్తారో దీనినిబట్టి ప్రతి ఒక్కరూ తెలుసుకోవచ్చు.

మరోచోట వారిల్లా వ్రాశారు:

"చైనా – భారత సరిహద్దు తగాదాలో మొదటినుంచీ వీరు (సోవియటు కమ్యూనిస్టుపార్టీ, తదితరులూ) మంచి–చెడ్డలను వేర్పరించలేకనే పోయారు. "తటస్థంగా ఉన్నట్లు" నటించారు. మాటల్లో చైనాను "భాయీ" అన్నారు. కాని నిజానికి భారతదేశపు అభివృద్ధి నిరోధక ముఠాను బంధుప్రీతిగా ఆదరించారు. వీరు తమ అంతస్సాక్షిని ఓమారు పరిశీలించుకొని, తాముచెప్పే మార్క్సిజం–లెనినిజమూ, శ్రామికవర్గ అంతర్జాతీయతా ఏమయ్యాయో ప్రశ్నించుకుంటే బాగుండును". ["అన్నిదేశాల కార్మికులూ ఐక్యంకావాలి..." పీపుల్సు డైలీ సంపాదకీయం 15–12–1963 తేదీ వి. భా. ప్ర – పెకింగ్ పుట 11].

సంఘర్షణ, కాల్పులు జరిగినందుకై విచారం తెలిపినందుకే చైనా నాయకత్వం సోవియటు యూనియన్‌ను నిందించింది అది శ్రామికవర్గ అంతర్జాతీయతకు ద్రోహం చెయ్యడమేనంది. ఇంక ఈ ఘర్షణలో సరాసరి వ్యాతిరేకించిస్తున్న దేశంలోని పార్టీగా మేము వారితో భేదించి, వారి దండయాత్రను బలపరచ నిరాకరించి, దేశరక్షణకు నిలబడ నిర్ణయించినప్పుడు మమ్మల్ని అంతకన్నా అసహ్యకరంగా తిట్టారంటే ఆశ్చర్యం ఏమీ లేదు.

## తోడు మిగిలింది ఆల్బేనియా ఒక్కటే

అర్థంలేని యీ నిందాపూర్వక ప్రకటనల విషయంలో చైనా

నాయకత్వాన్ని ఒక్క అల్బేనియా తప్ప ప్రపంచంలోని మరే కమ్యూనిస్టు పార్టీ బలపరచలేదు.

"బూర్జువా నెహ్రూ" తోనూ, భారత కమ్యూనిస్టు పార్టీతోనూ ఈ సమస్యపై వారికి భేదాభిప్రాయాలుండడమే కాదు. అతి ముఖ్యమయిన మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను ఈనాటి పరిస్థితులకు సమన్వయించే విషయంలో చైనా నాయకులు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంతో తీవ్రంగా, ప్రాతిపదికల్లోనే భేదిస్తున్నారు. భారత-చైనా సరిహద్దు సమస్యపై చైనా నాయకత్వం ధోరణిని అర్థం చేసుకోవాలంటే ఇది తెలుసుకోవడం అవసరం.

ఈ వాగ్వివాదంలో చైనా నాయకత్వాన్ని బలపరచిన దొక్క అల్బేనియన్లు మాత్రమేనని జ్ఞాపకం వుంచుకోవాలి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సామ్రాజ్యవాదానికి 'ముస్తాబు' చేస్తోందనీ, 'సొగసు' దిద్దుతోందనీ, అమెరికను సామ్రాజ్యవాదాన్ని సంతోషపెట్ట ప్రయత్నిస్తోందనీ అల్బేనియనులు సోవియట్ పార్టీపై 1959-60 లలో నిందారోపణ చేసేంతవరకు వెళ్ళారు.

1956లో జరిగిన సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 20వ మహాసభా, 1957 నాటి మాస్కో ప్రకటనా ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికి కొన్ని ఉత్తమ అవగాహనల నిచ్చాయి. చైనా నాయకత్వం ఆ అవగాహనలను నిరాకరించ నిర్ణయించుకొన్న దశలో జరిగినవే లడక్ కాల్పులూ, సెప్టెంబరు 9 నాటి టాస్ ప్రకటనా, లాంగ్జూ ఘర్షణా, మాక్‌మాహన్ శ్రేణికి దిగువన నీఫాప్రాంతం మాదేనంటూ మొట్టమొదటి పర్యాయం సెప్టెంబరు 8వ తేదీన (1959) చౌ-ఎన్-లై ఇచ్చిన సమాధానమూను.

"లెనినిజం వర్ధిల్లాలి" మొదలైన సుప్రసిద్ధ వ్యాసాలు "హొంగ్కీ" పత్రికలో ఇచ్చిన దీ కాలంలోనే. సరిగ్గా ఆ రోజుల్లోనే — అంటే 1960 జూలైలో మమ్మల్ని — ప్రపంచంలోని పెద్ద పెద్ద కమ్యూనిస్టు పార్టీల్ని వట్టినే, కారణరహితంగా ప్రపంచ కార్మిక సమాఖ్య పెకింగ్ సమావేశంలో రివిజనిస్టులనీ, జాతీయ బూర్జువావర్గానికో, సామ్రాజ్య

వాదులకో తోకలనీ, మార్క్సిజం – లెనినిజం ప్రాథమిక సూత్రాలనే నిరాకరిస్తున్నారని తిట్టారు.

1959-60 లలో భారత-చైనా సరిహద్దు విషయంలో చైనా నాయకత్వం తీసుకొన్న ధోరణీ, అనుసరించిన పద్ధతులూ చూస్తే వారు తమ మార్క్సిజం-లెనినిజాన్నీ, శాంతియుత సహజీవనం యెడ తమ అవగాహననూ శాంతిశిబిరంలోనేవున్న, నూతనంగా స్వాతంత్ర్యం పొందిన, తటస్థ ప్రజాతంత్ర రాజ్యాల విషయంలోనూ, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా ఆ దేశాలు నిర్వహిస్తున్న పాత్రవిషయంలోనూ, తాము ఏర్పరచుకొన్న నూతన దృక్పథాన్ని పరీక్షించుకుంటున్నట్లూ, రిహార్సలు వేసుకొంటున్నట్లూ అనిపిస్తుంది

అందుకే సోవియట్ కమ్యూనిస్టుపార్టీని ఈ విధంగా నిందించారు:

"కాంప్ డేవిడ్ చర్చల అనంతరం కొందరు కామ్రేడ్స్ బుర్రలు తిరిగిపోయాయి. చైనా కమ్యూనిస్టుపార్టీ అనుసరిస్తున్న దేశీయ, విదేశీయ విధానాలమీద బహిరంగంగానే దూకుడుగా దాడులు చేయటం ఎక్కువయిపోయింది. "పెట్టుబడిదారీ వ్యవస్థ గట్టిగా వుందో లేదో బలంచూపి పరీక్షించ" ప్రయత్నిస్తున్నారనీ, "కోడిపుంజులా కయ్యానికి కాలుదువ్వుతున్నార"నీ చైనా కమ్యూనిస్టుపార్టీని వారు బాహాటంగా నిందించారు. సోషలిస్టు నిర్మాణానికై వేసుకున్న స్థూల పథకాన్నీ, "పెద్ద ముందంజ" వుద్యమాన్నీ, ప్రజా కమ్యూన్లనూ వ్యతిరేకించారు. ప్రభుత్వ వ్యవహారాలలో చైనా కమ్యూనిస్టుపార్టీ "దుందుడుకు" పద్ధతిని అనుసరిస్తూందని అపనిందలు ప్రచారం చేశారు." ["విభేదాలు ఎప్పటినుండి..." పుట 12.]

ఈ వాక్యాలలో వారు కనబరచిన మనస్థితికీ, దృక్పథానికీ ఆధారం ఏమీలేదు. నిజమూ కాదు. కాని, భారత–చైనా సరిహద్దులో 1959 – 60 లో వచ్చిన ఘర్షణలకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంతో పెట్టుకున్న తగాదాలకూ మూలం ఈ మనస్థితీ, ఈ దృక్పథమే.

ఇటువంటి పరిస్థితులలోనే 81 పార్టీలు సమావేశం అయ్యాయి. భేదాభిప్రాయాల్ని చర్చించాయి. అప్పుడు 1960 డిసెంబరు నెలలో

ప్రపంచ కార్మికవర్గం, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమాల కార్యక్రమంగా మాస్కో ప్రకటన జారీ చేశారు.

ఆ సమావేశం చర్చించి నిర్ధారణకు వచ్చిన వివాదాస్పద ప్రతిపాదనలను మే మిక్కడ వివరించబోవడం లేదు. ఆ సమావేశ ఫలితాల్ని గురించి మేమిక్కడ సమీక్షించబోవడంలేదు. భారత – చైనా సరిహద్దు తగాదాకు గల సిద్ధాంత ప్రాతిపదికనూ, చైనా కామ్రేడ్స్ మనస్సులలో మెదులుతూ, 1959–60 నాటి తగాదాలకూ, సంఘర్షణలకూ పూర్వరంగంగా వున్న ఆలోచనలనూ ఇక్కడ చూపించ దలచుకొన్నాము.

ఏ దేశ పటం సరియైనది? ఎవరి వాదం సరిగా ఉంది? – అనేదిక్కడ చర్చించబోవడం లేదు. ఆ నాడు జరిగిన ఘటనలకు వెనుకనున్న సిద్ధాంత – రాజకీయ పూర్వరంగాన్ని తెలుసుకోవడమే ఇప్పుడు మా వాదన వుద్దేశం.

సింకియాంగ్‌కు రోడ్డును నిర్మించుకొన్న లడక్ భాగంలో చైనా వారు గట్టిగా ని దొక్కుకొన్నారు. స్థానం బలపరచుకొన్నారు. అక్కడ భారతీయులూ లేరు. చైనీయులూ లేరు. ఉన్నవల్లా కొండలూ, గుట్టలూ ను. ఇంక తూర్పు ప్రాంతంలో మాక్ మాహన్ రేఖకు దక్షిణం భారతీయభాగం. 1959 లో చైనావారు ఆ రేఖ దాటి, నీఫా ప్రాంతంలో ప్రవేశించే వుద్దేశం కలిగిఉన్నట్లు తోచదు

## మాక్‌మాహన్ రేఖను గూర్చి

1954 లో పంచశీల ఒడంబడికపై సంతకాలు జరుగుతున్నప్పుడు చౌ–ఎన్‌లైతో నెహ్రూ ఈ ప్రసంగం తెచ్చారు టిబెట్‌నుంచి భారత దేశం ఉపసంహరించుకొన్నాక, ఈ ఒడంబడిక జరిగాక ఇంకా ఏమన్నా ప్రాంతీయ సమస్యలు మిగిలాయా అని నెహ్రూ ప్రశ్నించారు. ఇంచుమించు అటువంటివేమీ లేనట్లేనని, మాక్‌మాహన్ రేఖను చైనా గుర్తించకపోయినా, ఉభయదేశాల మధ్యగల స్నేహసంబంధాలరీత్యా దాని విషయంలో ఏమీ యిబ్బందివుండదని అభిప్రాయం కలిగించారు చౌ–ఎన్–లై.

1959 అక్టోబరులో పెకింగ్ వెళ్ళిన మా ప్రతినిధివర్గంతో తాము మాక్‌మాహన్ రేఖను దాటుబోమని చైనా నాయకత్వం నమ్మకంగా వాగ్దానంచేసింది.

నెహ్రూ ఆ సమస్యను ఎత్తకపోలేదు. చైనా వారికి ఆ సమస్యపై అవగాహన లేకపోనూలేదు. 1954 లో వారు ఒక ఒప్పందానికి రావాలనే అవగాహనతో వున్నారు. 1959 లో ఒప్పదమూలేదు 'సర్దుబాట్లూ' లేవు అనే తగాదా ధోరణిలో వున్నారు. టిబెట్ సమస్య వంటి ప్రధాన సమస్యలు పరిష్కారం అయ్యాయి. పంచశీల సంధి జరిగింది. భారతదేశం సముచితంగా టిబెట్‌నుంచి వుపసంహరించుకొంది. ఆనాడే 1954 లో ఈ సమస్యకూడా ఎందుకు పరిష్కరించుకోలేదు— అని అడిగితే "దానికి సమయం పరిపక్వం కాలేదు" అని చైనా వారు సమాధానం ఇచ్చారు.

దానివలన 1959 లో సిద్ధాంత ప్రాతిపదిక మారినప్పుడు, ఆ సిద్ధాంతాన్ని భారత చైనా సరిహద్దులలో పరీక్షకు పెట్టడంకోసం కాలం పరిపక్వం అయిందని భావించినట్లు కన్పడుతుంది.

టిబెట్‌లో జరిగిన ఘటనలూ, భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులు ఆ విషయాలలో జోక్యం కలిగించుకోవడమూ, భారత ప్రభుత్వమూ, పండిత నెహ్రూ ఆ ఘటనలకు సహాయపడకపోయినా ఉపేక్షించడమూ – ఇవి 1954 నాటి మైత్రి చెడిపోవడానికీ, తర్వాత జరిగిన ఘటనలకూ కారణమేమో అని కొందరు అనవచ్చు

కాని అదే కాదు.

మొదటిది: టిబెట్ ఘటనల యెడ భారతప్రభుత్వం చూపిన ధోరణి సిద్ధాంతరీత్యానూ, రాజకీయంగాను తప్పయితే కావచ్చు. కాని వారు తమ హద్దు ఎక్కడా దాటలేదు. దలైలామా తిరుగుబాటును అతి స్వల్పకాలంలో సమర్థవంతంగా అణచివేయడానికి చైనా వారినేమీ అభ్యంతరపెట్టలేదు

రెండోది: 1954 కి పూర్వం కూడా భారత ప్రభుత్వం యొక్క ధోరణి సుముఖంగానూ, స్నేహపూర్వకంగానూ లేదని చైనా నాయకత్వమే అంటూంది. 1950లో కొరియాలోనూ, ఇతరత్రానూ చైనా

నిమగ్నమైఉన్నప్పుడు భారతదేశం బలప్రయోగంతో "90 వేల చదరపు కిలోమీటర్లకు పైగా చైనా భూభాగాన్ని ఆక్రమించింది" అనీ "అనేక చోట్ల మాక్‌మాహన్ రేఖను అతిక్రమించింది" అనీ వారు అంటున్నారు.

అదే నిజం అయితే 1954 లో స్నేహ · ఒడంబడిక చేసుకొన్న నాటికే భారతదేశం దురాక్రమణ జరిపింది. ఆ నాడే నెహ్రూ మాక్‌మాహన్‌రేఖను గురించి ప్రశ్నించినప్పుడు, దానిని ప్రక్కకు నెట్టి వేశారు ఎందుచేత?

"90 వేల చదరపు కిలోమీటర్ల ప్రాంతాన్ని భారతదేశం దురాక్రమణ" చేసినా 1954 నాటి ఒడంబడిక ఎందుకు జరిగింది?

టిబెట్‌లో వచ్చిన ఓ చిన్న తిరుగుబాటో, లడక్‌లో పెట్టిన చిన్న భారతీయ సైనికుల జట్టో, లాంగ్జూ, ధోలా శిబిరాలవద్దనున్న చిన్న పీలికో స్నేహాన్ని భగ్నంచేసి 1959 60, '63 లలో ఒప్పందం ఏర్పడకుండా యెందుకు ఆటంకంగా పరిణమించింది?

చైనా-భారత సరిహద్దు సమస్యను వివరించేటందుకు చైనా నాయకత్వం యిల్లా చెబుతోంది: "నెహ్రూ ప్రాతినిధ్యం వహిస్తూన్న భారతీయ బూర్జువా, బడా భూస్వాముల వర్గస్వభావాన్ని పరిశీలిస్తేనే యిది అర్థం అవుతుంది..."

చైనావారి కార్యకలాపాలను అర్థంచేసుకోవాలంటేకూడా మనం యీ పద్ధతినే అనుసరించాలి. "వారు సన్నిహిత సంబంధాలు కలిగి వున్న" బడా బూర్జువావర్గంతోనూ, భూస్వాములతోనూ, సామ్రాజ్య వాదులతోనూ వారు యేవర్గ దృక్పథంతో, యేసిద్ధాంత ప్రాతిపదికలపై వ్యవహరిస్తారో అర్థంచేసుకోవాలి, పరిశీలించాలి.

అలా చూచినప్పుడు 1954-57 ల మధ్య సామ్రాజ్యవాదం, యుద్ధం, శాంతి, సహజీవనం మొదలయిన సమస్యల విషయమై చైనా వారి సిద్ధాంతధోరణీ, నిర్దిష్ట వ్యవహార విధానమూ మారినాయని తెలుస్తుంది. ఎవరు నష్టపడ్డాసరే, ఎక్కడైనా సరే సంఘర్షణకు తలపడవలసిందనే ధోరణికి వారు వచ్చారు. ఎక్కడ తలపడాలి, ఎవరు నష్టపడాలి అనేది బహు చాకచక్యంతో వారే నిర్ణయం చేస్తారు.

1959 లో ప్రధాన సిద్ధాంత సమస్యలన్నింటిమీాదనూ, వానిని నిర్దిష్టంగా అనువర్తింపచేయడంలోనూ చైనా నాయకత్వం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో విభేదించింది. ప్రపంచ వుద్రిక్తతను తగ్గించే టందుకు ఐసెన్‌హెూవరును కలుసుకొనడంకోసం కృశ్చేవ్ చేసిన ప్రయత్నాలనూ, కాంప్ డేవిడ్ చర్చలనూ వారు ఖండించారు. అమెరికన్ సామ్రాజ్యవాదుల బెదిరింపులకు లొంగిపోయాడన్నారు. అదేవిధంగా సరిహద్దు సమస్యను పరిష్కరించేటందుకై నెహ్రూను చౌఎన్-లై కలుసుకోవాలని మేముచేసిన సూచననూ నిరాకరించారు. అయితే మాంట్‌గోమరీని కలుసుకొనేటందుకు వారి కేమీా అభ్యంతరం లేనట్లు కనిపిస్తుంది.

భారత-చైనా సరిహద్దు సమస్య విషయమై చైనా నాయకత్వం అనుసరించిన విధానం చిత్రమైనదీ, పరిష్కారానికి తోడ్పడనిదీను. దీనికి ప్రధాన కారణం సిద్ధాంత దృక్పథంలో వచ్చిన మార్పే కాదా ? వాస్తవాలు చూస్తే అల్లాగే కనబడుతూంది.

## చైనా బాధ్యత

భారతదేశంవేపునుంచి తప్పులు జరగలేదని కాని, రెచ్చగొట్టే పనులేవో చేసి వుండరని కాని దాని అర్థంకాదు. వారు నిరపరాధులని చెప్పడమూ లేదు. కాని చైనా సోషలిస్టుదేశం. ఆ దేశ నాయకత్వం మార్క్సిజం-లెనినిజం ప్రకారం నడుస్తూంది. అలాంటి సరిహద్దు సమస్యల విషయంలో ఎలా వ్యవహరించాలో లెనిన్ సూత్రీకరించారు. దాని ప్రకారం వారు ఆ సమస్యను పరిష్కరించగలరు. అల్లా చేసి వుండవలసింది.

కాని, వారల్లా చేయలేదు. వారు చెబుతున్నట్లు "ప్రపంచ విప్లవానికి" సంబంధించిన వ్యూహము, ఎత్తుగడల ఆలోచనలలో మార్పు రావడమూ, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంతో ముఖ్యంగా ఆ ఉద్యమానికి అగ్రగామిశక్తిగా గుర్తించబడుతున్న సోవియట్ కమ్యూనిస్టుపార్టీతోనూ, సోవియట్ యూనియన్‌తోనూ వారికి భేదాభిప్రాయం ఏర్పడడమూ దానికి ముఖ్యకారణం. వారు అనుసరిస్తున్న

విధానానికి వ్యతిరేకంగా చైనానాయకత్వం అంతర్జాతీయ రంగంలో వాదించారు. వ్యవహరించారుకూడా.

"ఏమంటే చాలకాలంగా ఈ కామ్రేడ్స్ ఎంతో పట్టుదలతో తప్పుడు అభిప్రాయాల్ని ప్రచారంచేశారు. 1957 మాస్కో ప్రకటనను తలవుకు తెచ్చుకోకుండా చైనా కమ్యూనిస్టుపార్టీని నిందించారు. ఆవిధంగా వారు అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమం లోపలా, ప్రపంచ ప్రజలలోపలా గందరగోళం కలిగించారు. సామ్రాజ్యవాదాన్ని ఎదుర్కొని సాగించే పోరాటంలో దిక్కు తోచకుండాపోయే ప్రమాదాన్ని తెచ్చిపెట్టారు."

["ఈ తగాదా ఎప్పటినుండి..." పుట-12]

ఇది సుస్పష్టం. చైనా కమ్యూనిస్టు నాయకులు చెబుతున్నదాని ప్రకారం ప్రపంచంలోని కమ్యూనిస్టుపార్టీలన్నీ తప్పుదారి పట్టాయి. సామ్రాజ్యవాదం మీదా, నెహ్రూవంటి దాని కీలుబొమ్మలమీదా పోరాటం మానివేశాయి. అందుకని రక్షణ బాధ్యతను చైనా నాయకత్వం తానే వహించి, దగ్గరలో ఉండి సులభంగా దాడిచేయడానికి వీలైన నెహ్రూమీద పోరాటం మొదలుపెట్టింది.

మనం మార్క్సిస్టులం. ఈ సమస్యను ఈ పద్ధతిలోనే పరిశీలించాలి. లేకుంటే చైనా నాయకత్వం నూరుకోట్లమంది ఆసియా ప్రజల స్నేహాన్ని జెంఘిజ్‌ఖాన్‌వంటివారి దురాశలకు బలియిచ్చారనీ, భూభాగాలూ, ప్రాచీనచరిత్రలూ, దేశపటాలూ, సరిహద్దులూమాత్రమే చూసుకొన్నారనీ చెప్పవలసివుంటుంది. అప్పుడు 1954 స్నేహ ఒడంబడిక, ఆ నాడిచ్చిన ఉపన్యాసాలూ, సూత్రీకరణలూ అర్థమే కావు.

యుద్ధం-యుద్ధం లేకపోవడం, స్నేహం-స్నేహం లేకపోవడం, ప్రతి అంగుళం భూమి నాదనడం - అనకపోవడం, రాజీలూ - పట్టు విడుపులూ - రాజీలు లేకపోవడం - పట్టువిడుపులు లేకపోవడం, దాడి-వున్నచోటే వుండడము - ఇవన్నీ వర్గ రాజకీయాలకూ, సిద్ధాంతాలకూ సంబంధించిన సమస్యలు. సోషలిస్టు ప్రభుత్వం విషయంలో మరీను.

మన పార్టీ, చైనా పార్టీ పరస్పరం అభివందనలు పంపుకొన్న 1949 నవంబరులో భారతదేశంగురించీ, దానితో పెట్టుకోవలసిన సంబంధాలగురించీ వారికిగల అభిప్రాయాలు వేరు. 1954 లో చౌ-ఎన్-లై ఢిల్లీలో మాట్లాడినప్పుడు వారికిగల అభిప్రాయాలు వేరు. 1957 మాస్కో ప్రకటన వచ్చాకకూడా వారు 1959 – 60 లో తమ అభిప్రాయాన్ని మార్చుకొన్నారు.

చైనా నాయకత్వం తమకున్న మార్క్సిస్టు-లెనినిస్టు పరిజ్ఞానాన్ని బట్టి పనిచేస్తూంటారు. సందేహం లేదు. అయితే కొన్ని సందర్భాలలో ఆ పరిజ్ఞానం తప్పు కావచ్చు. ఒప్పు కావచ్చు. అది వేరు సంగతి.

ఈవేళ ప్రపంచంలోవున్న మార్క్సిస్టు – లెనినిస్టుపార్టీలన్నీ భారత – చైనా సరిహద్దు సమస్య గురించి మార్క్సిస్టు – లెనినిస్టు సూత్రాల ప్రకారమే వాదిస్తున్నారు. అంతేకాని, దేశపటాలు, చరితలు, హక్కులమీద ఆధారపడి వాదించడంలేదు. మనమూ అంతే చెయ్యాలి.

భారతదేశంలోనూ ఇతరత్రాకూడ కొందరు పాతదేశపటాలు, పాతకాలపు సైనికాధికార చరిత్రలు, బ్రిటిషు సైన్యదళాల ఆక్రమణలు, సంధులు మొదలయినవి తవ్వి తీసే హడావుడిలో వున్నారు మహా భారత కాలంనాటి రాజవంశాల చరిత్రనూ, మంచూరాజుల పురాతన, అధునాతన చరిత్రలూ తవ్వితీస్తున్నారు. ఇరుపక్షాలూ తమ వాదనలకు బలం కూర్చుకొనేటందుకు తాము చెప్పేది 'న్యాయం' అనేందుకు అవన్నీ తోడుతెచ్చుకొంటున్నారు. ఆ సంగతి మన కిక్కడ వద్దు. ఏమంటే వాటిని జాగ్రత్తగా అధ్యయనం చెయ్యడంవలన ఇతర విధాలుగా లాభం ఉండవచ్చుగాని ఈ సమస్యలకు మూలం అక్కడలేదు. వీటి నవి పరిష్కరించలేవు.

ఇంక గత చరిత్రకూ – దేశపటాలకూ ఒకవెపు, రెండోవేపున మార్క్సిజం-లెనినిజానికీ, వర్తమాన, భవిష్యత్ కాల చరిత్రావసరాలకూ పొత్తు కుదరదనుకోండి. అప్పుడు వీటిలో దేనినిబట్టి సమస్యను అర్థం చేసుకోవాలి ? పరిష్కారానికి పూనుకోవాలి ? తప్పకుండా మార్క్సిజం – లెనినిజాన్నిబట్టే అనాలి. తమ పరిజ్ఞానానికి అందినంత

మట్టుకు చైనానాయకత్వం అదే చేస్తూంది. భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమూ, అంతర్జాతీయ కమ్యూనిస్టుపార్టీ నాయకత్వమూ కూడ అలాగే చెయ్యాలి. రెండు పెద్దపార్టీల అభిప్రాయాలు భేదించినప్పుడు, ఒక పార్టీ మిగిలినవాటికి వ్యతిరేకంగా నిలిచినప్పుడు చేయవలసిందేమిటి? తీర్పరి ఎవరవాలి? కమ్యూనిస్టు-కార్మిక పార్టీలన్నీ ప్రపంచ మహాసభజరిపి నిర్ణయించుకోవాలనేది సుస్పష్టమే.

అంతర్జాతీయంగా సిద్ధాంత రంగంలో 1959-60 లో ఏర్పడిన సంక్షోభం 1960 డిసెంబర్‌లో జరిగిన కమ్యూనిస్టు-కార్మిక పార్టీల ప్రతినిధుల సమావేశ నిర్ణయాలతో చక్కబడింది.

నెహ్రూ, చౌ ఎన్-లై సమావేశంతో భారత-చైనా సరిహద్దు సంక్షోభం తొలగింది. ఉద్రిక్తతలు పెరగలేదు. నిజానికి తగ్గాయి. దేశ పటాలు, సరిహద్దు విభాగాలు, గుర్తులు, స్థావరాలు మొదలగు సమస్యల మీద లభ్యమవుతున్న యథార్థ సమాచారాన్ని ఇరుపక్షాల అధికార వర్గాలూ కూర్చుని సంయుక్తంగా పరిశీలించ పూనుకొన్నారు. ఆ అధికారులు తమ నివేదికలనిచ్చారు. అక్కడితో అది ఆగింది. 1962 అక్టోబరులో సంక్షోభం పెద్దగా బ్రద్దలయ్యేవరకూ ఎవరి వాదనలమీద వారు వుంటూవచ్చారు.

వారి సిద్ధాంత అభిప్రాయాలలో వచ్చిన మార్పులతో భారత - చైనా తగాదాలో చైనా అనుసరిస్తున్న విధానం ఎలా మారిందో మరో మారు చూపించడం అవసరం.

1960 డిసెంబరులో ప్రపంచ మహాసభలో వచ్చిన ఒప్పందం ఒక ఘనవిజయం. సమష్టిగా ఆలోచించి, ఏకగ్రీవంగా ఆమోదించిన పత్రం ఒకటి ప్రపంచ కమ్యూనిస్టుపార్టీలకు లభ్యమయింది.

చైనా నాయకత్వం చేసిన విమర్శలను ప్రపంచ మహాసభా, అది చేసిన ప్రకటనా ధ్రువపరిచినాయనీ, వారు ప్రతిపాదించిన విధానాన్ని అంగీకరించాయనీ చెబుతున్నారు. ఆ సమావేశ నిర్ణయం ఏకగ్రీవంగా జరిగిందే గనక ఆ ప్రసక్తి తేవలసింది కాదు. కాని తెచ్చారు. కనక చెప్పకతప్పదు. ఆ ప్రకటననుచదివితే చైనావారు "లెనినిజం వర్థిల్లాలి"

అంటూ 'హెూంకీ' లో వ్రాసిన వ్యాసాలలోని ప్రధాన ప్రతిపాదనలను సమావేశం అంగీకరించలేదనాలి.

నిజానికి సమావేశంలో ప్రపంచ పార్టీలు తీసుకున్న ధోరణి చూస్తే చైనీయుల విమర్శలూ, ప్రతిపాదనలూ, ఆమోదించబడే స్థితి లేదు. చైనా నాయకత్వం నిజాన్ని గ్రహించింది. ఐక్యతా ధోరణిని కన బరచింది. కనకనే ఏకగ్రీవ ప్రకటన సాధ్యమయింది.

## 1960 ఒప్పందం భగ్నమయింది

కాని కొద్ది నెలల లోపలనే ఆ ధోరణి మారింది చైనా నాయకత్వం ప్రకటనలలోనూ, ఉదాహరణలు చూపించవలసి వచ్చినప్పుడూ మాత్రమే మాస్కో ప్రకటనను తీసుకోనసాగింది. కాని దానికి చేసే వ్యాఖ్యలూ, ఇచ్చే ప్రాధాన్యతలూ, తీసే అర్థాలూ – ఇలా ప్రధాన విషయాలన్నింటిలో వారు సమావేశానికి పూర్వం స్థితికి చేరిపోయారు.

ఈ నూతన అంతఃకలహంలో ఆల్బేనియాపార్టీ ముందు నిలబడింది. చైనా పార్టీ దానికి సహాయం చేసింది. స్వల్పకాలంలోనే తానుకూడా అదే ధోరణితో, అదే ప్రకటనతో బయటపడింది. నామ మాత్రంగా మిగిలినా, 1960 నాటి ఒప్పందం నిజానికి భగ్నమే అయింది.

1962 అక్టోబరు-నవంబరు నెలలలో ప్రపంచాన్నే కదిలించిన కరేబియన్ సంక్షోభం అటువంటి దశలోనే జరిగింది. అదే అక్టోబరు, నవంబరు మాసాలలో, ఇంచుమించు అదేరోజులలో భారత – చైనా సరిహద్దులో మళ్ళీ ఘర్షణలు రేగాయి. పెద్దఎత్తున చైనా దాడిజరిపింది.

ఈ రెండు ఘటనలకూ ప్రపంచ ప్రాముఖ్యత వుంది. రాజకీయం గానూ, సిద్ధాంత విషయంగానూ రెంటికీ సంబంధం వుంది. కరేబియన్ ఘటనలు ఏ క్రమంలో జరిగాయో, ప్రపంచంలోనూ, భారతదేశం లోనూ వాటి ఫలితా లేమిటో మనం గమనించాలిసి వుంది. ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంమీద, సిద్ధాంతరంగంలోకూడ ఈ ఘటనల ప్రభావం ప్రత్యక్షంగా పడింది అదేకాలంలో జరిగిన భారత–చైనా సంఘటనలు భారతకమ్యూనిస్టుపార్టీ మీదా, భారతదేశంలోని ప్రజా

తంత్ర శక్తులమీదా చాల తీవ్రమైన ఫలితాలను ప్రత్యక్షంగా కలిగించాయి.

క్యూబాపై 'రెండో మ్యూనిక్' సంధికుదుర్చుకున్నారని చైనా పార్టీ బహిరంగంగా సోవియట్ యూనియన్‌ను, సోవియట్ కమ్యూనిస్టుపార్టీని, కృశ్చేవ్‌ను నిందించింది. అమెరికన్ సామ్రాజ్యవాదం బెదిరించే సరికి లొంగిపోయిందన్నది. 'కరచరణాలాడలేదు' – అంది. అమెరికన్ దురాక్రమణ పరులు యుద్ధం చేస్తామనేసరికి "ఎలుకల్లాగ కదల మెదలకుండా" అయ్యారంది. మార్క్సిజం – లెనినిజానికి ద్రోహం చేస్తే, రివిజనిజానికి ఫలితం ఇల్లాగే వుంటుంది.

భారత – చైనా తగాదాలో చైనా నాయకత్వం చేపట్టిన దుందుడుకు పద్ధతినీ, అక్టోబరు – నవంబరు నెలలలో జరిపిన దాడినీ భారత దేశంలోని మేమూ వ్యతిరేకించాం. దేశరక్షణకూ, జాతీయైక్యతకూ నవంబరు 1 వ తేదీన తీర్మానం చేశాం. మాకూ అవే ఆరోపణలు, అవే తిట్లు, అవే బిరుదులు లభించాయి.

క్యూబా విషయంలో సోవియట్ యూనియనూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తీసుకొన్న నిర్ణయాలకున్న ప్రాముఖ్యతా ప్రాధాన్యత మా తీర్మానానికి, మా అభిప్రాయాలకూ లేదనుకోండి. క్యూబాదగ్గర వచ్చిన సమస్య ప్రపంచ యుద్ధం తెచ్చిపెట్టేది. అణుయుద్ధ విధ్వంసాన్ని కలిగించేది. మానవజాతికే అది ప్రమాదం సంఘటిల్ల చేసేది. ఇక్కడిది ఒక చిన్న యుద్ధ మయితే ఓ పెద్ద యుద్ధంగా పరిణమించేది.

అక్కడ ఆ నిర్ణయాలు తీసుకొన్నది ఒక పెద్ద, బలమైన కమ్యూనిస్టుపార్టీ. అక్టోబరు మహావిప్లవాన్ని నడిపిన పార్టీ అది. ప్రపంచంలోకల్లా మొట్టమొదటి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని నిర్మించిన పార్టీ అది. వారితో మేము పోలిక పెట్టుకోలేము.

అయితే పోలికలు తెచ్చుకో కూడదంటే తప్పదు. లేకుంటే చైనా నాయకత్వాన్ని అర్థం చేసుకోలేము. సరిహద్దు సమస్యకు పరిష్కారం కనుక్కోలేము. రెండు దేశాలమధ్యా మరల స్నేహాన్ని నెలకొల్పలేము.

## 4

# పెద్దమెత్తున చైనా జరిపిన దాడికి వెనుకనున్న రాజకీయ దృక్పథం

కరీబియన్ ప్రాంతంలో జరిగిన ఘటనలు అందరికీ తెలిసినవే. వాటిని సవివరంగా తిరిగి ప్రస్తావించనక్కరలేదు. అమెరికా ఉపఖండంలో, తమకు అతి సమీపంలో విప్లవకర సోషలిస్టు క్యూబా జీవించి ఉండటం అమెరికన్ సామ్రాజ్య వాదులకు ఇష్టంలేదు. దక్షిణ అమెరికన్ రాజ్యాలన్నిటికీ 'అంటు జాడ్యాన్ని' వ్యాపింపచేసే ఉదాహరణగా క్యూబా నిలబడిఉంది ప్రపంచంలో ప్రతిచోటా ప్రజాతంత్ర ఉద్యమాలను అణచివేమే అమెరికన్ సామ్రాజ్యవాదం పనిగా పెట్టుకున్నది. అలాంటిది అమెరికా ఉపఖండంలో క్యూబావంటి ఒక చిన్న దేశం తమను చిరకాలం దోపిడీచేసిన అమెరికన్ పెట్టుబడిదారుల నియంతృత్వాన్ని కూలద్రోసి- అమెరికన్ల తోటలను ఫ్యాక్టరీలను, బ్యాంకులను జాతీయంచేసి, వ్యవసాయ సంస్కరణలు అమలుజరిపి సోషలిజానికి పునాదులు వేయటం, తమకొక ఓటమిగా అమెరికన్ సామ్రాజ్యవాదులు భావించారు.

క్యూబా విప్లవాన్ని ప్రపంచ ప్రజాతంత్ర శక్తులన్నీ హర్షించాయి. సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు రాజ్యాలు

క్యూబాకు సహాయ సహకారాలను వాగ్దానంచేశాయి. ఫైడల్ కాస్ట్రో ఇలా అన్నారు :

"సోవియట్ యూనియన్, సోషలిస్టు శిబిరమూలేకుండా, వారి సహాయం లేకుండా సామ్రాజ్యవాదుల దురాక్రమణ నెదుర్కొంటూ ఒక చిన్న దేశమైన క్యూబాలో, విప్లవ విజయంపొందటం సాధ్యమయ్యేదికాదు."

అమెరికా సహాయంతో విప్లవ వ్యతిరేకులైన భూస్వాములు, పెట్టుబడిదారులు 1961 ఏప్రిల్‌లో ఫైడల్ కాస్ట్రో ప్రభుత్వాన్ని కూలదోయాలని ప్రయత్నించారు. కాని వారు విఫలులైనారు. అవకాశవాదులైన, ఫాసిస్టు కాందిశీకులు, క్యూబా విప్లవ సైన్యం ధాటికి తట్టుకోలేకపోయారు. దాంతో, క్యూబాపై పెద్దపెట్టున దాడి చేయాలని అమెరికన్ సామ్రాజ్యవాదులు నిర్ణయించారు.

1962సెప్టెంబరు మొదట్లో అమెరికా ప్రభుత్వం, తిరిగి క్యూబాను దిగ్బంధనం చేయసాగింది. సోవియట్ నుండి క్యూబా ఆయుధాలను తెచ్చుకుని అమెరికాపై దాడికి ప్రయత్నిస్తున్నదనే సాకుచూపసాగింది.

తాము చిరకాలంగా ప్రచారం చేస్తున్నామన్న సిద్ధాంతానికి వ్యతిరేకంగా ఆ మెరికా ఉపఖండంమీదనే సోవియట్ యూనియన్ కుపకరించే సైనిక కేంద్రంగా క్యూబా తయారయిందని అమెరికా సామ్రాజ్యవాదులు ఆరోపణలు చేశారు.

క్యూబాకు సోవియట్ తప్పక సహాయం చేస్తుందని, క్యూబాపై దాడి చేయడమంటే యుద్ధాన్ని కొనితెచ్చుకోవటమే నని అమెరికా ప్రభుత్వానికి తెలుసు కాని అమెరికన్ సైనికవాదులు, దుస్సాహసికులు ఉన్మాదులుగా తయారై, సోవియట్ హెచ్చరికలను పాటించకుండా క్యూబాపై దాడికి సన్నాహాలు సాగించారు.

క్యూబాతో తమకుగల ఒప్పందాని కనుగుణంగా, సోవియట్ యూనియన్ మధ్యరకం మిసిలీలను, తదితర ఆయుధాలను క్యూబా రక్షణకు పంపింది. సోవియట్ మిసిలీలు క్యూబాలో ఉండటంపట్ల అమెరికా ప్రత్యేకంగా 'అభ్యంతరం తెలిపింది.' ఏమంటే, ఆ మిసిలీల సహాయంతో, క్యూబాలోని అమెరికన్ నౌకా స్థావరంనుండి జరిగే

ఏ దాడినైనా క్యూబా జయప్రదంగా తిప్పికొట్టగలదు. సోవియట్ మిసిలీలు అమెరికాపై ఎదురుదాడి కుపయోగపడే భారీతహా మిసిలీలు మాత్రం కావు.

ఒకటి మాత్రం నిజం. మరొక రాజ్యానికి చెందిన మిసిలీలు అందులోనూ సోవియట్ యూనియన్‌కు చెందినవి సరిగ్గా తమ ముంగిటనే ఉండటమంటే ఏమిటో అమెరికన్ సామ్రాజ్యవాదులు మొట్టమొదటిసారిగా గ్రహించారు. టర్కీ, జపాన్, తదితర అనేక దేశాలలో సోవియట్ రష్యా చుట్టూ తమ మిసిలీలను ఆర్భాటంగా కేంద్రీకరించిన అమెరికా, క్యూబా విప్లవ రక్షణకై క్యూబాలో సోవియట్ మిసిలీలుండటం తమకొక ఓటమిగా భావించింది.

## యుద్ధ భేరీల మోత

సెప్టెంబరు, అక్టోబరు నెలల్లో అమెరికన్ సామ్రాజ్యవాదులు ప్రపంచయుద్ధానికి చేసినంతగా సన్నాహాలు చేశారు. సెప్టెంబరు 7 న అమెరికా తన రిజర్వు సేనలను సన్నద్ధం చేసింది. "క్యూబా" తదితర అంతర్జాతీయ ఉద్రిక్తతల వల్ల ఇది అవసరమైందని అమెరికా ప్రకటించింది. అక్టోబరు 5 న అమెరికా నౌకాదళం విన్యాసాలు ప్రారంభించింది. అక్టోబరు 18 న సోవియట్ విదేశాంగ మంత్రి గ్రోమికో కెన్నడీని కలుసుకొని తమ అసమ్మతి తెలియజేశారు. అక్టోబరు 22 న క్యూబాపై అమెరికా దిగ్బంధన ప్రారంభమైంది. అమెరికా దురాక్రమణ చర్యలను చర్చించేటందుకు అక్టోబరు 23 న భద్రతాసమితి సమావేశమైంది.

ఘటనలు అతి త్వరగా పరుగెత్తసాగాయి. తన సైన్యాన్నంతటినీ అమెరికా దాడికి సన్నద్ధంచేసింది యూరప్‌లోని దళాలు, మధ్యధరా సముద్రంలోని ఆయా నౌకాదళాలు, తైవాన్ ప్రాంతంలో వారి ఏడో నౌకాదళంకూడా సన్నద్ధం చేయబడ్డాయి క్యూబాపై దాడికిగాను, సాయుధ శకట దళాలు, పదాతిదళాలు, విమాన బలగాలకు చెందిన మొత్తం 10 లక్షల సైనికులను అమెరికా కేటాయించింది.

ఇవన్నీగాక, 103 యుద్ధనౌకలు, 85 వేలమంది నావికులతో క్యూబా తీరంవైపు కదిలాయి. క్యూబా భూభాగంపై సైనికులు దిగుతుంటే రక్షణకుగాను వేలాది విమానాలను అమెరికా సిద్ధంగా ఉంచింది. అణు, ఉదజని బాంబులతోసహా ఈ విమానాలు రాత్రింబగళ్ళు ఆకాశమార్గంలో పహరా ఇవ్వసాగాయి. రిజర్వుసైన్యాలు సమాయత్తం చేయబడ్డాయి.

యూరపులోని నాటో దేశాలన్నీ అమెరికా దాడిని బలపరచేందుకు సిద్ధంగా నిలచిఉన్నాయి. అమెరికా, దక్షిణ అమెరికా దేశాల బలగాల సంయుక్త సైన్యాధ్యక్షవర్గం ఏర్పడ్డది. క్యూబా దిగ్బంధనలో పాల్గొనేందుకు కొన్ని దక్షిణ అమెరికా దేశాలు తమ నౌకలను పంపాయి. అమెరికన్ సామ్రాజ్యవాదుల ఈ దురాక్రమణ చర్యల ఫలితంగా అణుయుద్ధ ప్రమాదం ప్రపంచానికి ఏర్పడ్డది.

ఈ ఘటనలపై సోవియట్ ప్రధాని కృశ్చేవ్ సుప్రీం సోవియట్‌కు సమర్పించిన నివేదికలో యిలా ఉంది :

"తీవ్రమైన ఈ యుద్ధ సన్నాహాల దృష్ట్యా, మనంకూడా కొన్ని అవసరమైన చర్యలు తీసుకోవలసివచ్చింది. సోవియట్ సైన్యాన్నంతా సర్వసన్నద్ధంగా ఉంచవలసిందిగా మన రక్షణ మంత్రికి సోవియట్ ప్రభుత్వం ఆదేశాలిచ్చింది. ముఖ్యంగా, ఖండాంతర మిసిలీదళాలను, కీలక స్థావరాలలో ఉపయోగించే మిసిలీదళాలను, భూమినుండి అంతరిక్షానికి పయనించే మిసిలీలను, విమాన విధ్వంసక రక్షకదళాలను, ఎదురు దాడిచేసే విమానబలసంపదను, కీలకమైన విమానబలగాలను, నౌకాబలగాలను – సర్వసన్నద్ధంగా ఉంచవలసిందిగా సోవియట్ ప్రభుత్వం ఆదేశాలిచ్చింది.

"మన జలాంతర్గాముల దళమూ, అణుబాంబులు గల జలాంతర్గాముల దళమూ ప్రభుత్వ ఆదేశాల మేరకు తమ తమ స్థానాలలో సంసిద్ధంగా వున్నాయి. పదాతిదళాలను మరింత సైనిక సన్నద్ధతలో ఉండవలసిందిగా ఉత్తర్వులిచ్చాము. కీలక మిసిలీదళాలనుండి, విమాన విధ్వంసక దళాలనుండి, జలాంతర్గాములదళమునుండి పదవీ విరమణకు సిద్ధంగావున్న ఆఫీసర్లందరినీ పదవులలోనే ఉండవలసిందిగా ఆదే

శించాము. వార్సా సంధిరాజ్యాల సేనలనుకూడా సర్వసన్నద్ధం చేశాము.

"ఈ పరిస్థితులలో ఇరుపక్షాలలో ఎవరో ఒకరు నిగ్రహించూపక పోతే, యుద్ధప్రజ్వలనను నిరోధించేందుకు చేయవలసినదంతా చేయక పోతే, అపారమైన నష్టాలను కలిగించే యుద్ధ ప్రజ్వలన తప్పక సంభవించి ఉండేది"

(1962 డిసెంబరు 12న, సుప్రీం సోవియట్‌లో కృశ్చేవ్ ఇచ్చిన నివేదికను డి).

నిప్పుతో చెలగాటం కూడదని, ప్రపంచ భవిష్యత్తుతో ఆటలాడ వద్దని అమెరికాను హెచ్చరిస్తూనే, సోవియట్ ప్రభుత్వం దురాక్రమణదారులను నిరోధించవలసి దిగా ప్రపంచ ప్రజలందరికీ విజ్ఞప్తి చేసింది. అదే సమయంలో ఐరాసలో కూడా అవసరమైన చర్యలు తీసుకున్నది.

ఐనప్పటికి అక్టోబరు 27న, దాడికి అమెరికన్ సామ్రాజ్య వాదులు సన్నాహాలు చేశారు. క్యూబా ప్రభుత్వం, తదితరవర్గాలు ఆ విషయాన్ని తెలియజేశాయి.

కృశ్చేవ్ నివేదికలో ఇంకా ఇలా ఉంది:

"క్యూబాపై దాడిని నిరోధించి శాంతిని కాపాడేందుకు సత్వర చర్యలు అవసరమైనాయి. ఉభయులకు అంగీకారమైన ఒప్పందాన్ని కుదుర్చుకుందామని అమెరికా అధ్యక్షునికి సందేశం పంపాము. యుద్ధ జ్వాల అప్పటికే రగులుకొంటున్నప్పటికీ, దానిని ఆర్పివేయటానికి ఇంకా అవకాశం లేకపోలేదు.

"ఆనాటికి రూపొందిన పరిస్థితులపట్ల అమెరికా అధ్యక్షుడుకూడా ఆందోళన పడుతున్నాడనీ పరిష్కారమార్గం కనుగొనే కోర్కెను కలిగి ఉన్నాడనే భావం ఆయన పంపిన సందేశంలో వ్యక్తమైంది... మేము సందేశం పంపేటప్పుడు ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకున్నాము. క్యూబాపై దాడి చెయ్యబోము అని వాగ్దానం చేసి, అలా దాడిచేయకుండా ఇతర రాజ్యాలనుకూడా అమెరికా అదుపుచేసినట్లయితే, క్యూబాలోవున్న 'ఎదురుదాడి' చేసే ఆయుధాలు అని అమెరికా చెబు

తున్నవాటిని తొలగించటానికి సోవియట్ యూనియన్ సిద్ధమేనని మేము ప్రకటించాము.

"అందుకు అమెరికా అధ్యక్షుడు సమాధానం ఇచ్చాడు. పైన పేర్కొన్న ఆయుధాలను క్యూబానుండి తొలగించేందుకు సోవియట్ ప్రభుత్వం వాగ్దానంచేస్తే క్యూబా దిగ్బంధనాన్ని అమెరికా రద్దుచేస్తుందని ఆయన ప్రకటించాడు. క్యూబాపైన అమెరికాగాని, ఆ ఉపఖండంలోని ఇతర మిత్ర రాజ్యాలుగాని దాడిచేయబోవని ప్రకటించారు. అమెరికా అధ్యక్షుడు చేసిన ఈ ప్రకటన చాలా స్పష్టంగావుంది. క్యూబాపై అమెరికా దాడి చేయదని ఇతర (మిత్ర) రాజ్యాలు దాడి చేయకుండా ఆపు చేస్తుందని ప్రపంచానికంతా తెలుసు.

"క్యూబాపై దాడిని నిరోధించేందుకే మేము అసలు ఆయుధాలను అక్కడకు పంపాము. కనుకనే క్యూబా నుండి ఖండాంతర మిసిలీలను తొలగించడానికి సోవియట్ యూనియన్ తన సంసిద్ధతను వెలిబుచ్చింది.

"క్లుప్తంగా చెప్పాలంటే, ఈ విధంగా ఉభయ పక్షాలకు అంగీకృతమైన ఒప్పందం కుదిరింది. ఇది విజ్ఞతకు విజయం, శాంతి శక్తులకు గెలుపు"

అక్టోబరు 29న న్యూయార్కులో, అమెరికా, సోవియట్ యూనియన్, క్యూబా ప్రతినిధుల మధ్య రాయబారాలు ప్రారంభమయ్యాయి. ఇందులో యూథాంటు కూడా పాల్గొన్నాడు."

(క్రుశ్చేవ్ నివేదికనుండి.)

## సంప్రతింపులు - శాంతి

ఈ లోగా ఉభయపక్షాలు తమ వాగ్దానాలు నెరవేర్చటానికి పూనుకున్నాయి. క్యూబానుండి రాకెట్లన్నింటినీ సోవియట్ తరలించింది. నవంబరు 20 న అమెరికా క్యూబాపై విధించిన దిగ్బంధనాన్ని తొలగించింది. తన యుద్ధ నౌకలను ఆ ప్రాంతంనుండి వెనుకకు పిలిపించింది. ఫ్లోరిడా ప్రాంతంనుండి విమానాలను, సైన్యాలను కూడా అమెరికా వెనక్కు పిలిపించింది. రిజర్వు దళాలకిచ్చిన పిలుపును ఉప

సంహరించింది. క్యూబాపై దాడిజరుపబోము అన్న ప్రకటనను కెన్నెడీ పునరుద్ఘాటించారు. నవంబరు 21 న, చైనావారు భారత-చైనా సరిహద్దుపై యుద్ధవిమరణ చేశారు.

ఈ ఘటనలన్నిటి ఫలితంగా ఏర్పడిన పరిస్థితి ఏమిటి ?

క్యూబా విప్లవాన్ని నాశనం చేయాలని, అందుకవసరమైతే ప్రపంచ యుద్ధానికైనా తయారుకావాలని అమెరికన్ సామ్రాజ్యవాదులు అనుకున్నారు. కాని వారి ఎత్తుగడలు భగ్నమయ్యాయి. క్యూబా సజీవంగా ఉంది. రోజు రోజుకూ బలపడుతూ ముందుకు సాగుతున్నది ప్రపంచ యుద్ధమూ, అణుయుద్ధం ఫలితంగా ఏర్పడే లక్షలాది ప్రజా నాశనమూ నివారితమయ్యాయి.

క్యూబా స్వాతంత్ర్యం, ప్రపంచశాంతి, ఈ రెండూ రక్షించబడినాయి. ఈ రెంటిపైనా అసక్తిగల ప్రతి ఒక్కరూ ఈ ఫలితంపట్ల సంతృప్తి వెలిబుచ్చారు. యుద్ధంపట్ల సామ్రాజ్యవాదులకుగల తహతహ అణచివేయబడ్డది. సామ్రాజ్యవాదుల దురాక్రమణ స్వభావంలో మార్పు లేకపోయినా, ప్రపంచయుద్ధం మాత్రం నివారించబడ్డది.

శాంతిశక్తులు, సోవియట్ నాయకత్వాన సోషలిస్టు శక్తులు, క్యూబా విప్లవమూ, సాధించిన ఈ విజయంపట్ల చైనా నాయకత్వం ఏవైఖరిని అవలబించింది ? ఇది 'రెండో మ్యూనిక్' అని సామ్రాజ్యవాదులు అణుయుద్ధ బెదరింపుకు లొంగుబాటు అంటూ వారు ఈ చర్యను ఖండించారు. క్యూబా స్వతంత్రంగానే ఉంది క్యూబాపై దాడి నివారితమైంది. ప్రపంచయుద్ధం ఆగిపోయింది. ఈ పరిస్థితులలో ఇది లొంగుబాటు ఎలా కాగలదు ?

సోవియట్ వ్యతిరేక పిడివాద ప్రచారం సాగిస్తున్న చైనా నాయకత్వం ముఖ్యమైన ఈ అంశాన్ని పక్కకునెట్టి, క్యూబానుండి మిసిలీలు తరలించబడినవో లేదో 'పరిశీలించే' అమెరికా హక్కును గుర్తించటంద్వారా క్యూబా స్వాతంత్ర్యాన్ని తాకట్టుపెట్టారంటూ గగ్గోలుపెడుతున్నారు. ఫైడల్ కాస్ట్రో అయిదు కోర్కెలనూ బలపరచేవారు తా మొక్కరే అయినట్లు గొప్పలు చెప్పుకుంటున్నారు. ప్రపంచంలోని ప్రతి సోషలిస్టుదేశమూ, ప్రతి కమ్యూనిస్టుపార్టీ ఈ

కోర్కెలను బలపరుస్తూనే ఉంది. ఈ విషయమై సుప్రీం సోవియట్‌లో మాట్లాడుతూ కృశ్చేవ్ ఇలా అన్నారు :

"కరిబియన్ సంక్షోభాన్ని పరిష్కరించే సూచన ఏదైనా దీర్ఘ కాలం నిలిచేదిగా ఉండాలని క్యూబా ప్రభుత్వం సహజంగానే కోరు కొంటున్నది. దురాక్రమణకు వ్యతిరేకంగా క్యూబాప్రభుత్వానికి రక్షణ లుండాలని, శాంతి పరిస్థితులలో క్యూబాప్రజలు తమ నూతనజీవితాన్ని తామే నిర్మించుకొనే అవకాశా లుండాలని సహజంగానే క్యూబా ప్రభుత్వం కోరుతున్నది. అక్టోబరు 28 న క్యూబాప్రధాని ఫైడల్ కాస్ట్రో చేసిన ప్రసంగంలో వెల్లడించిన అయిదు సూత్రాల లక్ష్యం ఇదే. ఈ సూత్రాలను మేము పూర్తిగా బలపరుస్తున్నాము".

అమెరికా బెదిరింపులకు లొంగి, కృశ్చేవ్ మిసిలీలను తొలగించాడని చైనా ప్రచారం చేస్తోంది. 'లొంగిపోవటమనే' నేరాన్ని కృశ్చేవ్ చేశాడని వారి వాదన. మిసిలీల సమస్యపైననే ఈ సంక్షోభం అంతా పెరిగి ప్రపంచ యుద్ధ ప్రమాదం ఏర్పడ్డదా ? మిసిలీలు క్యూబా లోనే ఉండవలెనా, లేక సోవియట్‌కు తరలించబడవలెనా అనేది ఈ సంక్షోభంలో ముఖ్య సమస్య కానేకాదు. క్యూబాపై దాడిచేయ డానికి అమెరికన్ సామ్రాజ్యవాదానికి అవకాశం ఇచ్చామా ? క్యూబా స్వతంత్రం నిలబడిందా ? నాశనమైందా ? అనేది అసలు ప్రశ్న.

మిసిలీలు తరలించబడ్డాయి. దురాక్రమణదారులు దాడి యత్నా లను విరమించారు. క్యూబా సగర్వంగా నిలబడ్డది. దురాక్రమణదార్లు వెనక్కి తగ్గడానికి కారణం మిసిలీలు తరలించబడినందువల్ల కాదు. సోష లిస్టు శిబిరం బలానికి, ప్రపంచ ప్రజాతంత్రశక్తుల బలానికి వ్యతిరేకంగా నిలిచి ప్రపంచ యుద్ధాన్ని తెచ్చిపెట్టడంలో గల ప్రమాదాన్ని సామ్రాజ్య వాదులుగూడా గుర్తించినందుననే వారు వెనక్కుతగ్గారు. కాని చైనా వారు మాత్రం దీనిని 'తలఒగ్గటం' అనీ, 'భయకంపితుల లొంగుబాటు' అనీ వక్కాణిస్తున్నారు.

క్యూబా ప్రజలను, ప్రపంచ కార్మికవర్గాన్ని, సోవియట్ యూని యన్‌కూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా రెచ్చగొట్టడం తోనే చైనా నాయకులు సంతృప్తి పడటం లేదు. క్యూబాకు రాకెట్లను

పంపినందుకే సోవియట్ యూనియన్‌ను వారు నిందిస్తున్నారు. అమెరికన్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా కృశ్చేవ్ తీసుకున్న చర్య "దుస్సాహసిక చర్య" అని "అణుయుద్ధ బెదరింపు"లని వారు విమర్శిస్తున్నారు. సోవియట్‌కు వ్యతిరేకంగా అమెరికన్ సామ్రాజ్యవాదులూ సరిగ్గా ఇదేవాదన చేస్తున్నారనే విషయం ప్రతి ఒక్కరూ తేలికగానే గ్రహించగలరు.

సోవియట్ పార్టీకి, ఆ పార్టీని బలపరిచేవారికీ వ్యతిరేకంగా చైనాపార్టీ సాగిస్తున్న అసహ్యాకరమైన ప్రచారాన్ని, అసభ్యమైన నిందారోపణలను అన్నిటినీ పరిశీలించటం సాధ్యంకాదు. 1962 డిసెంబరు 12 న సుప్రీం సోవియట్‌లో కృశ్చేవ్ చేసిన ప్రసంగంలోనే, కరిబియన్ సంక్షోభానికి సంబంధించిన సమగ్రమైన చిత్రణ ఉన్నది.

భారత చైనా వివాదానికి ఈ సంక్షోభానికి ప్రత్యక్ష సంబంధముంది. అందువల్లనే ఈ సమస్య మనకు చర్చనీయాంశమైంది.

సరిగ్గా ఆదే సమయంలోనే భారత – చైనా సరిహద్దు వివాదం ప్రజ్వరిల్లడం, దాదాపు యుద్ధపరిస్థితి ఏర్పడటం కేవలం యాదృచ్ఛికమే కావచ్చుకాని చాలా ప్రాముఖ్యంగల యాదృచ్ఛిక ఘటన. చైనావారి నిరసన పత్రాలు, సరిహద్దు ఘర్షణలు సెప్టెంబరులో తీవ్రతరం కాసాగాయి. సెప్టెంబరు 7 వ తేదీనుండి, రిజర్విస్టులకు పిలుపిచ్చి, కెన్నెడీ కూడా ఉద్రిక్తతను పెంచసాగాడు.

సెప్టెంబరు 8 న మాక్‌మాహన్ రేఖపైనా, థాగ్లాకనుమను చైనావారు అతిక్రమించి భారతభూభాగంలోకి ప్రవేశించారు. సెప్టెంబరు 20 న భారత సైనికులపై వారు తుపాకులు పేల్చారు. అక్టోబరు 9 న మోర్టార్ ఫిరంగులతో కాల్పులు ప్రారంభించారు. అక్టోబరు 20 న పెద్ద సైనికదాడి జరిపి, ఢోలావద్దఉన్న భారతీయ కేంద్రాలను వశపరచుకున్నారు. ఈ విధంగా అక్టోబరు 20 న చైనావారు పెద్దఎత్తున ప్రారంభించినదాడి, క్యూబాపై నౌకా దిగ్బంధన ద్వారా ప్రపంచయుద్ధ ప్రజ్వలనకై అమెరికా చేస్తున్నసన్నాహాలు – ఒకేకాలంలో జరిగాయి.

సరిహద్దు రేఖను వేర్వేరు చోట్ల ఎదిరిపక్షం సైనికులు అతిక్రమిస్తున్నారనే ఆరోపణలను, ప్రత్యారోపణలను తమ ప్రాంతపు హక్కు

లకు భంగం కలుగుతున్నాయనే పత్రాలను, ఉభయపక్షాలు పంపుకుం టూనే ఉన్నాయి. కాని 1959 తర్వాత నిజానికి సైనికచర్యలేవీ జరగ లేదు. 1962 అక్టోబరు, నవంబరు ఘటనలు మాత్రం అలాంటివి కావు. ఇది ఒక యుద్ధ స్వభావాన్ని కలిగిఉన్నాయి.

లడక్ ప్రాంతంలో భారతీయ సైన్యాలేర్పాటుచేసిన గస్తీ కేంద్రా లను తమ సైనికబలం ద్వారా చైనావారు నిర్మూలించారు. మాక్ మాహన్ ప్రాంతంలో చైనావారు ఆ రేఖనుదాటి నేఫా ప్రాంతంలోకి దక్షిణంగా పెద్దఎత్తున చొచ్చుకువచ్చారు. ఈ ప్రాంతం కూడా తమదే నని చైనావారి వాదన.

## వివాద స్వభావంలో మార్పు

ఈ దాడితో సరిహద్దు వివాదంలో ప్రధానమైన, మౌలికమైన మార్పు వచ్చింది. సరిహద్దు కాపలాదళాలు పైకీ, కిందికీ గస్తీ తిరగ డమో లేక, విడివిడిగా ఘర్షణలు జరగడమో అనే పరిస్థితి మారి పోయింది. చైనావారు ఆధునిక ఆయుధాలుగల సైనిక డివిజన్లను పెద్దయెత్తున రంగంలోకి దించారు. అన్ని హంగులు కలిగిన యుద్ధంలో వలెనే వారు వ్యవహరించసాగారు.

ఖచ్చితమైన అంచనాలప్రకారం సంపూర్ణంగా వారు సన్నాహాలు చేసుకున్నారు ఇది వారి కెప్పుడూ మామూలే. భారత భూభాగంలో భారతీయ సైనికులకు ఆశ్చర్యం కొలిపే విధంగా వారు వేగంగా ముందుకు చొచ్చుకువచ్చారు. ఒక్కొక్క పట్టణమే పతనం కాసాగింది. అక్టోబరు 23 న తావాంగ్, నవంబరు 17 న సేలా, నవంబరు 18 న బోండిలా చైనావారి స్వాధీనమైనాయి. బోండీలా మాక్‌మాహన్ రేఖకు 70 కిలోమీటర్లు దక్షిణాన ఉన్నది.

నవంబరు 21 న వారు చాకోలో ప్రవేశించారు. లడక్ రంగం లోనూ ఇలాంటి ఘటనలే జరిగాయి.

హిమాలయ పర్వతాలనుండి కిందికిదిగి, చదునైన నేఫా ప్రాంతం లోకి ఎట్టి అవరోధంలేకుండా చైనా సేనలు అక్టోబరు 20 – నవం బరు 21 వ తేదీలమధ్య చొచ్చుకువచ్చాయి. అస్సాం సరిహద్దులలోకి

చేరుకున్న ఆ రోజున చైనావారు యుద్ధవిరమణ ప్రకటించారు. క్యూబాపై నౌకా దిగ్బంధాన్ని అమెరికన్లు ఉపసంహరించి వెనుకకు తగ్గిన తర్వాత 24 గంటలకు ఈ యుద్ధ విరమణ జరిగింది. ఇదికూడా ఆశ్చర్యకరమైన యాదృచ్ఛిక ఘటనే కావచ్చు.

కరిబియన్ సంక్షోభ ఘటనలు భారత ప్రజల మనస్సులలో అంతగా హత్తుకొని లేవు. ముందుకు చొచ్చుకువస్తున్న చైనా సేనల పైననే ప్రజలదృష్టి అంతా కేంద్రీకృతమై ఉంది. అంతా ఒకే ఒక ప్రశ్న అడిగసాగారు. ఈ సైన్యాలు ఎక్కడ ఆగుతాయి? అసలు వీటిని ఎవరైనా ఆపుతారా? ఎలా ఆపుతారు? ఆ దశలో చైనా సైన్యాలను ఎవరూ ఆపలేదు. వారికి వారే ఆగిపోయారు. నవంబరు 21 రాత్రి తమకుతామై యుద్ధవిరమణ ప్రకటించారు. 1962 డిసెంబరు 1 నుండి మాక్‌మాహన్‌రేఖ ఉత్తరంవైపుకు తాము ఉపసంహరించుకుంటామని ప్రకటించారు. నవంబరు 1957న తామెక్కడ ఉన్నామో అక్కడికి వెనక్కు తగ్గుతామన్నారు.

యుద్ధం ప్రకటించకుండానే యుద్ధం చేస్తున్నంత ఫాయాలో అకస్మాత్తుగా చైనా ఈ దాడిని ఎందుకు ప్రారంభించినట్లు?

అక్టోబరు 12న నెహ్రూ చేసిన ప్రసంగం విషయమై చైనావారు పెద్ద హంగామా చేస్తున్నారు. చైనా వారిని వెళ్ళగొట్టవలసిందిగా సైన్యానికి ఉత్తర్వులిచ్చినట్లు నెహ్రూ ఆ ప్రసంగంలో తెలియజేశారు.

## అసంబద్ధమైన వాదన

చైనావారు ఆక్రమించిన ధోలా స్థావరాన్ని ఉద్దేశించి పైపైనంగా జరిగిందనే విషయం మొట్టమొదటగా గుర్తుంచుకోవాలి. ఈ స్థావరం మాక్‌మాహన్ రేఖకు దక్షిణంగా ఉన్నదని భారత ప్రభుత్వ వాదన. ఇక్కడ ఉభయపక్షాలకు వివాదగ్రస్తమైనది 4 లేక 5 మైళ్ళ ప్రాంతం మాత్రమే.

ఇక రెండవ విషయం. చైనావారు ఆక్రమించిన ప్రాంతాలను తిరిగి స్వాధీనం చేసుకోవాలనే విషయమై పార్లమెంటులో ప్రశ్నలు వచ్చినప్పుడల్లా చైనా ఆక్రమించిన ప్రతి అంగుళం భూభాగాన్ని తిరిగి

స్వాధీనం చేసుకునేవరకు విశ్రమించబోమని ప్రభుత్వం ప్రకటిస్తూనే ఉన్నది. ఇలా చేసిన ప్రతి ప్రకటనను, చైనా వారిపై యుద్ధానికి ఇచ్చిన పిలుపుగా అర్థం చేసుకోరాదు.

మూడో విషయం : మాక్ మాహన్ శ్రేణి వెంబడే చైనావారి సైనికచర్య నెహ్రూ అక్టోబరు 12న చేసిన ప్రసంగం తర్వాత కాక, అంతకు ముందే సెప్టెంబరు 8 ననే ప్రారంభమైంది.

ఇక నాలుగో విషయం : ఎదురుదాడికి భారతసేన సన్నద్ధమై గాని, మొహరించిగాని లేదని చైనావారికి పూర్తిగా తెలుసు. భారత సేన పరిస్థితులు, వారి ఉద్దేశాలు, తెలుసుకోటానికి తగినంత విస్తారంగాను, సమర్థవంతంగాను చైనా గూఢచారి దళాలు పనిచేస్తూనే వున్నాయి.

అయిదో విషయం : చైనా సేనలకు వెనుకభాగంలో పీఠభూమి వుంది. ఇక భారతసేనలు క్రిందినుంచి కొండలను, లోయలను అధిరోహించి పోరాడవలసి ఉంది. సైనికంగా ఇది అననుకూలమైన వ్యవహారం.

ఆరో విషయం. ఎదురుదాడిని త్రిప్పికొట్టుటమే చైనావారి లక్ష్యమైతే అస్సాం సరిహద్దులవరకు పెద్దఎత్తున చొచ్చుకురావలసిన అవసరం లేదు.

చైనా దాడికి ముందుగా సర్వసన్నాహాలు జరిగాయి. ఎంత దూరమైనా వెళ్ళటానికి వారు సిద్ధమై ఉన్నారు. భారతదేశంలోని "తలబిరుసు" వాళ్ళకు ఒక గుణపాఠం నేర్పవలసి ఉందని, ముందునుండి చైనావారు తమ ప్రకటనలలో చెబుతూనే ఉన్నారు. యుద్ధవిరమణ తర్వాత, "భారతీయ దురాక్రమణదారులకు ఒక పాఠం నేర్పి" చైనా వారు వెనక్కుతగ్గారు.

క్యూబా సమస్యపై ప్రపంచ సంక్షోభం ముంచుకువస్తున్నదని చైనావారికి పూర్తిగా తెలుసు. క్యూబాపై దాడికి అమెరికా తయారవుతున్నదని చైనావారికి తెలుసు.

అమెరికాకు ప్రతిద్వంది౦గా అత్యంత బలసంపదలు గలిగిన సోవియట్ యూనియన్ యుద్ధ భారాన్నంతా మోయవలసి ఉంటుందనీ, అలాంటియుద్ధంలో పెద్దఎత్తున ఉభయపక్షాలు అణ్వాయుధాలు ప్రయో

గించి తీరతాయనీ, చైనావారికి తెలుసు. ఉత్తర అట్లాంటిక్ కూటమి లోని బ్రిటిష్, ఇతర సామ్రాజ్యవాదులు ఆయుధాలతో సిద్ధంగా ఉండ వలసిందిగా కోరబడినట్లుకూడా చైనావారికి తెలుసు.

ఈ పరిస్థితులలో యుద్ధాన్నినివారించి, ప్రపంచశాంతినికాపాడి, అణుయుద్ధంనుండి ప్రపంచప్రజలను సంరక్షించాలని వాంఛించే వారెవ రైనా తమకు తామై చేయవలసినదేమిటి ?

తైవాన్‌లోని అమెరికన్లతో పోరాడుతున్నామని, చైనా భూభా గంలోని ప్రతి అంగుళం నుండి వారిని వెళ్ళగొట్టు తున్నామని "దెబ్బకు దెబ్బ" తీస్తున్నామని, చైనా నాయకత్వం ఎల్లప్పుడూ ప్రక టిస్తూనే ఉన్నది. సరిగ్గా అలాంటి అవకాశం కలిగించే పరిస్థితే ఆనాడు ఏర్పడ సాగింది. అలాంటప్పుడు "దెబ్బకు దెబ్బ" అనీ, అమెరికన్ సామ్రాజ్యవాదులను బట్టబయలు చేయటం అనీ, పదే పదే ప్రకటనలు చేయడంతో తృప్తిపడక తాము మాటలను ఆచరణలో పెట్టి ఉండ వలసిందిగదా !

భయకంపితులు కాని, నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టులుగా చైనా వారు, తమ సైన్యాలను సన్నద్ధం చేయవలసింది. కరిబియన్ సంక్షో భంలో అమెరికా ఇరుక్కుంటున్నదని, సోవియట్ యూనియన్‌తో తలపడనున్నదని గ్రహించిన చైనావారు, తమ సేనలతో బ్రిటిష్ స్థావరమైన హాంగ్‌కాంగ్‌పైన, పోర్చుగీసు స్థావరమైన మకావ్‌పైన దాడిచేసి ఉండవలసింది.

చైనా భూభాగంపై అమెరికా జరిపిన ఉల్లంఘనలకు వ్యతి రేకంగా వందలాది నిరసన పత్రాలను అదివరకే పంపించి ఉన్నట్లు చైనావారు ప్రపంచానికి తెలియజేస్తూనే ఉన్నారు. అలాంటప్పుడు, రాజకీయ, సైనికదృష్ట్యాగాని, "రాజీలేని" మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం దృష్ట్యాగాని, సామ్రాజ్యవాదాన్ని చైనా భూభాగంనుండి తుడిచిపెట్టి నిర్మూలన చేయటానికి, ఆనాటికంటే మంచి అవకాశం ఇంకెప్పుడు లభిస్తుంది ?

## చైనావారి సమర్థన ఏమిటి ?

ఇలాంటిపని ఏదీ చైనా నాయకత్వం చేయలేదు. ఇది చాలా ఆశ్చర్యకరం. నెహ్రూకు హెచ్చరికలను పంపడం కొనసాగించింది. హిమాలయాలలో కొంకా కనుమ, ఘాగ్లాలోయలలో సైన్యాల మోహరింపు సాగించింది. తైవాన్, కాంటన్, హాంగ్‌కాంగ్, మకావోలు ప్రశాంతంగానే ఉండిపోయాయి. క్యూబా రక్షణ బాధ్యతఅంతా, ముంచుకొస్తున్న ప్రపంచ యుద్ధాన్నీ, అమెరికన్ సామ్రాజ్యవాదులను ఎదుర్కొనే బాధ్యతంతా సోవియటుకే అప్పగించబడ్డది. ఈ విధంగా విచిత్రమైన అంతర్జాతీయ సౌహార్ద్రతను చైనావారు ఎలా సమర్థించుకోగలరు ?

సుప్రీం సోవియట్‌లో మాట్లాడుతూ కృశ్చేవ్ ఇలా ప్రశ్నించారు :

“మార్క్సిస్టు లెనినిస్టులమని పిలుచుకునే వీరు ఏమికోరుతున్నారు ? అడినోవర్ ఏమి కోరుకుంటున్నాడో ఆ లక్ష్యం కొరకే వీరూ కృషి చేస్తున్నారు. తగాదాలను రెచ్చగొట్టి, అంతర్జాతీయ ఉద్రిక్తతను పెంపొందించటానికి తోడ్పడుతున్నారా ? ‘నీవు ఎడమ వైపుగా వెళ్ళితే, తిరిగి కుడివేపే చేరుకుంటావ’నే సామెతలో ఎంతో నిజం వుంది. వాస్తవ పరిస్థితులను పరిశీలిస్తే ఒక విషయం బోధపడుతుంది. క్యూబా సంక్షోభకాలంలో తగాదాను రెచ్చగొట్టటమే లక్ష్యంగాగల వ్యక్తులవలె వీరు ప్రవర్తించారు. అమెరికా, రష్యాల మధ్యఘర్షణను సృష్టించాలని వారు ప్రయత్నించారు. ప్రపంచంలో రెండు పెద్ద రాజ్యాలైన ఈ రెండు దేశాలమధ్య ఘర్షణ రావడం అంటే ఏమిటి ? ప్రపంచ వ్యాపిత అణు యుద్ధానికి మీట నొక్కడమే నన్నమాట.

“ఇలాంటి యుద్ధ పరిస్థితిలో వీరు ఎలా ప్రవర్తిస్తారో తెలుసుకోవటం ఆసక్తిదాయకమైన విషయం. అందులో పాల్గొనటానికి సిద్ధపడతారని నేననుకోను. బహుశా ప్రేక్షకులలో ప్రక్కన కూర్చోటానికి

వారు ఇష్టపడతారు. అయితే ఒక ప్రశ్న అడగవచ్చా—మీా కసలు కావాలసిందేమిటి ?

ఈ ప్రశ్నకు సమాధానం చెప్పటానికి, చాలా చిన్న పార్టీ ఐన మాకు అర్హతలేదు.

ఎవరైనా ఒక ప్రశ్న వేయవచ్చు. హాంకాంగ్, మకావోలు చైనాకు కూతవేటు ధూరంలోనే ఉన్నాయి. ఎక్కడో దూరంగా హిమాలయాలలో వుండి, శక్తిలేకపోయినా విస్తరణ వాంఛగల దురాక్రమణదారైన నెహ్రూగాక, పకడ్బందీ అయిన సామ్రాజ్య వాదులు ఆ స్థావరాలను ఆక్రమించుకుని ఉన్నారు. అందుకని హాంగ్‌కాంగ్, మకావోలకంటే, ఇండియాను వశపర్చుకోవాలని వారు కోరుతున్నారా ? అని అడగవచ్చు.

అలాగే "కరిబియన్ సంక్షోభం, ప్రపంచ యుద్ధమూ ముంచుకు వస్తున్న ఈ సమయంలోనే సరిగ్గా ఇంత పెద్ద ఎత్తున భారత – చైనా సరిహద్దుపై యుద్ధం చైనా ఎందుకు ప్రారంభించాలి." అని కూడా ఎవ రైనా అడగవచ్చు. ఇది కేవలం ఏదో యాదృచ్ఛిక ఘటన మాత్రమేనా?

ఈ సమస్యను లోతుగా పరిశీలించటం ఉపయోగకరమే. అయితే అనుభవంగలిగి, పవిత్రమైన చైనా పార్టీవంటి మార్క్సిస్టు – లెనినిస్టు పార్టీకి వ్యతిరేకంగా, పై ప్రశ్నకు ఖచ్చితమైన సమాధానం చెప్పటం మాకు కష్టమే అవుతుంది.

ఇదే ప్రశ్నను చైనా నాయకత్వం తిరిగి ఎదురుతిప్పవచ్చు. భారత ప్రభుత్వం, భారతీయ అభివృద్ధి నిరోధకులు, నెహ్రూ వీరే కరిబియన్ సంక్షోభాన్ని అవకాశంగా తీసుకొని చైనాపై దాడి చేయటానికి సన్నద్ధులు కావటంలేదా అని ప్రశ్నించవచ్చు. తమ సామ్రాజ్యవాద యజమానుల ప్రయోజనాల రక్షణకు వీరు తయారు కావడంలేదా అని అడగవచ్చు.

అది అడగవలసిన మాట నిజమే, అయితే ఇందుకు అమెరికా ఇండియానుగాక, పాకిస్తాన్‌ను సర్వసన్నద్ధం చేసి ఉంచింది. అమెరికా వారి గూఢచారి యు–2 విమానదళానికి పెషావర్‌లో స్థావరముంది. కాశ్మీరులోగాని అస్సాంలోగాని ఈ స్థావరం లేదే. అమెరికా సైనిక

కేంద్రాలు ఇండియాలో లేవు పాకిస్తాన్‌లో ఉన్నాయి. సీటోకూటమిలో ఇండియాసభ్యురాలుకూడా కాదు.

పాకిస్తాన్ దురాక్రమణనుగురించే భారతదేశం మొదటునుంచీ ఆందోళనపడుతూ వుంది. ఆ ఆందోళనలో చైనావారు ఆక్సాయ్ చిన్ రోడ్డు నిర్మించుకున్న విషయంకూడా గమనించలేదు. ప్రచ్ఛన్న యుద్ధంలో సామ్రాజ్యవాదులతో భారతదేశం చేతులు కలపలేదు. పైగా భారతదేశం శాంతి శిబిరంలో వుంది. భారత ప్రభుత్వవిధానం ఆగ్నేయాసియా కూటమికాదు, పంచశీల.

మరొక విషయం కూడా గుర్తుంచుకోవాలి. ఒక సంవత్సరం క్రితమే 1961 డిసెంబరులో పోర్చుగీస్ ఫాసిస్టు సామ్రాజ్య వాదుల అధీనం నుండి గోవాను భారతప్రభుత్వం విముక్తి చేసింది. అలా చేసి ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్య వాదుల "అసంతృప్తి"కి గురిఐంది. డాలర్ సహాయం పోగొట్టు కోటానికి కూడా సిద్ధపడ్డది.

## మనస్తాపం కలిగించే అంశం

మాకావోకు పోటీగా గోవా ఉదాహరణ ప్రస్తావించినప్పుడల్లా, చైనా నాయకత్వానికి చాలాకోపం వస్తున్నది. గోవాపై చర్చ జరగటానికి, హాంగ్‌కాంగ్, మకావోలపై చర్చ జరగకపోవడానికి గల కారణాలను ప్రస్తావిస్తూ వారిలా అంటున్నారు:

"చైనావారు పిరికివారు అని నిరూపించటమే మీ ఉద్దేశమని నిశితంగా పరిశీలించిన ప్రతి ఒక్కరికీ బోధపడుతుంది. నిజం చెప్పాలంటే, సామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా పోరాటంలో తమకు గల ధైర్యాన్ని, పట్టుదలను నిరూపించుకోడానికి చైనావారు హాంగ్‌కాంగ్ మకావోలపై బలప్రయోగం చేయనక్కరలేదు.

"మా ధైర్యాన్ని, పట్టుదలను సామ్రాజ్యవాదులు, అందులోనూ అమెరికన్ సామ్రాజ్యవాదులు బాగానే రుచిచూశారు. కొరియా ప్రజలతో భుజం భుజం కలిపి చైనా ప్రజల అత్యుత్తమ పుత్రులు, పుత్రికలు

మూడేండ్లు పోరాడారు. అమెరికన్ దురాక్రమణదారుకు వ్యతిరేకంగా కొరియా యుద్ధరంగాలలో తమరక్తం ధారపోశారు. హాంగ్‌కాంగ్ మకావోల ప్రస్తావన తెచ్చి మమ్మల్ని ఎగతాళిచేయటం బుద్ధితక్కువ పని అని మీకు తెలియదా ?

"మాకూ, మీకూ కూడా ఒక విషయం తెలుసు. కరిబియన్ సంక్షోభంలో మీ అప్రతిష్టాకరమైన ప్రవర్తనను కప్పిపుచ్చుకోటానికి ఒక ముసుగుగా మీరు హాంకాంగ్, మకావోలను ప్రస్తావిస్తున్నారు. కాని ఈ ప్రయత్నం అంతా నిరుపయోగం."

(అమెరికన్ కమ్యూనిస్టుపార్టీ ప్రకటనపై వ్యాఖ్యానిస్తూ, 1963 మార్చి 8 న పీపుల్సుడైలీ వ్రాసిన సంపాదకీయం. ఫారిన్ లాంగ్వేజి పబ్లిషింగ్ హౌస్, పెకింగ్ 14 వ పేజీ)

ఆ పిమ్మట చైనావారు మరొక ప్రశ్న వేస్తున్నారు. వారి గందరగోళానికి ఈ ప్రశ్న అత్యుత్తమయిన తార్కాణం. వారిలా అంటున్నారు: "హాంగ్‌కాంగ్, మకావోలపట్ల చైనా ప్రజలు అనుసరించిన సరియైన విధానాన్ని, కరిబియన్ సంక్షోభంలో మీరు అనుసరించిన తప్పుడు విధానాన్ని ఒకే సమయంలో, ఒకే గొంతుతో మీరెలా ప్రస్తావించగలుగుతున్నారు" అని.

ఈ ప్రశ్నకు అర్థమేమిటి ? హాంగ్‌కాంగ్ మకావోలలో చైనా అనుసరించిన "సరైనవిధానం వలన ఆ ప్రాంతాలు సామ్రాజ్యవాదుల వలసలుగా, దొంగవ్యాపారస్థుల కూడలిగా, సైనిక స్థావరాలుగా కొనసాగుతున్నాయా ? కరిబియన్ సంక్షోభంలో అవలంబించిన "తప్పుడు విధానం" వలన, అమెరికా దాడినుండి క్యూబా స్వాతంత్ర్యం సురక్షితమై నిలిచిందా ?

హాంగ్‌కాంగ్ మకావోలలో చైనా అవలంబించిన సరైన విధానాన్ని అనుసరించి సోవియట్‌యూనియన్ ఏం చేయాలి ? క్యూబా తిరిగి అమెరికా వలసదేశంగా మారుతుంటే చూస్తూ ఊరుకోవాలా ? అది చైనా వారి ఉద్దేశం కానేకాదు.

అయితే వారి ఉద్దేశం ఇంకేమిటి ? హాంకాంగ్‌పై బ్రిటన్ తోనూ, తైవాన్‌పై అమెరికాతోనూ, యుద్ధంరాకుండా చైనా వారు

నివారించటం సరైన చర్య అనీ, క్యూబా స్వతంత్రదేశంగానే కొన సాగుతున్నా, క్యూబాపై యుద్ధం రాకుండా, అందులోనూ ప్రపంచ యుద్ధం రాకుండా నివారించగలిగిన సోవియట్ యూనియన్ కాస్ట్రోల చర్య మాత్రం సరైనది కాదనా ?

హాంగ్ కాంగ్, మకావో తీర ప్రాంతాలలోని బ్రిటిష్, పోర్చుగీసు సామ్రాజ్యవాదులను నిర్మూలించకుండా వదలివేసిన చైనా వైఖరి సరైనదేననీ, అమెరికన్ సామ్రాజ్యవాదంతో ముఖాముఖి తలపడి ప్రపంచ వ్యాపిత అణుయుద్ధంద్వారానైనా సరే దానిని సర్వనాశనం చేయకుండా వదలివేసిన సోవియట్ యూనియన్, కాస్ట్రోల చర్యమాత్రం — అందు లోనూ సామ్రాజ్యవాదులు తమ దాడి సన్నాహాలు విరమించుకున్న తర్వాతకూడా 'అవమానకరం', 'తప్పుడు విధానము' అని చైనా నాయకులు భావిస్తున్నారా ?

హాంగ్ కాంగ్, మకావో, తైవాన్‌లపట్ల 'సరసవైఖరి'ని అవలం బించినందుకుగాను చైనావారు పిరికివారని ఎవరన్నారు ? చైనా విప్లవాన్ని అభినందించనివారెవరైనా ఉన్నారా ? చైనా పార్టీ, చైనా ప్రజలు పడిన బాధలను, ప్రదర్శించిన ధైర్యాన్ని అభినందించనివా రెవరైనా ఉన్నారా ?

కొరియా యుద్ధ ప్రస్తావనను, అక్కడ మీరు చేసిన వీరోచిత పోరాటాన్ని ఇప్పు డెందుకు చెప్పటం ? చివరకు అక్కడకూడా, అమెరికన్లను మీరు ఓడించిన తర్వాతనే, దక్షిణ కొరియాను అమెరికన్లు తిరిగి ఆక్రమించుకోవటాన్ని మీరు ఆమోదించక తప్పలేదు కదా ? కిమిర్ సేన్‌కు చెందిన ఉత్తర కొరియా సేనలు అంతకుముందు కొరియా అంతటినీ స్వాధీనపరచుకున్నాయికదా ! అసలు మీరు 38 వ అక్షాంశ రేఖను సరిహద్దుగా ఎందుకు అంగీకరించారు ! దక్షిణ కొరియా నుండి అమెరికన్లను పూర్తిగా త్రోసివేయకపోయారా ?

కనుక రాజీలు పడటం అనేది అవసరం. నాటి పరిస్థితుల ననుసరించి ప్రతి సమస్యను పరిష్కరించుకోవాలి. కనుక అమెరికన్ సామ్రాజ్యవాదులతో ముఖాముఖి ఢీకొనలేదని, సోవియట్ యూని యన్‌నూ, కాస్ట్రోను, మీరు నిందించటం తప్పు. అందులోనూ

క్యూబా మనుగడను, స్వాతంత్ర్యాన్ని గుర్తించి అమెరికన్ సామ్రాజ్య వాదులు వెనక్కు తగ్గినప్పుడా ఈ అపనిందలు? క్యూబాలో సోవియట్ చర్య "అవమానకరమైన ప్రదర్శన" కానేకాదు. అది ఎంతో అద్భుతమైన, ప్రతిభావంతమైన, సాహసోపేతమైన నిర్ణయం.

## ఇండియామీదనే ఎందుకి దాడి?

అంతేకాదు, హాంగ్ కాంగ్, మకావోలలో బ్రిటిష్, పోర్చుగీస్ సామ్రాజ్యవాదులను మీరు సహించగలిగి, అతి ప్రాచీనులూ, దురాక్రమణదారులుగా నిరూపించుతూ, అయినా పైవారితో సత్సంబంధాలు, వ్యాపారం కొనసాగించుకుంటూ ఉండగలిగిన మీరు నిర్మానుష్యమైన కొండ ప్రాంతాలైన లడక్, లాంగ్జూ, థాగ్లా కనుమలపై అంత పట్టుదలను, ఆగ్రహావేశాన్ని, యుద్ధసన్నద్ధతను ప్రదర్శించవలసిన అవసరం ఏం కలిగింది? అవి అంత ముఖ్యమైనవా? ఇండియా వంటి దేశంతో సత్సంబంధాలను ధ్వంసం చేసుకుని, ఇండియాలోని ప్రజాతంత్ర శక్తులన్నింటి పురోగతిని దెబ్బకొట్టి, తటస్థ దేశమైన ఇండియాలో స్థావరం సంపాదించుకొనేందుకు అమెరికాకు మార్గం సుగమం చేయవలసిందిగా మీరు ఎందుకు పట్టుదల వహించవలసి వచ్చింది?

సరైన విధానమంటే ఇదేనా? పవిత్రమైన, లోపరహితమైన మార్క్సిజం లెనినిజం అంటే ఇదేనా? అని ఎవరైనా ప్రశ్నించి తీరుతారు. మీరు వాడిన మాటనే వాడి ఇలా అడగవచ్చు అక్టోబరు 20 న మీరు చేసిన దాడి, దుందుడుకువాదం ఫలితంగా తీసుకున్న చర్య కాదా? అకస్మాత్తుగా మీరు అమలుజరిపిన యుద్ధవిరమణ సంగతేమిటి? చేసిన తప్పుకు అది పాక్షికమైన దైనప్పటికీ సరియైన సవరణే

మీరా సవరణను ఎందుకు అమలు జరిపారు? అతి త్వరగా ఎత్తుగడలను మార్చివేయడంలో మీకు దీర్ఘకాల అనుభవం వుంది. కనుక, క్యూబా దాడి ఆగిపోయిన మీదట అమెరికా రష్యాల మధ్య 'యుద్ధం ఏర్పడే అవకాశం' అనగా ప్రపంచ యుద్ధం వెనకడుగు వేసిన

తర్వాత, భారతదేశంలోకి చొచ్చుకురావటం ఆపివేయాలనీ, అలా చేయటమే సరైన ఎత్తుగడనీ, విజ్ఞత అనీ మీరు గుర్తించారు

మీరు తీసుకున్న ఆ నిర్ణయానికి మిమ్ము మేము అభినందిస్తున్నాము. ఆ ఏకపక్ష యుద్ధవిరమణను మరికొంత ముందుకు తీసుకువెళ్ళి తుపాకి గుండ్లతోనూ, కరపత్రాలతోను జరిగే అన్ని రకాల యుద్ధాలను ఆపివేయాలని, కొలంబో ప్రతిపాదనలను అంగీకరించాలనీ, వివాదాన్ని శాంతియుతంగా పరిష్కరించుకోవాలనీ మీకు విజ్ఞప్తి చేస్తున్నాం.

## చరిత్రాత్మకమైన గొప్ప అవకాశాన్ని జారవిడిచారు

నిజానికి, చైనా నాయకులకు మేము పరోక్ష విషయం సూచించటానికికూడా సాహసిస్తున్నాము. నిజమైన మార్క్సిస్టు-లెనినిస్టులుగా వారు ఏమిచేసిఉండవలసిందో ఆ పనిని చేయనందున చారిత్రకమైన ఒక గొప్ప అవకాశాన్ని ఎలా జారవిడిచారో మేము సూచించదలచుకొన్నాము.

క్యూబాపై అమెరికన్ల దాడిఫలితంగా అణుయుద్ధ ప్రమాదం ఆ నాడు ముందుకు రాసాగింది.

అక్టోబరు 22 న అమెరికా నౌకా దిగ్బంధాన్ని విధించింది. సైన్యాలు సమీకృతమైనాయి. అక్టోబరు 23 న అమెరికాకు సోవియట్ ప్రభుత్వం హెచ్చరిక పంపింది. ఆ నాడు, చైనావారు మాక్ మాహన్ శ్రేణికి దక్షిణదిశగా పురోగమించటానికి బదులు, వారి సేనలనడకను ఆపివేసి, ఉపసంహరించవలసింది. భారత ప్రభుత్వానికి, ప్రధాని నెహ్రూకు ఒక విజ్ఞప్తిచేయవలసింది. శాంతికాముక, సామ్రాజ్య వ్యతిరేక ఆసియా దేశాలైన భారత చైనాలు, తామీ ఘర్షణలు మాని ఆరోపణలు, ప్రత్యారోపణలు విరమించి, సరిహద్దు సమస్యపై శాంతియుత పరిష్కారానికి వచ్చి, యుద్ధోన్మాదులైన సామ్రాజ్యవాదుల దాడిని ఎదుర్కోటానికి సర్వశక్తులూ వెచ్చించుదామని చైనావారు విజ్ఞప్తిచేసి ఉండవలసింది.

అక్టోబరు 24 న చైనావారు ఒక ప్రకటనైతే చేశారు. కాని అది ఏమాత్రమూ సహాయకారిగా లేదు. వాస్తవంగా అధీనంలో ఉన్న ప్రాంతంలోనే చైనా సేన లున్నాయని ఆ ప్రకటన తెలియజేసింది. 1962 సెప్టెంబరు 8 స్థావరాలకు ఉభయసేనలు వెనక్కు తగ్గాలని భారత ప్రభుత్వం ప్రకటించింది. కనుక చైనావారు చేసిన ప్రకటన శాంతియుత పరిష్కారమనే లక్ష్యంతో చేయబడిన ప్రకటనని భావించ బడలేదు. 1962 సెప్టెంబరు 7 తర్వాత ఆక్రమించుకున్న స్థానాలన్నిటినీ ఖాళీ చేయటానికి అంగీకరించుట ద్వారా చైనావారికి ఏమాత్రమూ నష్టంవచ్చేది కాదు. చాలాకాలంవరకు, 'వాస్తవంగా ఆక్రమితప్రాంత మంటే' వారి అర్థం ఏమిటోకూడా చైనావారు చెప్పలేదు.

ఉభయదేశాలమధ్య సంబంధాలు బెడిసిపోకముందు, చైనాలోని ఇతర భూభాగంతో సింకియాంగ్ రాష్ట్రాన్ని కలిపేందుకు అక్సాయ్ చిన్ రోడ్డు అవసరమనే అంశాన్ని భారత ప్రభుత్వం గుర్తించటానికి సిద్ధంగా ఉంది. కరుడుగట్టిన యుద్ధోన్మాదులు, అమెరికా ఏజంట్లు తప్ప, మరెవ్వరూ ఆ విషయంలో తగాదా పెట్టేవారేకాదు. ఉభయు లకు అంగీకారమైన, గౌరవప్రదమైన ఒప్పందం ఆ సమస్యపై కుదిరేది. అలాంటి వాతావరణం ఆనాడుంది.

కాని చైనా నాయకులు తమ ప్రాచీన 'చరిత్ర స్మృతులలో'నే మునిగివున్నారు.

హాంగ్‌కాంగ్, మకావో, తైవాన్‌లలోని విస్తరణ వాదుల కంటే భారతీయ 'విస్తరణవాదులే' వారి కెక్కువ ప్రమాదకరంగా కనిపించారు. కరిబియన్ సంక్షోభం దృష్ట్యా, భారత చైనా తగాదాను పరిష్కరించుకోటానికి ఏర్పడిన మహదవకాశాన్ని చైనావారు గుర్తించనేలేదు.

ఇందుకు విరుద్ధంగా, చైనావారు తమ దాడిని నవంబరు 21 వరకు సాగిస్తూనే వచ్చారు. కరిబియన్ సంక్షోభం ముగిసి, ప్రపంచ యుద్ధం నివారించబడినమీదటనే, చైనావారు తమదాడిని విరమించారు. జాతీయౌన్నత్యం, సరిహద్దులు, ప్రాచీనమైనహక్కులు మొదలైన భావాలచాటున మార్క్సిజం లెనినిజం అడుగున పడిపోకపోతే, ఆ క్లిష్ట

పరిస్థితిలో చైనా నిర్వహించే పాత్ర, అదేవిధంగా ఇండియా పాత్ర, వేరు విధంగా ఉండేది.

భారతీయ అభివృద్ధినిరోధకులే దురాక్రమణపట్ల పట్టుదలగా ఉన్నారని, సరిహద్దు తగాదాను రెచ్చగొట్టడానికి ఇతరుల ప్రాంతాలపై హక్కులను ప్రకటించి వాటిని ఆక్రమించుకొనేందుకు, మరింతగా డాలరు సహాయాన్ని పొందేందుకై చైనామీద యుద్ధాన్ని ప్రకటించేందుకు సిద్ధంగా వున్నారని వాదించవచ్చు.

అందుకు ప్రతిగా యీ క్రింది ఎదురు ప్రశ్నను వేయవచ్చు. చైనాతో సరిహద్దు వివాదాన్ని లేవనెత్తడం భారతీయ దురాక్రమణ వాంఛలకు తార్కాణ మయినట్లయితే, మంగోలియా వంటి సోషలిస్టు దేశంతో కూడా చైనాకు సరిహద్దు వివాదం ఎందుకు వచ్చింది? భారత – చైనా సరిహద్దు వివాదం ప్రారంభమైన తర్వాత పేరు పేరున పిలిచినట్లుగా పిలిచి, చైనా బర్మాతో, నేపాల్ తో, మంగోలియాతో, బహుశా మరికొన్ని దేశాలతోకూడా సంభాషణలు జరిపి, 'ఒప్పందాలు' చేసుకున్నది. ఈ సరిహద్దు ఒప్పందాలు జరగనందున చైనా పురోగతి ఆగిపోయిందా? చైనాతో సరిహద్దు వివాదాన్ని ప్రారంభించింది ఇండియా అని నిందించినట్లయితే, ఇతర దేశాలకు కూడా, సోషలిస్టు దేశాలతో సహా ఆ నింద వర్తిస్తుందికదా?

దేశాల మధ్యగల సంబంధాలలో సరిహద్దు సమస్యల కెంత ప్రాధాన్యం ఇవ్వవలెనో మార్క్సిస్టు, లెనినిస్టు లందరికి తెలుసు. కొత్తగా విముక్తి చెంది, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడుతున్న దేశ ప్రజలతో స్నేహ సంబంధాలు పెంపుచేసుకుని, ఆ దేశం మరింత ముందుకు సాగటానికి సోషలిస్టు ప్రజభుత్వమూ, కమ్యూనిస్టుపార్టీ సాయపడవలసివుంది. సరిహద్దు సమస్యలు, ప్రాంతాల సమస్యలూ అన్నీ ఈ కర్తవ్యానికి లోబడి ఉండవలసినవే. ఇలాంటి విధానము, ఆ దేశానికి మాత్రమే కాక, సోషలిజానికి సైతం ప్రయోజనకరమైన విధానం.

కొత్తగా విముక్తి చెందిన టర్కీతో వచ్చిన సరిహద్దు వివాదాన్ని లెనిన్ శాంతంగా పరిష్కరించాడు. సోవియట్ ఆర్మీనియా

లోని ఏ భాగం, చరిత్రరీత్యా తమదని టర్కీ ప్రభుత్వమూ, కెమల్ పాషా కోరారో, ఆ ప్రాంతం వారికి ఇచ్చివేసి, తగాదా పరిష్కరించాడు. భారతదేశంపట్ల తమ వైఖరిలో చైనావారు ఈ లెనినిస్టు దృక్పథంలోని స్వల్పాంశమైనా ప్రదర్శించారా? ఉభయదేశాల స్నేహం విషయమైనా ఆలోచించారా?

## అసమంజసమైన చైనా వాదనలు

అయితే కొందరు ఒక ప్రశ్న వేయవచ్చు. సోషలిస్టు చైనా హక్కులను అంగీకరించనందుకు, తమ హక్కులను ప్రస్తావించినందుకు, మీరు భారతదేశాన్ని ఇదే సమయంలో ఎందుకు విమర్శించరు అని ప్రశ్నించవచ్చు. మే మిక్కడ అలా చేయటంలేదు. ఎందుకంటే చైనా వారి హక్కులు న్యాయమైనవని మేమనుకోవడంలేదు. వారా హక్కులను ప్రస్తావించిన పద్ధతికూడా సరైనది కాదని మా అభిప్రాయం. అనుకూలమైన సమయమూ, సందర్భమూ వచ్చినపుడు భారత ప్రభుత్వ వైఖరిలోని పొరపాట్లను మా పార్టీ విమర్శిస్తూనేఉంది.

అంతేకాదు, సరిహద్దు సమస్యపై ఒక బూర్జువా ప్రభుత్వం లెనినిస్టు దృక్పథాన్ని ప్రదర్శిస్తుందని మేము అనుకోవడంలేదు. ఆ ప్రభుత్వానికి జాతీయవాద ధోరణి సహజసిద్ధమైనది. సోషలిస్టు ప్రభుత్వానికి మాత్రం ఆ ధోరణి సహించరానిది. అయినప్పటికీ ఒక విషయం గమనించాలి. భారతప్రభుత్వ నాయకుడు ఆ పరిస్థితుల్లో సైతం సాధ్యమైనంతవరకు జాతీయదురహంకారాన్ని దూరంగా ఉంచాలని ప్రయత్నిస్తూనే ఉన్నాడు. శాంతినికేతన్‌లోని చైనా భవనంలో జరిగిన సభ ఇందుకు నిదర్శనం అభివృద్ధినిరోధకులు ఎంతో వత్తిడి చేసినప్పటికీ, చైనా ప్రజలను, చైనా సంస్కృతినీ ద్వేషించరాదని, జాతీయ బూర్జువా నాయకత్వం (నెహ్రూ) ఆ సభలో హెచ్చరించింది.

సోషలిస్టు చైనాయొక్క విజ్ఞతగల నాయకత్వం ఈ పరిస్థితిని వినియోగించుకొని తమ విభేదాలను యుద్ధ పరిస్థితివరకు పోకుండా జాగ్రత్తపడనక్కరలేదా? వారి మార్క్సిజం, లెనినిజం, పిడివాదంతోనూ, జాతీయవాదంతోనూ కలుషితం కాకుండా ఉన్నట్లయితే

వా రా పనిని చేసేవారే. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమంలోని అత్యధిక సంఖ్యాకుల అభిప్రాయంకూడా ఇదే.

భారత కమ్యూనిస్టుపార్టీ రివిజనిజం, పిడివాదం వంటి పెడ మార్గాలతో నిండివున్నది కనుక పెద్దదైన చైనాపార్టీ వైఖరిలోని పిడివాదాన్ని, ఒంటెత్తుపోకడలను విమర్శించే హక్కు భారత కమ్యూనిస్టుపార్టీకి లేదని కొందరు అంటున్నారు. ఇలా వాదించటం బైబిలులోని ఈ క్రింది ఉదాహరణవలె ఉంటుంది: "ఏ పాపం చేయనివాడు ఉన్నట్లయితే అతడు మొదటి రాయిని విసరవచ్చు."

భారతపార్టీకి చెందిన మేము రివిజనిజం, పిడివాదంవంటి చాలా లోపాలను చేశాము. ఇందులో ఏదిఎక్కువ, ఏదితక్కువ అనేది ప్రస్తుత చర్చనీయాంశంకాదు బహుశా ఈ కారణంవల్లనే మేము చైనా నాయకత్వాన్ని బహిరంగంగా విమర్శించటానికి ఎప్పుడూ సాహసించలేదు. 81 పార్టీల అవగాహనను చైనా ఉల్లంఘిస్తున్నదని మా జాతీయసమితి అభిప్రాయ పడినప్పుడు సైతం మేమావిషయాన్ని సోదరపార్టీలకు తెలియజేసి ఊరుకున్నాము. మామీద విమర్శచేసే వరకు, మేము బహిరంగ వాగ్వాదంలోకి దిగలేదు.

ఏదిఏమైనా, మేముచేసిన పాపాలసంగతి అలావదలివేదాము. ఆ విషయం వేరొకచోట ప్రస్తావిస్తాను. మనముందున్న ప్రస్తుత సమస్య ఇది: చైనావారు తమ పెడమార్గాలలో ఎంతదూరం వెళ్లారనేది నేటిప్రశ్న. ఈ పెడమార్గమే భారతదేశంపట్ల సరిహద్దు సమస్య పట్ల వారివైఖరికి మూలకారణం అంతర్జాతీయ చర్చలలో మర్యాదను కాపాడేందుకై కొన్ని సందర్భాలలో చైనావారిని ఆల్బేనియావారని వ్యవహరించటం జరిగింది. భారతీయ అభివృద్ధి నిరోధకులనుగాని, లేక మా పార్టీ రివిజనిజాన్ని లేక పిడివాదాన్నిగాని అడ్డుగాపెట్టుకొని చైనావారు తమ పొరపాట్లను దాచుకోవటం సాధ్యంకాదు.

## పిడివాదంకూడా సమానంగా ప్రమాదకరమే

81 పార్టీల ప్రకటన తెలియజేసినట్లు అంతర్జాతీయ కమ్యూనిస్టు వుద్యమంలో రివిజనిజం ప్రధానమైన పెడమార్గం అయితే కొన్నిపార్టీల

అభివృద్ధిలో ఏదో ఒక దిశలో, అతివాద అవకాశవాదమూ లేక పిడి వాదమూ ప్రధానమైన ప్రమాదం కావచ్చుననికూడా పై ప్రకటన తెలియజేసింది. ఇప్పుడు ప్రశ్న ఏమంటే, చైనాపార్టీలోనూ, ఆల్బేనియా పార్టీలోనూ అలా జరగలేదా ?

డిసెంబరు 12 న సుప్రీం సోవియట్ సమావేశంలో మాట్లాడుతూ కృశ్చేవ్ ఇలా అన్నారు :

"ఆధునిక అతివాద అవకాశవాదానికి, పిడివాదానికి ఆల్బేనియా నాయకులు అతి బాహాటమైన ప్రచారకులుగా ఉన్నారు. లెనినిస్టు విధానమైన శాంతి, శాంతియుత సహజీవనాలకు వ్యతిరేకంగా తాము జరిపే పోరాటాన్ని వీరు ఆడంబరమైన విప్లవ పదజాలంతో కప్పిపుచ్చుకుంటున్నారు. ఇంతకుముందే చెప్పినట్లు, వారు ట్రాట్స్కీస్టు వైఖరికి దిగజారారు. సామ్రాజ్య వ్యతిరేకశక్తుల ఐక్యత వైఖరి విచ్ఛిన్నం చేస్తున్నదని, అత్యంత దురాక్రమణ పూరితమైన సామ్రాజ్యవాదులకు ఈ వైఖరి సాయపడుతున్నదని, వారి కమ్యూనిస్టు వ్యతిరేక కుట్రులకు సాయపడుతున్నదని గ్రహించటం కష్టమేమీకాదు.

చైనా పార్టీ వైఖరివలన, సరిహద్దు సమస్యపై వారిని బలపరిచే వారి వైఖరివలన, పెద్ద పెట్టున చైనా జరిపిన దాడివలన సరిగ్గాభారత దేశంలో ఈనాడు ఇదే పరిణామం సంభవిస్తున్నది. ఆరు తటస్థరాజ్యాలు చేసిన ప్రతిపాదనలను సైతం వెనువెంటనే చైనావారు ఆమోదించక పోవటంలోనూ, పిడివాద, ఒంటెత్తుపోకడ కొనసాగింపే వ్యక్తమౌతున్నది. ఈ వైఖరి భారతీయ అభివృద్ధి నిరోధకులకు, విదేశసామ్రాజ్య వాదులకు సాయపడుతున్నది.

చైనా పార్టీకి ఎంతో అనుభవం వున్నది. అంతర్యుద్ధ కాలం లోనూ, సామ్రాజ్య వ్యతిరేక భూస్వామ్య వ్యతిరేకాది విప్లవకాలం లోనూ, సామ్రాజ్యవాదులతోనూ, జాతీయ బూర్జువావర్గంతోనూ అవలంబించిన వ్యూహమూ, ఎత్తుగడలలో చైనాపార్టీ ఎంతో వాస్తవంగానూ, స్థిమితంగానూ వ్యవహరించింది.

ఈనాటికీ, హాంగ్ కాంగ్, మకావో, తైవాన్‌లపై దాడిచేయక వార్సాలో అమెరికా చైనారాయబారులద్వారా సంప్రతింపులుసాగించే

ఎత్తుగడలనే చైనా అవలంబిస్తున్నది. అలాంటిపార్టీ, చైనా చక్రవర్తులు సంపాదించిన ప్రాచీనసరిహద్దులపై ఇంతటి దేశభక్తి ఎందుకు ప్రదర్శించాలి వారే ఇలా అంగీకరిస్తున్నారు :

"గతంలో చైనా శక్తివంతంగా ఉండి ఇతర దేశాలను జయించిన మాట చారిత్రకంగా నిజమే. అయితే అవన్నీ ఫ్యూడల్ భూస్వామ్య ప్రభువుల కాలంలో జరిగాయి. చైనా నేడు జనచైనా, సోషలిస్టు చైనా. దీని సాంఘిక వ్యవస్థ పూర్తిగా మారిపోయింది. అంతరంగిక, విదేశాంగ విధానాలు గతంలోకంటె పూర్తిగా మారిపోయాయి."

అలాంటపుడు గతకాలపు భూస్వామ్య వ్యవస్థకు చెందిన దేశపటాలపై ఘర్షణపడి భారతప్రజల స్నేహం ఎందుకుపోగొట్టుకోవాలి. సామ్రాజ్యవాదుల పన్నుగడలకు ఎందు కవకాశం ఇవ్వాలి. కార్మికవర్గ అంతర్జాతీయత, జాతీయ ప్రయోజనాల రక్షణ కెందుకుపయోగపడ్డది ? 'చట్టబద్ధమైన మాక్ మోహన్ రేఖ' కంటే భూస్వామ్య ప్రభుత్వంనాటి దేశపటాలు చట్టబద్ధమైనవా ?

ఇందుకు కారణం కృశ్చేవ్ ఇలా నివేదించాడు :

"అతివాద అవకాశవాదానికి వ్యతిరేకంగా జరపవలసిన పోరాటాన్ని తక్కువ అంచనా వేయటంవలన, ఆ జబ్బు నిర్లక్ష్యం చేయబడ్డది. చిన్నబిడ్డ లక్షణాన్ని ఏనాడో ఇది అధిగమించింది. ఈ విషయమై లెనిన్ ఇదివరకే హెచ్చరించి ఉన్నాడు. మన కాలంలో కమ్యూనిస్టు ఉద్యమాభివృద్ధి ప్రత్యేకత లున్నాయి వేర్వేరు ఆర్థికస్థానిక స్థాయిలలో ఉన్నదేశాల ప్రజలు సోషలిస్టు మార్గాన్ని చేపడుతున్నారు. ఈ పరిస్థితుల వలన అతివాద కమ్యూనిస్టు ధోరణి వ్యాప్తి చెందటానికి, పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయి, పెటీ బూర్జువావర్గ ప్రతినిధుల అస్థిర వైఖరిలోనూ, ఒక మూలనుంచి మరో మూలకు దూకే వారి వైఖరిలోను ఈ అతివాద పెడమార్గం ఎల్లప్పుడూ స్థావరం సంపాదించుకుంటూనే వుంది.

"ఈ అతివాద ఒంటెత్తు ధోరణినిని జాతీయవాదం పోషిస్తున్నది. అధికారంలోవున్న పార్టీ అవలంబించే వైఖరిపై ప్రజల భవిష్యత్తు హెచ్చుగా ఆధారపడివుంటుంది. కనక ఆ పార్టీలో ఇలాంటి వైఖరి

వ్యక్తంకావటం సహించరానిది. ప్రపంచ భవిష్యత్తునంతా నిర్ణయించే యుద్ధమూ, శాంతి వంటి సమస్యలపై ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ విధానానికి వ్యతిరేకంగా ఈ ధోరణి మళ్ళింపబడ్డది. కనుక ఈ ధోరణి ప్రమాదకరం.

"ఈ అన్ని కారణాలవలన అతివాద, అవకాశవాదం, పిడివాదం, ఒంటెత్తుపోకడలు ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో రోజు రోజుకు మరింత ప్రమాదకరంగా పరిణమిస్తున్నవనే విషయాన్ని కాదనలేము. ఈ విషయాన్ని చూడకపోవటమంటే వాస్తవాలను చూడటానికి భయపడటమేనన్న మాట. వాస్తవం నుండి పెడమొగంపెట్టి నేటి కాలంలో మార్క్సిస్టు - లెనినిస్టులపైగల బాధ్యతలను గుర్తించ నిరాకరించుటయే అవుతుంది."

## విమర్శను నిరాకరించటం

కాని చైనా నాయకత్వం ఈ విమర్శను నిరాకరిస్తున్నది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని మెజారిటీ పార్టీలు రివిజనిస్టు మార్గాన్ని చేపట్టాయనీ, సామ్రాజ్యవాదాన్ని సమర్థిస్తున్నాయనీ, జాతీయ విముక్తి ఉద్యమాలను వ్యతిరేకిస్తున్నాయనీ, వర్గపోరాటానికి, లెనినిజానికి ద్రోహంచేస్తున్నాయనీ చైనాపార్టీ ఖండిస్తున్నది.

ఇందువలననే, బల్గేరియా, జెకోస్లొవేకియా, హంగరీ, ఇటలీ వంటి దేశాలలో కమ్యూనిస్టు, కార్మికపార్టీల మహాసభలలో, చైనా వారిని విమర్శించవలసి వచ్చింది.

ఈ మహాసభలలో భారత-చైనా సరిహద్దు వివాదంపై చైనా పార్టీ వైఖరినికూడా మార్క్సిజం, లెనినిజం దృష్ట్యా వారు విమర్శించారు. సెప్టెంబరు 1959 లో టాస్ వార్తా సంస్థ చేసిన ప్రకటన తర్వాత ఈ సమస్యపై కమ్యూనిస్టుపార్టీలు బహిరంగంగా ఒక దృక్పథాన్ని తీసుకొని, చైనాను విమర్శించటం ఇదే మొదటిసారి.

భారతదేశంపట్ల చైనా ప్రదర్శించిన వైఖరిని ఈ పార్టీలు విమర్శించి, అసమ్మతిని తెలియజేశాయంటే, దాని అర్థం, భారత ప్రభుత్వం

ఆ యా సందర్భాలలో తీసుకున్న చర్యలన్నిటినీ ఈ పార్టీలు ఆమోదించాయని కాదు.

భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులు సామ్రాజ్యవాదులతో కలిసి దేశంలో పైచేయి సంపాదించుకొనేందుకు తెగించి కొన్ని చర్యలు తీసుకోవచ్చునని, భారతప్రభుత్వ దేశీయ విదేశాంగ విధానాలను, సామ్రాజ్యవాద అనుకూల, అభివృద్ధి నిరోధకమార్గాలలో మార్చటానికి ప్రయత్నించవచ్చుననీ, సోదర కమ్యూనిస్టు పార్టీలవారు భయపడుతూనే వున్నారు. కనుకనే చైనా హేతుబద్ధమైన వైఖరిని అవలంబించి, సాధ్యమైనంత త్వరలో శాంతియుత పరిష్కారాన్ని సాధించవలసిన అవసరం ఎంతగానో ఉంది.

ఈ సోదర పార్టీలు చేసిన విమర్శనను చైనా గ్రహించలేదు.

పైపెచ్చు చైనా నాయకత్వం రేడియోలద్వారాను, పత్రికలద్వారాను ఈ పార్టీలన్నిటి పైనా పెద్ద దాడి ప్రారంభించింది. వారిపైన రకరకాల నేరాలను ఆరోపించింది. మెజారిటీ పార్టీలు తమతో అంగీకరించటంలేదని తెలిసినమీదట, లెనిన్, లీబ్ నిక్ లవలెనే తాముకూడా మైనారిటీలో ఉన్నామని వారు వాదించసాగారు.

రెండవ అంతర్జాతీయ సంస్థలో లెనిన్, రీచ్‌స్టాగ్ (జర్మన్ పార్లమెంటు)లో లీబ్ నిక్ మైనారిటీలో ఉన్నమాట నిజమే. మొదటి ప్రపంచ యుద్ధకాలంలోనూ, ఆ తర్వాత వచ్చిన విప్లవాల సమయంలోనూ, రివిజనిస్టులు తుడిచిపెట్టుకుపోయి, లెనిన్ ఆలోచనా విధానం మెజారిటీచేత ఆమోదించబడ్డమాటా నిజమే. పెకింగ్ విషయంలోనూ, చైనా పార్టీపై విమర్శచేస్తున్న రివిజనిస్టుల విషయంలోనూ అదే జరుగుతుందని చైనావారి వాదన.

## మూడో ప్రపంచయుద్ధం అవసరమా ?

ఈ పోలికనుబట్టి, మనం మూడో ప్రపంచయుద్ధం కొరకు ఆ పిమ్మటవచ్చే విప్లవాలకొరకు వేచివుండవలెనని అపుడు మాస్కోనుండి కాక పెకింగ్‌నుండి వ్యాపించే లెనినిజం ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో విజయం సాధిస్తుందని అర్థమా ? దీనిని మరింత వేగంగా

సాధించాలంటే మనం సామ్రాజ్యవాదులతోనూ, వారి మిత్రులతోనూ ముఖాముఖి తలపడాలి. అనివార్యమైన ప్రపంచయుద్ధాన్ని నివారించ కూడదు. కరిబియన్ సంక్షోభం ఇలా నివారించబడ్డం అందుకు విరుద్ధంగా హిమాలయాలలో ఈ పోరాటం కరిబియన్ 'లొంగుబాటు' వరకు నిర్విరామంగా కొనసాగుతూనే ఉంది ? ఇది చైనావారి ధోరణి. చరిత్ర ఈ మార్గంలో నడవదనే మేము ఆశిస్తున్నాము.

ఇవి చాలా తీవ్రమైన సమస్యలు. ఏదో ఉబుసుపోక చెప్పుకునే కబుర్లుకావు. కనుకనే సోవియటు కమ్యూనిస్టుపార్టీ తదితర పార్టీలు ఈ సమస్యలపై తిరిగి సమష్టి చర్చలు జరిపి, అంగీకారమైన ఒప్పందం కొరకు తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నాయి. 1962 డిసెంబరు 3 న భారత కమ్యూనిస్టు పార్టీ కూడా ఇలాంటి తీర్మానమే చేసింది. ఇందుకు అందరూ అంగీకరించినట్లే కనిపిస్తున్నది.

ఈ లోగా చైనా నాయకత్వం, తన చిత్రగుప్తుని చిఠానుండి 44 పార్టీలు చేసిన పాపాలన్నిటినీ ఏకరువు పెడతానని బెదిరించింది. ఇంత వరకు ఈ 44 పార్టీలు చైనాను విమర్శించాయట. భారత పార్టీకూడా అందులో ఒకటి. ఆ చిత్రగుప్తుని చిఠాలో, మా పార్టీ ఖాతాకు చేర్చబడిన అంశాలను 'రివిజనిస్టులప్రతిబింబం' అనుపేరుతో మార్చి 9, 1953 పీపుల్సుడైలీ సంచికలో చైనావారు ప్రకటించారు.

కనుక మేము ఆ విషయాలనుకూడా ప్రస్తావిస్తాం. మార్క్సిజం లెనినిజం అనే న్యాయాధిపతి ఎదుట, అతని సహాయకుల ఎదుట మనం అందరమూ విచారణకు నిలవవలసిన వారమే. కనుక మా వాదనను కూడా మేము చెప్పుకుంటాము. అలా కాకపోతే, ఉన్న అవకాశాన్ని పోగొట్టుకున్న వాళ్ళ మవుతాము. ఇంతకుముందే రివిజనిజం, విడి వాదాలను అమలు జరిపిన సుదీర్ఘ చరిత్ర పార్టీకి లేదా ?

# 5

# మార్క్సిజం-లెనినిజం దృష్ట్యా జాతీయ రక్షణ

ఇండియా-చైనాల మధ్య వచ్చిన తగాదావల్ల మన పార్టీ ఏ స్థితిలోపడిందో పైన చూచాం; 1959 తర్వాత అది వరుసగా చేసిన తీర్మానాలను, ప్రకటనలను కూడా మనం చూదాం. 1962 ఆగస్టు నాటికి పరిస్థితి చాల ఆందోళనకరంగా తయారైంది. ఈ సమస్యపై హైద్రాబాద్‌లో సమావేశమైన జాతీయసమితి క్రిందివిధంగా తీర్మానించింది.

"ఏ క్షణంలోనైనా ఘర్షణలు జరిగేటంతప్రమాదం కలిగేటంతగా ఉభయదేశాల సాయుధబలాలు ముఖాముఖి మోహరించి వున్నాయి. అప్పుడే ఒక సంఘటనకూడా జరిగింది. అందులో భారతీయ సైనికులు గాయపడ్డారు. ఇందుకు భారతప్రజలు న్యాయంగానే క్రోధోద్రిక్తులయ్యారు.

"దేశరక్షణకై అవసరమైన చర్యలను తీసుకొంటూనే, సరిహద్దు సమస్యను శాంతియుత సంప్రదింపుల ద్వారా పరిష్కరించడానికి అన్ని ప్రయత్నాలూ చెయ్యాలన్న భారత ప్రధాని జవహర్లాల్ నెహ్రూ విధానాన్ని జాతీయసమితి బలపరుస్తోంది.

తర్వాత ఉభయ ప్రభుత్వాలూ "పరస్పరసంబంధాలుంచుకోవడానికి" చేసే ప్రయత్నాలను తీర్మానం పేర్కొంది. "పరిస్థితులు మరింత

అధ్వాన్న మవకుండా నిరోధించడానికి, రెండు ప్రభుత్వాల ప్రతినిధుల మధ్య సంప్రతింపులు ప్రారంభమయేందుకు తగిన పరిస్థితులు కల్పించడానికి భారత ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలను యీ సమితి సంతృప్తితో గుర్తిస్తున్నది." ఆ తర్వాత "భారతదేశం తీసుకున్న చొరవకు అనుగుణంగా చైనావారు వ్యవహరిస్తున్నారు" అని తీర్మానం గుర్తించింది.

## అభివృద్ధి నిరోధకులపట్ల అప్రమత్తతతో మెలగాలని హెచ్చరిక

దేశంలోని అభివృద్ధి నిరోధకపార్టీల పట్ల అప్రమత్తతతో మెలగాలనికూడా తీర్మానం హెచ్చరించింది. అది ఇలా తెలియజేసింది:

అయితే, సంప్రతింపుల ద్వారా పరిష్కారం కుదుర్చుకోవాలన్న విధానం నుండి వెనక్కి మళ్ళాలని ప్రభుత్వంమీద ఒత్తిడి తెచ్చే ప్రయత్నాలు మరోవైపున సాగుతున్నాయనికూడా సమితి గుర్తిస్తున్నది. దేశ గౌరవాన్ని, సమైక్యతను ధారాదత్తం చేస్తున్నారని, ముఖ్యంగా రక్షణమంత్రిమీద, ప్రధానమంత్రిమీద దేశంలో కొన్ని రాజకీయ పార్టీలు, గ్రూపులు విషప్రచారం సాగిస్తున్నాయి. ప్రభుత్వ విధానాల మీద ఈ దాడి సాగించేవారు, వాస్తవంలో దేశం అనుసరించే మొత్తం విదేశాంగ విధాన మీద, అంతర్జాతీయసమస్యల శాంతియుతపరిష్కారం సైనికకూటములలో చేరకపోవడం అనే విధానంమీద దాడిచేస్తున్నారు.

వీరంతా మన సరిహద్దుల రక్షణ అనే పేరుతో వాదించేది శాంతియుత సంప్రతింపులనే పద్ధతిని విడనాడాలనీ, మన దేశాన్ని సామ్రాజ్యవాద రాజ్యాలలో జతచేర్చే విధానాన్ని అనుసరింపజేయాలనీ మాత్రమే.

"ఈ ప్రయత్నాలకు వ్యతిరేకంగా దేశంలో దేశభక్తిగల పౌరులందరూ సమీకృతులు కాగలరనీ, ప్రశాంత వాతావరణంలో చైనా ప్రభుత్వంతో సంప్రతింపులు ఆరంభించడానికి భారత ప్రభుత్వం చేసే ప్రయత్నాలను బలపరుస్తారనీ సమితి ఆశిస్తోంది."

జాతీయసమితి 1962 ఆగస్టు 14 నుంచి 20 వ తేదీవరకు సమావేశమయింది. చర్చ సుదీర్ఘంగా జరిగినప్పటికీ, పైతీర్మానం అత్యధిక మెజారిటీతో ఆమోదింపబడింది. కొద్దిమంది మాత్రమే ఒకటి రెండు మాటలమీద, గూఢార్థాలమీద భేదించారు.

కాని, తీర్మానంలో వ్యక్తం చేయబడిన ఆందోళన మాత్రం పూర్తిగా సబబైనది. ఆ ఆందోళనకు కారణం, ఉభయ సేనలూ ప్రమాదకరంగా దగ్గర నిలబడడం, ఘర్షణలు జరుగుతూన్నట్లు వార్తలు రావడమూను, తర్వాతకూడా ఉద్రిక్తత తగ్గలేదు. పైగా ఇదివరకే చెప్పినట్లు, సెప్టెంబరు 8 నాటికి చైనా సేనలు ఇండియన్ స్థావరాలమీద దాడి చేయ నారంభించాయి. భారత సేనలను, అవి వున్న స్థావరాల నుంచి వెనక్కు నెట్టివేయసాగాయి. ఆ ప్రదేశం తమదని చైనావారు చెప్పారు; కాని భారతప్రభుత్వం నిరాకరించింది. ఈ విధంగా, భారీయెత్తున ఎదురుదాడికి సన్నాహాలు జరుగుతున్నాయి.

## మాక్‌మాహన్ రేఖ ప్రాముఖ్యత

సెప్టెంబరు—అక్టోబరు మాసాల్లో జరిగిన ఘర్షణవల్లా, ఆ తర్వాత లడక్‌లోను, మాక్‌మాహన్ రేఖ ప్రాంతంలోను చైనా సేనలు భారీయెత్తున దండయాత్ర చేయడంవల్లా దేశప్రజల్లో ఉద్రిక్తత తగ్గిందనీ, సంప్రతింపులు ప్రారంభమవుతాయనీ అంతకు ముందున్న ఆశలు పటాపంచలయాయి. యుద్ధం తప్పదన్నట్లు, ప్రారంభం కానున్నట్లు కనిపించింది. నిజానికి ప్రజలు యుద్ధాన్ని కోరలేదు. కాని అది వచ్చి కూర్చుంది.

చైనా సేనలు మాక్‌మాహన్ రేఖ దాటుతున్నట్లు మొదటిసారిగా అస్పష్టమైన వార్తలు వెలువడ్డంతో, పార్టీ కార్యదర్శివర్గం సమావేశమై, అక్టోబరు 17 వ తేదీన ఒక ప్రకటన చేసింది. అందులో యిలా తెలియజేసింది :

"నేఫా సరిహద్దులో జరిగిన ప్రమాదకర ఘటనలపట్ల భారత కమ్యూనిస్టుపార్టీ జాతీయసమితి కార్యదర్శివర్గం తీవ్ర ఆందోళన వ్యక్తం

చేస్తూంది. భారత-చైనా సేనలమధ్య ఘర్షణలు జరిగాయి; అవి ప్రాణ నష్టానికి దారితీశాయి.

"సంప్రతింపులకు అనుకూల వాతావరణం సృష్టింపబడుతోందనీ, వుభయపక్షాల మధ్య ప్రాథమిక చర్చలకు సమావేశాలు జరగబోతున్నాయనీ కొద్దివారాల క్రిందటే మన ప్రజల్లో ప్రగాఢమైన ఆశ రేకెత్తి వుండడంవల్ల, పరిస్థితి మరింత ఆందోళనకరంగా తయారైంది. నేఫా సరిహద్దులో యిప్పుడు కొత్త ఉద్రిక్తతలు ఏర్పడ్డంవల్ల ఈ ఆశలు అడిఆసూశలయాయి.

"ఇండియా, చైనాలమధ్య దాదాపు గుర్తుగీయబడ్డ సరిహద్దురేఖ మాక్‌మాహన్‌రేఖ-ఒకటివుండడంవల్ల ఈ సరిహద్దు మిగతా ప్రాంతంలోకన్న ప్రశాంతంగా ఉంటూ వచ్చింది. కాబట్టి, మాక్‌మాహన్‌రేఖపై తీవ్రమైన విభేదాలు, ఘర్షణలు జరుగుతాయని ఎవరూ అనుకోలేదు.

"చైనా సేనలు మాక్‌మాహన్‌రేఖకు దాటి దక్షిణంగా వచ్చాయనీ, ఆ విధంగా భారత భూభాగాన్ని అతిక్రమించాయనీ భారత ప్రభుత్వ రిపోర్టులు తెలియజేస్తున్నాయి. అయితే చైనీయులు దాన్ని నిరాకరించారు. మాక్‌మాహన్‌రేఖ భారతదేశ సరిహద్దు అని ఎల్లప్పుడూ భారతకమ్యూనిస్టుపార్టీ తెలియజేస్తూనేవుంది. అందుచేత దాన్ని రక్షించుకోడానికి తీసుకోబడే చర్యలన్నీ సబబైనవేనని భావిస్తూంది.

"భారత ప్రభుత్వం సంప్రతింపులకై చేసే ప్రయత్నాలనూ, అదే సమయంలో సరిహద్దుల రక్షణకు అది తీసుకొనే అవసర చర్యలనూ బలపరుస్తూ, పార్టీ జాతీయ సమితి హైదరాబాద్ సమావేశంలో తీర్మానించింది.

భారత ప్రభుత్వ రిపోర్టులు "తెలియజేసే" విషయాలన్నీ, చైనీయులు "చెప్పే"దాన్నీ ఒకే గాటిని కట్టినట్లుగా పై ప్రకటన ఉందని కొందరు వ్యాఖ్యానించారు. అట్టిభావం ఆ మాటల్లో లేకపోయినా, దాన్ని తొలగించేటందుకు పార్టీ అధ్యక్షుడు అక్టోబరు 19 వ తేదీని సెక్రటేరియట్ తీర్మానాన్ని వివరిస్తూ ఒక ప్రకటన చేశారు.

కాని, అక్టోబరు 20 వ తేదీన, చైనా సేనలు ముందుకు తోసుకు వస్తున్నట్లు అత్యంత ఆందోళనకరమైన వార్తలు వెలువడసాగాయి; అవి

ప్రజల్లో తీవ్రమయిన ఆవేశాలు కలిగించాయి. వారు ప్రభుత్వ పీడనకు, ప్రభుత్వంపెట్టేబాధలకు గురి అవుతున్నా, జాతీయరక్షణ అనే నినాదంక్రింద ఆ ప్రభుత్వం వెనకే సమీకృతులయారు. ప్రభుత్వము అత్యవసర పరిస్థితిని ప్రకటించింది. రాజ్యాంగచట్టంలోని కొన్ని కీలక భాగాలను రద్దుచేసింది.

వెంటనే, అభివృద్ధినిరోధకపార్టీలు కమ్యూనిస్టు వ్యతిరేక దుమారాన్ని రెచ్చగొట్టాయి; పార్టీని నిషేధించాలని కోరాయి; పార్టీ నాయకుల్ని అరెస్టు చేయాలన్నారు. ఈ విషయంలో ప్రజాసోషలిస్టు పార్టీ నాయకత్వం వహించింది, దాని వెనుక జనసంఘం, స్వతంత్ర పార్టీ, సోషలిస్టులు, తదితరులు నిలబడ్డారు. కాంగ్రెసుపార్టీ, కాంగ్రెసు ప్రభుత్వాలు పైకి తటస్థంగా ఉన్నట్లు నటించాయి. కాని ప్రభుత్వ యంత్రాంగం మాత్రం వ్యతిరేకంగా అభివృద్ధినిరోధక పార్టీలవైపే ఎక్కువగా మొగ్గింది

ఈసారి కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారానికి యిదివరకటికంటే త్వరగా ప్రజలు చెవి యొగ్గారు ప్రజలు తటస్థంగా వుండడం చూచి రౌడీ మూకలు చొరవ తీసుకున్నాయి; మా ఆఫీసులమీద, ఇళ్ళమీద, పుస్తకాల షాపులు మొదలైన వాటిమీద దాడులు ప్రారంభించాయి. పార్టీసభ్యులు వీలున్నచోటల్లా తమ స్థావరాలను చక్కగా రక్షించుకున్నారు. కాని, వారు ప్రవాహానికి ఎదురీదవలసి వచ్చింది. పోలీసులు కూడా రౌడీలవైపే మొగ్గారు; కొన్ని సందర్భాల్లో వారికి సహాయం చేశారు.

ఇదంతా ఎందుకు సాధ్యమైందంటే, మేము చైనా పక్షాన ఉన్నామని, మేము దేశాభిమానులం కామనీ, దేశాన్ని మేము రక్షించమనీ, "అంతర్జాతీయ వాదులం"గా మేము భారత ప్రభుత్వానికి కాక చైనావారికే ఎక్కువగా సహాయం చేస్తామనీ, గతంలోకూడ భారత కమ్యూనిస్టుపార్టీ యిలాగే చేసిందనీ ప్రజలు విశ్వసించేటట్లు ఆ నాటి పరిస్థితు లున్నాయి. మేము దేశ స్వాతంత్ర్యాన్ని ప్రేమించడంకన్న బూర్జువా-భూస్వామ్య కాంగ్రెసును, దాని ప్రభుత్వాన్ని, నెహ్రూను

ద్వేషిస్తామనేది వారి అభిప్రాయం. నిజానికి, సోషలిస్టు చైనా జయించడంవల్ల దేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోదనీ, పైగా పెట్టుబడిదారీ పాలకులనుంచి విముక్తి కలుగుతుందనీ, కమ్యూనిస్టులు చైనావారికి అస్సాంవైపు మార్గం చూపుతున్నారనీ—యిలాగే యెన్నో అభిప్రాయాలు ప్రజల్లో వ్యాపించాయి. ఆ కొద్ది రోజుల్లోనూ మా పార్టీ మీద జరిపిన విషప్రచారానికి హద్దులు లేకుండాపోయాయి.

## అపసవ్యమయిన పోలిక

అలాంటి పరిస్థితులమధ్య పెకింగ్ రేడియో అక్టోబరు 27వ తేదీని "చైనా - ఇండియా సరిహద్దు సమస్యదృష్ట్యా నెహ్రూ తాత్విక దృక్పథం గూర్చి మరికొంత పరిశీలన" అనే పేరుతో ఒక సుదీర్ఘ వ్యాసం ప్రసారం చేసింది. క్లుప్తంగా చెప్పాలంటే, భారతదేశం అమెరికన్ సామ్రాజ్యవాదుల చేతుల్లోపడిపోయిందనీ, నెహ్రూ, ఆయనప్రభుత్వం అమెరికన్ సామ్రాజ్యవాదుల ఏజంట్లనీ, అందువల్ల చైనాపై యుద్ధం చేస్తున్నారనీ ఆ వ్యాసంలో చెప్పబడింది. భారతదేశ పరిస్థితిని గురించి వారు వేసిన అంచనా అది.

ఆ తర్వాత వారడిగిన ప్రశ్న ఇది: "నెహ్రూ అనుసరిస్తున్న ఈ అభివృద్ధినిరోధక, జాతీయ దురహంకార విధానంపట్ల మార్క్సిస్టు - లెనినిస్టులు ఎట్టి వైఖరి నవలంబించాలి?" అంటే, భారత కమ్యూనిస్టు పార్టీ వైఖరి ఎలా వుండాలనేది వారిప్రశ్న. మేము ఏమి చేయాలని వారు కోరుతున్నారో దాన్ని సూటిగా వారు చెప్పదలచుకోలేదు, అందువల్ల వారు ఉదాహరణలపద్ధతిని చేబట్టారు.

ఈసందర్భంలో ముప్పై సంవత్సరాలకంటే పూర్వం చైనా చరిత్రలో జరిగిన ఒక వుదంతాన్ని జ్ఞాపకం చేయడం ఉపయోగకరం. (క్రిందిగీతలు రచయితవి)

"ఆ వుదంతం ఏమంటే, అభివృద్ధి నిరోధక కొమింటాంగ్ ముఠా దేశంలో సోవియట్ వ్యతిరేక ఉన్మాదాన్ని రెచ్చగొట్టి, సోవియట్ ప్రభుత్వోద్యోగుల్ని అరెస్టుచేసి, కొందరిని హతమార్చి, సోవియట్ సరి

హద్దుల్ని అతిక్రమించినప్పుడు సోవియట్ సైన్యం ఆత్మరక్షణకు దిగ వలసివచ్చింది. కొమింటాంగు సైనిక దుశ్చర్యను ఆగి ఓడించింది.

తర్వాత ఆ వ్యాసం ఇలా తెలియజేసింది :

"సోవియట్ యూనియన్ చేసినపని పూర్తిగా సరియైనది... ... 30 సంవత్సరాల క్రిందట వున్న చైనా-సోవియట్ సంబంధాలకూ, యీనాడున్న చైనా-ఇండియా సంబంధాలకూ కొన్ని పోలిక లున్నాయి."

కాబట్టి, చాంగ్ కై-షేక్ కీ, సోవియట్ యూనియన్ కి మధ్య 30 సంవత్సరాల క్రిందట తగాదా వచ్చినప్పుడు (ఆ తగాదాలో సోవియట్ యూనియన్ సవ్యమైన మార్గం అవలంబించింది), చైనాపార్టీ చేసినట్లే ఇండియన్ పార్టీ కూడా చేయాలన్నమాట.

చైనాపార్టీ చేసిందేమిటి ? కొమింటాంగ్ ముఠా చర్యను ఖండిస్తూ వారొక ప్రకటన చేశారు. అందులో "సోవియట్ యూనియన్ పై జరిగే యుద్ధానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయవలసిందని ప్రజాసామాన్యానికి" విజ్ఞప్తి చేశారు. ఈ పిలుపు నందుకొని "అనేక మంది కమ్యూనిస్టులు, కార్మికులు, రైతులు, విద్యార్థులు, అభ్యుదయ కాముకులు సాహసోపేతంగా తమ జీవితాలను సమర్పించారు."

తర్వాత వారిలా అన్నారు :

"30 సంవత్సరాల క్రిందట చైనాలో కమ్యూనిస్టులు, అభ్యుదయ కాముకులు ఉన్న పరిస్థితుల్లో యించుమించు భారతదేశ కమ్యూనిస్టులు, అభ్యుదయ కాముకులు యీ రోజున వున్నారు."

"ఒక సామాన్య భారతీయుని" లేఖను పునశ్చరణచేసిన తర్వాత, పెకింగ్ "పీపుల్స్ డైలీ" యిలా వ్రాసింది :

"కాని, భారతదేశంలో మార్క్సిస్టు - లెనినిస్టులమని చెప్పుకొనే ఎస్. ఎ. డాంగేవంటి కొందరు నెహ్రూ వెనుకనేవుంటూ వెంబడించడం, "భారత ప్రభుత్వాన్ని బలపరచడం ఆశ్చర్యంగా వుంది."

చరిత్రనుగురించీ, నేటి పరిస్థితుల్నిగురించీ ఏ మాత్రం తెలిసిన వారైనా యీనాటి పరిస్థితులకూ, 30 ఏండ్లనాటి పరిస్థితులకూ పోలిక

ఏమీలేదని సులభంగా గ్రహించగలుగుతారు; అందులోనూ చైనా పరిస్థితులకూ, భారతదేశ పరిస్థితులకూ అసలే పోలికలేదు.

ఆ రోజుల్లో సోషలిస్టు ప్రపంచ వ్యవస్థ లేదు; కొత్తగా స్వాతంత్ర్యం పొందిన తటస్థదేశాలు లేవు; యుద్ధాన్ని నివారించగల అవకాశాలులేవు, బలీయమైన శాంతి ఉద్యమం లేదు; సామ్రాజ్యవాదులకన్న శక్తివంతమైన దేశంగా సోవియట్ యూనియన్ లేదు.

చైనాలో ఆనాడు యుద్ధప్రభువు లుండేవారు; అనేక సామ్రాజ్యవాద ప్రభుత్వాలు చైనాను పీడిస్తూవుండేవి; కొమింటాంగ్‌లో చీలిక ఏర్పడ్డం కొంత కారణంగా, చైనా పార్టీకి రెడార్మీ వుండేది; చైనా విప్లవం యొక్క ప్రత్యేక లక్షణాల్లో అది ఒకటి. 30 సంవత్సరాలనాటి ప్రపంచానికీ, నేటి ప్రపంచానికి పోలికలేదు. అలాగే 30 సంవత్సరాల నాటి చైనాకూ, నేటి భారతదేశానికీ సామ్యంలేదు.

ఇదే, సరిగ్గా చైనా నాయకత్వంలో వున్నలోపం, 30 సంవత్సరాలనాటి చైనాలో వారిప్పటికీ, సిద్ధాంతరీత్యా నివసిస్తున్నారు; ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంకూడా అలాగే వుండాలని వారు కోరుతున్నారు. అందువల్ల వారు ప్రతివారితోనూ భేదిస్తున్నారంటేనూ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని అధికసఖ్యాక పార్టీలతో వారు తగాదా పడుతున్నారంటేనూ ఆశ్చర్యం ఏమీలేదు.

30 సంవత్సరాల పాఠాన్ని. సలహాను వారు రేడియోద్వారా ప్రసారం చేశారు. దాన్ని ఏ కొద్దిమందో ఇండియన్ కమ్యూనిస్టులేకాక ఇండియన్ పోలీసులుకూడా వినగలిగియున్నారు. ఇది అక్టోబరు 27 న జరిగింది; మరి మూడురోజుల్లో మా పార్టీ జాతీయసమితి సమావేశం కావలసియుంది; అది అత్యంత ప్రధానమయిన సమావేశం.

పెకింగ్ రేడియోనుంచి వారు అట్టి సలహా, అట్టి సమాచారం చేసిన తర్వాత కమ్యూనిస్టుల్ని అరెస్టు చేయవలసిందని ఒప్పించడానికి మరొకరి సహాయం భారత ప్రభుత్వానికి అక్కర్లేకపోయింది. అంతేకాదు. "అత్యంత కఠినమైన పరిస్థితుల్లో న్యాయంకోసం, సత్యంకోసం ఇండియా - చైనాల మిత్రత్వంకోసం గట్టిగా నిలబడి, అప్రతిహతంగా పోరాటాలు నడిపిన" అనేకమంది భారత కమ్యూనిస్టుల్ని, అభ్యుదయ

కాముకుల్ని, ఆ వ్యాసకర్తలు వీపుచరిచారుగూడా. వారికి యీ కాకమ్మకథ అక్టోబరు 27 నాటికి ఎలా చేరిందో మరి ?

చైనా దాడి చేసే ప్రమాదమున్నదని కొంచెం కూడా మాపార్టీకి చాలా రోజులవరకు తెలియదు. అట్టి పరిస్థితికి పార్టీ సిద్ధాంతరీత్యాగానీ, రాజకీయంగా గానీ సిద్ధంగా లేదు. ఈ సారి కూడా సంక్షోభం సమసి పోతుందని ఊహింపబడింది. కాని ఈ సారి జరిగింది లడక్‌లోనో, లాంగ్జూలోనో జరిగిన ఘర్షణలాంటిది కాదు. అదొక భారీ యెత్తు దండయాత్ర.

ఈ సమస్యపై జాతీయసమితి సమావేశమై ఒక నిర్ణయం తీసుకోవాలని అన్నివైపుల నుంచి పార్టీ యూనిట్లతోసహా డిమాండ్లు వచ్చాయి. ఆ ప్రకారం జాతీయసమితి అక్టోబరు 31 న సమావేశమయింది. రెండురోజులు చర్చించిన తర్వాత, నవంబరు 2 వ తేదీన "చైనా దురాక్రమణ నెదిరిద్దాం. మాతృదేశ రక్షణకై ఐక్యమవుదాం" అనే తీర్మానం చేసింది.

## నూతన అధ్యాయము

ఈ తీర్మానం పెద్ద మెజారిటీతో ఆమోదింపబడింది. మరో రెండు ప్రత్యామ్నాయ తీర్మానాలు ప్రతిపాదింపబడ్డాయి. కాని అవి వీగిపోయాయి. నవంబరు 2 న ఆమోదింపబడిన తీర్మానం మా పార్టీ చరిత్రలో ఒక నూతన అధ్యాయమని చెప్పవచ్చు. అందువల్ల సహజంగా భారతదేశ పార్టీలోనూ, బయటా దానిమీద పెద్ద వివాదం బయల్దేరింది.

చైనావారు మరీ తీవ్రంగా ఖండించింది యీ తీర్మానాన్నే. అందువల్ల, ఆ తీర్మానంలోని ప్రధాన పోకడ ఏమిటో, దానిమీద వచ్చిన విమర్శ ఏమిటో చూద్దాం. ఆ తీర్మానంలో 21 ప్రధానాంశాలున్నాయి. అవి :

1. చైనా భారతదేశంపై దురాక్రమణ జరిపింది. 'దురాక్రమణదారు' అని ఆ దేశం పేర్కొనబడింది.

2. కమ్యూనిస్టుపార్టీ దేశరక్షణను బలపరచాలి.

3. తిరిగి శాంతియుత సంప్రతింపుల వాతావరణాన్ని సృష్టించేందుకు అన్ని మిత్రదేశాలూ గట్టిగా తోడ్పడవలసిందని మేము విజ్ఞప్తి చేశాం. అంటే, (1) సాయుధ ఘర్షణ ఆగిపోవడం, (2) చైనా బలాలు 1962 సెప్టెంబరు 7న ఎక్కడుండేవో అక్కడికి ఉపసంహరించుకోవడం.

4. ఈ ఘర్షణ ఆసియా – ఆఫ్రికా ఐక్యతను భగ్నం చేస్తుంది.

5. సామ్రాజ్యవాదవ్యతిరేకపోరాటాన్ని అది బలహీనపరుస్తుంది.

6. ప్రపంచశాంతికి అది ప్రమాదకరం

7. ఆసియా ఖండంలోని యీ రెండు పెద్దదేశాలమధ్య యుద్ధం బారీ యెత్తున దీర్ఘకాలం కొనసాగడం మహావిపత్కరం; దాన్ని అందరం నివారించాలి.

8. ఈ సంఘర్షణ అభివృద్ధి నిరోధకులు మరింత బలపడ్డానికి అస్కార మిచ్చింది.

9. భారతదేశం అనుసరిస్తున్న శాంతివిధానం, తటస్థవిధానం అమలు జరపడంలో కొన్ని పొరబాట్లు జరిగినప్పటికీ, ప్రధానంగా అది సరియైనదే. ఈ విధానాన్ని వ్యతిరేకిస్తున్నవారిని యీ సంఘర్షణ బలపరచింది.

10. భారతదేశాన్ని ఆంగ్లో – అమెరికన్ సామ్రాజ్యవాదుల యుద్ధ శిబిరంలోకి యీడ్చేందుకు జరిగే ప్రయత్నాలకు యీ సంఘర్షణ అవకాశ మిస్తుంది.

11. యుద్ధోన్మాదాన్ని యిది పెంచుతుంది.

12. భారత – చైనా ప్రజల మైత్రిని యిది నాశనం చేస్తుంది.

13. భారతదేశంయొక్క ఆర్థిక వ్యవస్థనుగురించీ, అంతరంగిక పరిస్థితుల్ని గురించీ, విదేశాంగ విధానంగురించీ చైనా నాయకులు వేసుకున్న అంచనాను తీర్మానం నిరాకరించింది.

14. ఒక సోషలిస్టుదేశం మరొక తటస్థ ప్రజాతంత్ర దేశంతో అది పెట్టుబడిదారీ దేశం అయినప్పటికీ – సాయుధ ఘర్షణలకు దిగుతుందని మేము అనుకోలేదు.

15. 81 పార్టీల అవగాహనను పైనా అతిక్రమించింది.

16. ఏ దేశంనుంచైనాసరే వ్యాపార పద్ధతిపై ఆయుధాలు కొనుక్కోడానికి మేము వ్యతిరేకంకాదు. అయితే విదేశ సేనల ప్రవేశాన్ని మేము వ్యతిరేకిస్తాము.

17. జాతీయ రక్షణకై జాతీయైక్యతను మేము బలపరుస్తాం.

18. రక్షణభారాన్ని ధనికులమీద వేయాలేగాని, మోయలేని పేదలమీద వేయకూడదని ప్రభుత్వాన్ని అడుగుతున్నాము.

19. ప్రభుత్వం, ప్రజలు జాతీయ విద్రోహ స్వార్థపరవర్గాలకు వ్యతిరేకంగా, వారి అధికలాభాలకూ, అధికధరలకు వ్యతిరేకంగా, ఆర్థిక వ్యవస్థను ఛిన్నాభిన్నంచేసే గుత్తాధిపతులకు వ్యతిరేకంగా చర్యలు తీసుకోవాలని కోరుతున్నాం.

20. కష్టజీవుల హక్కులనూ, జీవనప్రమాణాల్నీ కాపాడాలి.

21. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారాన్నీ, పార్టీమీద జరిగే దాడుల్ని తిప్పికొట్టాలి.

అన్ని పార్టీయూనిట్లు, అందరు పార్టీసభ్యులు, పార్టీ అభిమానులు వెనువెంటనే పై అంశాలను ప్రాతిపదికగా ఏడుఅంశాల కార్యక్రమాన్ని ఆధారపర్చుకొని పనిచేయవలసిందిగా తీర్మానం ఆదేశించింది. ఆ ఏడు అంశాలు యివి :

(అ) దేశంలో నెలకొల్పబడుతున్న ప్రజాకమిటీల కార్యకలాపాల్లో చురుగ్గా పాల్గొంటూ, దేశరక్షణ కృషిని బలపరచాలి.

(ఆ) జాతీయ రక్షణనిధిని వసూలు చేయడానికి తమ శక్తి నంతటినీ వినియోగించాలి.

(ఇ) దేశరక్షణకు, ప్రజల అవసరాలకు అవసరమైన వస్తువులను అధికంగా ఉత్పత్తిచేయడానికి దృఢనిశ్చయంతో కృషిసల్పాలి.

(ఈ) ధరల పెరుగుదల, బ్లాక్‌మార్కెట్టు, విపరీత లాభాలు మొదలైన సంఘ వ్యతిరేక చర్యలను ఎదుర్కోడానికి ప్రజల్ని సమీకరించాలి, ఆ చర్యలు శ్రమజీవులకూ, మొత్తం జాతికీ నష్టం కలిగిస్తాయి.

(ఉ) ప్రస్తుత సంక్షోభంనుంచి సంకుచిత రాజకీయ ప్రయోజనాన్ని పొందజూచే గ్రూపులకు, పార్టీలకు, శక్తులకు వ్యతిరేకంగా నిరంతరం ప్రచారం చేయాలి.

(ఊ) భారతదేశం అనుసరిస్తున్న శాంతివిధానాన్ని, తటస్థవిధానాన్ని విడనాడేటట్లూ, ఆవిధంగా సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడేటట్లూ, భారతదేశం దీర్ఘకాల యుద్ధంలో యిరుక్కునేటట్లు చేయజూచేవారి ప్రయత్నాలను ప్రతిఘటించాలి.

(ఋ) భారత ప్రభుత్వం దేశగౌరవానికీ, హుందాతనానికీ తగిన విధంగా శాంతియుత పరిష్కారం కుదుర్చుకోడానికి చేసే ప్రయత్నాలన్నిటినీ బలపరచాలి.

ఈ సందర్భంలో ఒక విషయం గమనించాలి. కొందరు నాయకులు, కొన్ని రాష్ట్ర యూనిట్లు పై అంశాల్లో కొన్నిటిని, లేదా తీర్మానంలోని మూల విధానాన్ని వ్యతిరేకించినప్పటికీ, ఏ ఒక్క యూనిటూ, ఈ యేడు అంశాల కార్యక్రమాన్ని అమలు జరపడానికి నిరాకరించలేదు.

ఈ తీర్మానాన్ని చైనా నాయకత్వం పూర్తిగా ఖండించింది.

అతి సంఘటితంగా, బాహాటంగా వ్యక్తం చేయబడిన విమర్శన వారి రేడియో ప్రసారాల్లోను, పత్రికల్లోను, ప్రకటనల్లోను కనిపిస్తుంది. చైనా నాయకులు చెప్పే విషయాలూ, తీర్మానాన్ని ఖండించిన యితర విమర్శకులు చెప్పేవీ ఒకే విధంగా వున్నవి.

తీర్మానంలో కొన్ని లోపాలుంటే వుండవచ్చు. కాని ప్రధాన విషయం ఏమంటే, మార్క్సిజం - లెనినిజం దృష్ట్యా ఆ తీర్మానం "ప్రధానంగా అపసవ్యమైనదా ?" అని జాతీయ సమితి తీర్మానంపై వివాదం, ఏవిధంగా దాన్ని మెరుగుపరచగలం అనేదికాదు, అందులోని ప్రధాన పోకడ సరియైనదా కాదా అనేదే వివాదాంశం.

## తీర్మానం ప్రధానంగా అపసవ్యమైనదా ?

మా తీర్మానం లేవనెత్తిన "అతిప్రధానమైన" అంశాలు రెండు. ఈ రెంటిమీదే పార్టీలో ఉన్న మా మధ్యా; మాకూ, జాతీయవాదులకూ మధ్యా ఉగ్రరూపంలో వివాదం సాగింది.

ఆ రెండు అంశాలు దేశరక్షణ, దురాక్రమణ. కమ్యూనిస్టు సిద్ధాంతంలో దేశరక్షణ, దేశరక్షణతత్వం అనే ప్రశ్నలు ప్రధానస్థానం ఆక్రమిస్తున్నాయి. నిజం చెప్పవలసివస్తే, 1914 – 18 మధ్య ప్రపంచ సామ్రాజ్యవాద యుద్ధం కొనసాగుతూన్నప్పుడు లెనిన్‌కీ, రివిజనిస్టులకూ మధ్య యీ కీలకసమస్యపైననే విభేదాలు–సిద్ధాంతానికీ ఆచరణకూ సంబంధించినవి ఏర్పడ్డాయి.

కమ్యూనిస్టులు తమ దేశాన్ని ప్రేమిస్తారా? ప్రేమించరా? అనే ప్రశ్నకూ, వారు దేశరక్షణను కోరుతారా? కోరరా? అనే ప్రశ్నకూ సంబంధమేమీ లేదు. ఎందుచేతంటే ప్రతి కమ్యూనిస్టు తన దేశాన్ని ప్రేమిస్తాడు; అది స్వతంత్రంగా ఉండాలని కాంక్షిస్తాడు; దానిమీద మరొకదేశం దాడి చేయాలని కోరడు; అతనిలో దేశభక్తి వుంది.

అయితే సమస్య యింతసులభంగా పరిష్కారంకాదు జాతి అనే భావం ఉంది. భారతీయులమైన మనమందరమూ మనదేశాన్నిగురించీ, ఇతరప్రజలు తమదేశాన్నిగురించీ అనుకొనేభావం అది. ఒకానొకదేశం పెట్టుబడిదారీదశలో ప్రవేశించినప్పుడు మాత్రమే యీ భావం ప్రజల మనస్సుల్లో కలుగుతుంది.

ప్రపంచంలో ఫ్యూడల్ సామాజిక వ్యవస్థ శిథిలం కావడం ప్రారంభమై, నూతన పెట్టుబడిదారీ వ్యవస్థ, పెట్టుబడిదారీ సంబంధాలు వికసించనారంభించినప్పుడు, జాతీయత అనేది ఒక భావంగా, సమగ్ర భావంగా ఆవిర్భవించింది. కనుకనే, కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రకారం జాతీయత బూర్జువా (పెట్టుబడిదారీ) జాతీయతగా వర్ణింపబడింది.

జాతీయత ఫ్యూడల్ అనైక్యతకంటే ముందడుగు. కాని, పెట్టుబడిదారీ విధానం పాదుకొన్నాక ప్రపంచంలో మరొక కొత్తభావం తలెత్తింది. ఇదివరకుకంటె ఉన్నతమైన సామాజిక వ్యవస్థకు అది

సంబంధించినది; దానికి పునాది సోషలిజం; అది ఆధారపడేది జాతీయత మీద కాదు; శ్రామికవర్గ అంతర్జాతీయత మీద.

బూర్జువావర్గం స్వప్రయోజనార్థం దేశం మీద, కార్మిక వర్గం మీద, ఇతర శ్రామిక జాతుల మీద తన పెత్తనాన్ని బలపరచుకోడానికే జాతీయ భావాన్ని ఉపయోగించుకొంటుంది. కార్మిక వర్గం జరిపే పోరాటాన్ని అణచేందుకు కూడా బూర్జువావర్గం జాతీయతను ఉపయోగించుకొంటుంది.

మొత్తం జాతియొక్క "విశాల" ప్రయోజనాలు "సంకుచిత" వర్గప్రయోజనాలకంటె మిన్న అనే భావాన్ని అది కలగజేస్తుంది. మరొక దేశం మీద పోరాడేటప్పుడు అది కార్మికుల్ని తన వర్గ ప్రయోజనాలను, శ్రామికవర్గ అంతర్జాతీయతను దూరంగా పెట్టి, తన వెనుక నిలబడవలసిందిగా కోరుతుంది.

ఒక వర్గం అధికారంలోవున్న వ్యవస్థలో, అంటే బూర్జువావర్గం అధికారంలో వున్నప్పుడు, దేశరక్షణ అనే మాటకు అర్థం ఏమిటి? కార్మికవర్గం, కార్మికపార్టీ, బూర్జువా వర్గం అంటే అయిష్టంగా వున్నప్పటికీ, ఆ వర్గానికి వ్యతిరేకంగా పోరాడుతున్నప్పటికీ, దేశ రక్షణ తన విధి అని అంగీకరించిన తర్వాత, ఆ దేశం యొక్క బూర్జువా ప్రభుత్వాన్ని బలపరచేందుకు యిష్టపడినట్లే లెక్క.

కారణం ఏమంటే, ప్రభుత్వ ప్రసక్తి లేకుండా దేశరక్షణ అసాధ్యమైన విషయం. ఒకే దేశాన్ని రెండు వర్గాలకు చెందిన సైన్యాలు, వేర్వేరు పద్ధతుల్లో, వేర్వేరు వర్గాల నాయకత్వంక్రింద రక్షించడం—ఆ రెండు వర్గాలూ వేర్వేరు ప్రభుత్వాలను స్థాపించుకున్న పరిస్థితుల్లోతప్ప—అసంభవం. చైనాలో, జపాను వ్యతిరేక యుద్ధ కాలంలో అలా జరిగింది.

అందువల్ల, శ్రామికవర్గం అంతర్జాతీయత ఒక పరిమిత లక్ష్యం కోరకు—అంటే దేశరక్షణకోరకు బూర్జువా జాతీయతతో చేతులు కలుపుతుంది. దీన్ని ఆధారం చేసుకొని, దేశరక్షణను బలపరచాలనే మా తీర్మానం, జాతీయ దురహంకారంతో, బూర్జువా జాతీయతతో నిండివుందనీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకు అది ద్రోహం చేసిందనీ,

బూర్జువా వర్గం తోకపట్టుకొని పోతూందనీ వ్యాఖ్యానం చేస్తున్నారు. "రివిజనిస్టుల ప్రతిబింబం"లో యిలా వ్రాయబడింది :

"అంతరంగికంగా చూస్తే, డాంగే ముఠా అనుసరిస్తున్న జాతీయ దురహంకార పంథా భారతదేశపు బడా బూర్జువావర్గం యొక్క, బడా భూస్వాములయొక్క అభివృద్ధి నిరోధక, జాతీయ వాద ప్రయోజనాలకు సహాయపడుతూంది. బాహ్యంగా చూస్తే, భారతదేశంలో నయా వలస విధానాన్ని వృద్ధిచేస్తున్న అమెరికన్ సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు తోడ్పడుతోంది ... ... వారి (డాంగే ముఠా) పాలసీ ప్రపంచ కార్మిక వర్గానికేకాక, భారత ప్రజలకుకూడా ద్రోహం చేస్తున్నది."

ఈ విమర్శ వెనుకనున్న హేతువాదం ఏమిటి ?

తన దేశంయొక్క బూర్జువా వర్గాన్ని ఎప్పుడు బలపరచినా ప్రపంచ కార్మికులకు ద్రోహం చేసినట్లేనా ? ఏ పరిస్థితుల్లో అది శ్రామికవర్గ అంతర్జాతీయతకు అనుగుణమైన చర్య అవుతుంది ? క్లుప్తంగా చెప్పాలంటే, కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ, బూర్జువావర్గం పట్ల ఏ విధమైన యుద్ధంలో ఎలాంటి వైఖరి నవలంబించాలి? తాత్కాలికమైన వర్గ ఐక్యత ఏ పరిస్థితుల్లో అవసరం ?

## ఏకాభిప్రాయం, భిన్నాభిప్రాయాలు

ఈ సమస్యపై స్థూలంగా ఏకాభిప్రాయం వుంది. కాని, అనేక సమస్యలపై భేధాభిప్రాయా లున్నట్లే, యీ సమస్యపైకూడా ఉండవచ్చు.

బూర్జువాజాతులు ఆవిర్భవించి ఒకజాతిపై ఒకటి దాడిచేయడం ప్రారంభించినప్పుడు, కొత్తగా తలెత్తిన కార్మికవర్గం ఈసమస్య నెదుర్కోవలసివచ్చింది. ఒక్కొక్క దేశంలో ఆ వర్గానికున్న స్థానాన్నిబట్టీ, దాని అభివృద్ధి స్థాయినిబట్టీ ఈసమస్య పరిష్కరింపబడేది.

ఆతర్వాత పెట్టుబడిదారీ సామ్రాజ్యవాదం ఆవిర్భవించింది. పారిశ్రామికంగా అభివృద్ధిచెందిన పెట్టుబడిదారీ దేశాలు మార్కెట్లకోసం పెట్టుబడుల ఎగుమతికోసం, వాటి వినియోగంకోసం వలసదేశాలను

స్వాధీనపరచుకో నారంభించాయి. ప్రపంచమంతటా పెట్టుబడిదారీ దేశాల దురాక్రమణయుద్ధాలు ముమ్మరంగా కొనసాగుతున్న రోజులవి.

ఆక్రమించుకోబడిన కొన్ని దేశాల్లో సామ్రాజ్యవాదులు పెట్టుబడిదారీ సంబంధాలను ప్రవేశపెట్టారు. తత్ఫలితంగా కార్మికవర్గం ఆవిర్భవించింది. అట్టిపరిస్థితుల్లో, జాతీయ బూర్జువావర్గంతో చేతులు కలిపి సామ్రాజ్యవాదుల్ని ఓడించడం కార్మికవర్గంయొక్క కర్తవ్యం అయింది.

ఇలాంటి సందర్భాల్లో కార్మికవర్గం అభ్యుదయకర బూర్జువా జాతీయతను చేపట్టడంద్వారా, శ్రామికవర్గ అంతర్జాతీయతను పటిష్ఠ మొనర్చింది. ఈ రెండూ పరస్పర విరుద్ధమైన ధోరణులు కావు; ఒకదానికొకటి సహాయపడే ధోరణులు.

సామ్రాజ్యవాద దేశాల్లో కార్మికవర్గం నిర్వర్తించవలసిన కర్తవ్యం, వలసదేశాలను స్వాధీనపరచుకొని అణచిపెట్టియుంచే బూర్జువావర్గంతో చేతులు కలప నిరాకరించడం, పరాధీన జాతుల స్వాతంత్ర్యోద్యమాలను బలపరచడమూను.

1914-18 లో లాగ, రెండు సామ్రాజ్యవాద దేశాలమధ్య యుద్ధం జరుగుతున్నప్పుడు. కార్మికవర్గం చేపట్టవలసిన శ్రామికవర్గ అంతర్జాతీయత ఏవిధంగా ఉండాలి? ప్రతి దోపిడీదారూ రెండవవాని దాడికి లోనయినట్లు నటిస్తూ, దేశాన్ని రక్షించేందుకు-అనగా దోపిడీ ప్రభుత్వాన్నీ, దాని విధానాన్నీ రక్షించేందుకు – ముందుకు రావలసిందని కార్మికవర్గానికి విజ్ఞప్తి చేస్తారు. అయినా అది ప్రపంచ మార్కెట్టును పంచుకొనేందుకు జరిగే మార్గమే. సామ్రాజ్యవాద దోపిడీగాండ్రు ప్రపంచాన్ని పంచుకొనేందుకు జరిగే యుద్ధమే.

కాని లెనిన్ ఆ యుద్ధాన్ని, జార్ ప్రభుత్వాన్ని బలపరచడానికి నిరాకరించాడు. కారల్ లీబ్‌నెక్ జర్మన్ ప్రభుత్వాన్ని బలపరచ నిరాకరించాడు. సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చవలసిందనే నినాదాన్ని లెనిన్ యిచ్చాడు.

ఆనాటి పరిస్థితుల్లో "రక్షణతత్వం" శ్రామిక వర్గ అంతర్జాతీయతకు మహాపరాధం. సోవియట్ ప్రభుత్వం స్థాపింపబడిన వెంటనే,

లెనిన్ జర్మనీతో శాంతిసంధి కుదుర్చుకోవాలని, సోవియట్ ప్రభుత్వాన్ని కూలద్రోసేందుకు ఆంగ్లో, అమెరికన్ సామ్రాజ్యవాదుల నాయకత్వం క్రింద 14 దేశాలు చేసిన దండయాత్రను తిప్పికొట్టి దేశాన్ని రక్షించాలనీ పిలుపు ఇచ్చారు

ఈ విధంగా, యుద్ధం – దేశరక్షణ విషయంలో శ్రామిక వర్గ అంతర్జాతీయతను గురించి కొన్ని ప్రధాన సూత్రీకరణలున్నాయి. సామ్రాజ్యవాదాన్ని కూలద్రోసేటందుకు, సామ్రాజ్యవాదుల దాడి నుండి దేశాన్ని రక్షించేందుకు, పెట్టుబడిదారీ దేశంయొక్క స్వాతంత్ర్యాన్నికూడా సామ్రాజ్యవాదుల దాడినుంచి రక్షించేందుకు జరిగే ప్రతి యుద్ధం ధర్మయుద్ధమే. అట్టి ధర్మయుద్ధాన్ని కొనసాగించేందుకు కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ, జాతీయ బూర్జువా వర్గంతోకలిసి ఐక్య సంఘటన నిర్మించగలవు; నిర్మించాలికూడా.

కాని లెనిన్ కాలంనాటికి ఒక సమస్య యింకా ఉత్పన్నం కాలేదు. అదే సోషలిస్టు రాజ్యాలమధ్య వచ్చే విభేదాలు లేదా ఒక సోషలిస్టు రాజ్యానికీ, కొత్తగా స్వాతంత్ర్యం సంపాదించుకొని, తటస్థ విధానం అనుసరిస్తూ సామ్రాజ్య వ్యతిరేక పంథా అవలంబించే ప్రజాతంత్ర రాజ్యాలకూ మధ్య వచ్చే విభేదాలు

ఈ విధమయిన సమస్య రెండవ ప్రపంచయుద్ధం తర్వాతనే ఉత్పన్నమయింది. ఈ కాలంలో 12 రాజ్యాలు సోషలిస్టు రాజ్యాలయాయి; అనేక దేశాలు సామ్రాజ్యవాదంనుంచి విముక్తి చెందాయి. వీటిలో కొన్ని బూర్జువా ప్రజాస్వామ్య దేశాలయాయి; మరి కొన్ని జాతీయ ప్రజాస్వామ్య దేశాలయ్యాయి; ఇంకా కొన్ని జాతీయ హెూదా సంపాదించుకొంటున్న దశలో వున్నాయి.

సోషలిస్టు రాజ్యాలమధ్య ఉత్పన్నమయ్యే విభేదాలు సాయుధ ఘర్షణద్వారా, లేక యుద్ధంద్వారా పరిష్కరింపబడే స్థితికి దారితీయరాదనేది స్పష్టమే. అవి భేదించవచ్చు; తగాదాపడవచ్చు. కాని తమ మధ్యవచ్చిన తగాదాను శాంతియుతమార్గంలోనే పరిష్కరించుకోవాలి. సోషలిస్టు రాజ్యాలమధ్య తగాదాలు ఉగ్రరూపం ధరించడానికి భౌతిక కారణాలేవీలేవు. ఎందువల్లనంటే, వాటి ఆర్థిక విధానాలు దోపిడీమీద

గాని, దోపిడీ వర్గాల పెత్తనం మీదగాని ఆధారపడి లేవు. అవి శత్రు సంబంధమైన పెట్టుబడిదారీ పోటీలమీద, సంక్షోభాలమీద ఆధారపడి లేవు; సోషలిస్టు సహకారంమీద, శ్రమ విభజనమీద ఆధారపడి వున్నాయి.

ఈ విషయం 'కోమెకాన్' దేశాల (సోషలిస్టు శిబిరానికి చెందిన దేశాలు) కార్యక్రమ ప్రణాళికలో స్పష్టం చేయబడింది.

## కొత్తరకపు విభేదాలు

ఇండియా, చైనాలమధ్య ఉత్పన్నమైన విభేదాలు పూర్తిగా కొత్తరకమైనవి. ఈ తగాదాలో ఒకవైపు సోషలిస్టురాజ్యం ఉంది; రెండోవైపు బూర్జువా రాజ్యం ఉంది. సోషలిస్టురాజ్యంలో కార్మికవర్గం అధికారంలో ఉండి వర్గాలను రద్దుచేస్తూంది. సోషలిజాన్ని నిర్మిస్తోంది. బూర్జువారాజ్యంలో పెట్టుబడిదారీవర్గం అధికారంలో వుండి కార్మికుల్నీ, రైతుల్నీ, మధ్యతరగతులవారినీ దోచుకొంటూంది; దేశంలో పెట్టుబడిదారీ వ్యవస్థను నిర్మిస్తోంది.

ఈ విధంగా, ఆర్థికాభివృద్ధియొక్క దశనుబట్టి, ఈ రెండూ పరస్పర విరుద్ధ దశల్లో వున్నాయి. భారతదేశం సోషలిజాన్ని గమ్యంగా స్వీకరించినప్పటికీ, భారతప్రభుత్వం నిర్మిస్తూన్నది సోషలిజం కాదు, పెట్టుబడిదారీవిధానం—ప్రయివేట్, పబ్లిక్ రంగాల్లో పెట్టుబడిదారీ విధానం.

ఇలాంటి రాజ్యాలు రెండు ఘర్షణపడి, యుద్ధం ప్రజ్వరిల్లితే, బూర్జువా రాజ్యంలో కార్మికవర్గం, కమ్యూనిస్టుపార్టీ, బూర్జువా ప్రభుత్వాన్ని బలపరచకుండా, ఎల్లప్పుడూ బూర్జువా ప్రభుత్వాన్ని వ్యతిరేకించ వలసిందేనా? లేక ప్రస్తుత సందర్భంలోని శ్రామికవర్గ అంతర్జాతీయతదృష్ట్యా, మేము తీసుకున్న రక్షణ నినాదం సరియైనదేనా?

మా తీర్మానాన్ని వ్యతిరేకిస్తున్న కొందరు, మేము తీసుకున్న రక్షణనినాదం, కార్మికవర్గాన్ని, సోషలిస్టు రాజ్యానికి వ్యతిరేకంగా, బూర్జువా ప్రభుత్వం వెనుక సమీకరింప బడేటట్లు చేస్తూందనీ, అందువల్ల అంతర్జాతీయతను ధిక్కరిస్తోందనీ చెబుతున్నారు.

సోషలిస్టు రాజ్యం సర్వగుణ సంపన్నమైనదనీ, ఏ తప్పు చేయదనీ, వస్తుతః దానికి వలసదేశాలుకాని, పరాధీన రాజ్యాలుకాని అవసరం లేదుగనుక, ఏదేశం మీదికీ అది యుద్ధానికి వెళ్ళదనీ, తన మీద యితరులు దాడిచేస్తేనే అది యుద్ధానికి వెళ్తుందనే ఊహాత్మకభావం ఒక సూక్తిగా యీ వాదనలో వుంది. కొత్తగా విముక్తి చెందిన ఒక స్వతంత్రదేశంతో యుద్ధానికి పూనుకోవడం సోషలిజానికి విరుద్ధమైన విషయం. ఈ నూతన యుగంలో సామ్రాజ్యవాద ప్రభుత్వాలతో కూడా అది ఆత్మరక్షణకోసం తప్పితే యుద్ధానికి దిగదు.

అందువల్ల, భారత-చైనాల మధ్య ఏర్పడ్డ తగాదాలలో భారతదేశమే మొదట దాడి చేసిందనీ, ఒక "అక్రమసరిహద్దు" ను తనదిగా చెప్పుకొని ఆక్రమించుకొందనీ, అందువల్లనే సాయుధఘర్షణ వచ్చిందనీ కొందరు చాలా ఘట్టిగా వాదిస్తున్నారు. ఈ విధంగా మన రక్షణనినాదం సరియైనదో, కాదోనిర్ణయించటానికి మొదటదాడి చేసిందెవరు? అనేది ప్రధాన సమస్య అయింది.

కాబట్టి భారతదేశం అమెరికన్ సామ్రాజ్యవాదులకు స్థావరంగా తయారైందనీ, భారతదేశ బూర్జువావర్గం విస్తరణతత్వం గలిగినదనీ రుజువు చేసేటందుకు చైనా పక్షం చాలా శ్రమ తీసుకొంటున్నది. దీన్ని వారు ప్రధాన వాదనగా తీసుకొని, తర్వాత తాము చేసింది శ్రామికవర్గ అంతర్జాతీయత దృష్ట్యా సక్రమమైనదని అభిప్రాయపడుతున్నారు.

## మన వాదన

మన వాదన యిది.

* మొదటి విషయం : మాక్‌మాహన్ రేఖకు దక్షిణ ప్రాంతం మీద దాడిచేయడం అక్రమచర్య. మన పార్టీకి చేసిన వాగ్దానాన్ని ఉల్లంఘించడం; ఆ రేఖను తాము అతిక్రమించబోమని చైనావారు భారత ప్రభుత్వాని కిచ్చిన అవగాహనను కూడా ఉల్లంఘించడమే. ఆ రేఖను బ్రిటిష్ సామ్రాజ్యవాదులు గీసినప్పటికీ, ఆ కారణంవల్ల దాన్ని "అక్రమ" రేఖగా చైనావారు పిలుస్తున్నప్పటికీ, మన దేశంయొక్క

ఇతర సరిహద్దు లన్నిటిమాదరిగానే ఇదికూడా మనకు సంక్రమించిందే చైనావారు బర్మాలో దీన్ని గుర్తించారు; ఇండియా విషయంలోకూడా అలా చేస్తామని వాగ్దానం చేశారు.

* రెండవ విషయం : సరిహద్దుల్నిగురించీ కొన్ని ప్రాంతాల్ని గురించీ ఉత్పన్నమైన తగాదా అంతా తప్పు. ఎందుచేతంటే, చైనాలో సోషలిజం అభివృద్ధిచెందడానికి అవి ప్రధానం కావు. భారత దేశంతో గల స్నేహాన్ని వదులుకోవలసి వచ్చేటంతగా వాటికోసం పోరాడ్డమూ నిరుపయోగమే.

* మూడవ విషయం : సరిహద్దుల విషయంలో ఒక జాతీయ బూర్జువా ప్రభుత్వం సహజంగా ప్రదర్శించేలాంటి గుడ్డి జాతీయతను ఒక సోషలిస్టు ప్రభుత్వం ప్రదర్శించ కూడదు. ఇది దాని వర్గస్వభావానికీ అభివృద్ధి స్థాయికీ వ్యతిరేకం. ఆ సమస్యపై సంఘర్షణకు దిగడం, దానిని పొడిగించడం అసలే సమర్థనీయంకాదు. నిజం చెప్పవలసివస్తే, బూర్జువా వర్గంలో నాయకత్వం వహిస్తున్న భాగం వేర్వేరు సమయాల్లో సామ్య మైన వాస్తవికదృష్టిని ప్రదర్శించింది; అభివృద్ధి నిరోధకులు రెచ్చగొట్టిన గుడ్డి ఆవేశాల్ని వారు వ్యతిరేకించారు.

* నాల్గవ విషయం : వారు చెబుతున్నట్లు, మొదట సోషలిస్టు రాజ్యాలమీద దాడి జరిగిందనుకున్నప్పటికీ, తన్ను తాను జయ ప్రదంగా రక్షించుకున్నతర్వాత, బేరంలో తానేమీ నష్టపడకుండా వున్నతర్వాత, దాడి జరిగినా కేంద్రం దాటి వెళ్ళవలసిందికాదు. మాక్‌మాహన్ రేఖనుగాని, లడక్‌లోవున్న రేఖనుగాని దాటియుండ వలసింది కాదు.

* ఐదవ విషయం : ఒక సోషలిస్టురాజ్యం ఆవిధంగా చేయడం వల్ల ఎదుటిరాజ్యంలో అభివృద్ధి నిరోధకులు బలపడతారు. అంతర్జాతీయత బలహీన పడుతుంది. సామ్రాజ్యవాదుల కుట్రలకు వీలుకలుగు తుంది.

సోషలిస్టురాజ్యం యీ వాస్తవాలను చూడకపోతే, బూర్జువా రాజ్యంలోని కమ్యూనిస్టుపార్టీ, ఆ తప్పును సరిదిద్దడం దాని కర్తవ్యం. అది తన జాతీయ బూర్జువా వర్గంతో చేతులు కలిపి, ఐక్యసంఘటన

నిర్మించాలి; దేశరక్షణ అనే నినాదం క్రింది ప్రజాస్వామ్యంలోని జాతీయ భావాన్ని గౌరవించాలి.

అలా చేయడంవల్ల కార్మికవర్గము, పార్టీ ఏమిసాధిస్తాయి? కొందరు అనుకొంటున్నట్లు అది శ్రామికవర్గ అంతర్జాతీయతకు స్వస్తి చెప్పడ మవుతుందా? బూర్జువా వర్గానికితోకగా తయారు కావడమవుతుందా? కార్మికవర్గాన్ని అన్యవర్గ సిద్ధాంతానికి బలియివ్వడమవుతుందా? తాను అన్యవర్గ ప్రయోజనాలకు దాసోహం చేయడ మవుతుందా? వర్గపోరాటాన్ని, సామ్రాజ్య వ్యతిరేకపోరాటాన్ని విడనాడ్డ మవుతుందా?

మన తీర్మానంలోని ఇరవైయొక్క అంశాలను కట్టుబడివుంటూ, వాటిని అమలుజరపడానికి పేర్కొనబడిన ఏడుఅంశాలనూ మార్క్సిజం-లెనినిజం బోధించే వర్గదృక్పథం నుంచి అమలు జరిపితే, అలాంటి ప్రమాదం ఎన్నడూ జరగదు. రక్షణ నినాదాన్ని మాత్రమే తీసుకొని మిగతా 21 అంశాలను విస్మరిస్తే, అంతర్జాతీయతను విడనాడడం, అభివృద్ధినిరోధక బూర్జువా జాతీయతకు దాసోహం చేయడం జరుగుతుంది. లేకపోతే, అట్టి ప్రమాదం జరగదు.

భారతదేశం కొత్తగా స్వాతంత్ర్యం పొందిన దేశం. మన రక్షణ నినాదానికి అత్యంత ప్రధానమయిన ప్రాతిపదికల్లో ఒకటి యిదే. అంతేకాదు; జాతీయ బూర్జువావర్గ నాయకులు స్వాతంత్రోద్యమానికి నాయకత్వం వహించియున్నారు. విదేశీ పెట్టుబడులకోసం, సామ్రాజ్యవాదుల సహాయంకోసం వారెంత ఉవ్విళ్ళూరుతున్నా, సామ్రాజ్యవ్యతిరేక స్వభావాన్ని వారు కలిగియున్నారు. అందువల్ల ప్రజాసామాన్యం ఏ పాత పెట్టుబడిదారీ దేశంకన్నా ఏ సామ్రాజ్యవాద దేశంతోకన్నా, జాతీయ బూర్జువావర్గ నాయకత్వముతో, నెహ్రూ సారధ్యంక్రిందవున్న జాతీయ బూర్జువా ప్రభుత్వంతో ఎక్కువ సాన్నిహిత్యాన్ని కలిగియున్నారు.

ఈ జాతీయ బూర్జువా ప్రభుత్వం తటస్థవిధానం అవలంబిస్తోంది. ప్రస్తుతం యిది సామ్రాజ్యవ్యతిరేక స్వభావం గలది. ఈ ప్రభుత్వం శాంతి శిబిరంలో ఉంది.

మన దేశం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని కలిగియుంది. అది సైనిక నియంతృత్వంకాదు, ప్రజలు ఫాసిస్టు నియంతృత్వంలో ఉన్నట్లు లేరు. వారిలో అసంతృప్తి ఆ స్థాయిలో లేదు. భారత జాతీయ కాంగ్రెసు కొమింటాంగ్ మాదిరిగా తయారు కాలేదు. నెహ్రూ, జంగ్ కై-షేక్ కాడు ఇకముందు ఏమి జరుగుతుందనేది అప్రస్తుతం.

పార్టీ దేశరక్షణకై ఐక్యసంఘటన నిర్మించి, యితరకర్తవ్యాలను కూడా నిర్వర్తించినట్లయితే, ప్రజల్లో అభివృద్ధినిరోధకశక్తుల పలుకుబడి సన్నగిలుతుంది. త్వరితంగా పెరిగే సామ్రాజ్యవాదుల ప్రాబల్యం నశిస్తుంది. కమ్యూనిస్టు సిద్ధాంతం కాపాడబడుతుంది, సోషలిస్టు దేశాలు కొత్తగా స్వాతంత్ర్యంపొందిన దేశాలకు ఆప్తమిత్రులు అనే ఖ్యాతి ప్రజల్లో నిలుస్తుంది.

చివరకు యిది భారతప్రజల ప్రయోజనాల్నీ, సామ్రాజ్య వ్యతిరేక ధోరణుల్నీ, సోషలిజాన్నీ పటిష్టం చేస్తుంది. మన తీర్మానంలోని 21 అంశాల ప్రాధాన్యత అలాంటిది.

ఈ దృష్టితో ఆలోచిస్తే, మన రక్షణ నినాదం సరియైనదేననీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకు అనుగుణమైనదనీ ("ఆంతరంగికం" గానూ "బాహ్యం"గానూ కూడ) స్పష్టమవుతుంది.

ఐక్యసంఘటన అంటే అర్థం, బూర్జువావర్గానికి తోకగా తయారవడమూ కాదు; ఆ వర్గంలో కలిసిపోవడమూ కాదు. ఐక్యసంఘటన కూడా ఒక వర్గపోరాట రూపమే.

## తీర్మానాన్ని మొత్తంగా చూచినప్పుడు

పై 21 అంశాల్లో మన పోరాటస్థానం నిలిచేవుంది. స్వార్థపర వర్గాలకూ, అధిక ధరలకూ, విపరీత లాభాలకూ వ్యతిరేకంగా, కార్మికుల హక్కులను కాపాడేందుకు, వారి జీవన ప్రమాణాన్ని రక్షించేందుకు పోరాడితీరుతామని అవి చెబుతున్నాయి; దానితో పాటు యుద్ధోన్మాదాన్నీ, చైనా ప్రజలపట్ల ద్వేషాన్నీ ఎదుర్కోవాలని కూడా అవి చెబుతున్నాయి. ఈ విధంగా పార్టీ ఐక్యసంఘటనలో

వుంటూనే, అన్యవర్గం తోకపట్టుకు పోకుండా, తన స్వతంత్రపాత్ర నిర్వహించగలుగుతుంది.

తటస్థ విధానం, దాన్ని కాపాడేందుకు జరిగే పోరాటం సామ్రాజ్యవాదప్రయోజనాలకు వ్యతిరేకమైనప్పుడు, బూర్జువావర్గంలో సైతం కొన్నిభాగాలు తటస్థవిధానానికి అనుకూలంగా వున్నప్పుడు, ఆ వర్గంతో ఐక్యసంఘటన అంతర్జాతీయతకు వ్యతిరేకమెలాఅవుతుంది? సామ్రాజ్యవాదానికి సహాయం చేయడ మెలాఅవుతుంది ? ఈ విధంగా యెన్ని ప్రశ్నలైనా ఉత్పన్నం కావచ్చు; వాటికి సమాధానాలు చెప్ప వచ్చు.

అభివృద్ధి నిరోధకులు తమ బాధ్యతనుంచి తప్పించుకోడానికి యుద్ధాన్ని రెచ్చగొట్టడానికీ, తమ అభివృద్ధి నిరోధక లక్ష్యాలను సాధించుకోడానికి రక్షణ నినాదం తోడ్పడుతుందంటూ కొందరు వాది స్తున్నారు.

ఇదే నిజమైతే, అఖిలపక్ష జాతీయ రక్షణకమిటీలలోకి మనల్ని ఎందుకు తీసుకోలేదు? అభివృద్ధి నిరోధకులు అన్ని పార్టీలకన్నను మన పార్టీమీదనే ఎక్కువగా ఎందుకు దాడిచేస్తున్నారు? విదేశీ సామ్రాజ్య వాదవర్గాలు మనమీద ఎందుకు దాడి సాగిస్తున్నాయి? పార్టీ తీర్మా నాన్ని పూర్తిగా, 21 అంశాలతోనూ బలపరచిన కమ్యూనిస్టులే ఎక్కు వగా ఎందుకు అరెస్టు చేయబడ్డారు?

ఎందుచేతంటే, ఆ 21 అంశాలు వాటి నెలా అమలు జరపాలో తెలియజేసే ఏడుఅంశాలు అభివృద్ధినిరోధకులకు ఎట్టి అవకాశాన్నిఇవ్వ లేదు. మన వర్గ దృక్పథానికి అవి స్వస్తి చెప్పలేదు. మొత్తం తీర్మానం ఎలా అమలు జరపబడిందో, ఆ తర్వాత పరిస్థితి ఎలా ఉందో మనల్ని విమర్శించేవారు గమనించినట్లు లేదు: భౌతిక పరిస్థితుల్ని వారు చక్కగా తెలుసుకున్నట్లు లేదు.

ఈ కారణాలన్నిటివల్ల మన రక్షణ నినాదం, దానితో బాటు తీర్మానంలోని 21 అంశాలూ అభివృద్ధి నిరోధక బూర్జువా జాతీ యతను బలపరచలేదు; సరియైన, ఫలప్రదమైన జాతీయతను అది వ్యక్తం చేసింది. ప్రస్తుత దశలో భారతదేశం వంటి దేశంలో

కార్మికవర్గ పార్టీ అనుసరించవలసిన శ్రామిక వర్గ అంతర్జాతీయతకు అది అనుగుణంగానే వుంది.

ఈ సందర్భంలో ఒక విషయాన్ని నొక్కి చెప్పవలసి వుంది. జాతీయ సమితి నవంబరులో సమావేశమయ్యేనాటికి ఎవరూ అరెస్టు చేయబడలేదు. నాయకత్వంలో వున్న కామ్రేడ్స్ అందరూ ఆ సమావేశానికి హాజరయ్యారు. అప్పుడు మెజారిటీ తీర్మానంతో బాటు రెండు ప్రత్యామ్నాయ తీర్మానాలు కూడా ప్రతిపాదింపబడ్డాయి. ఆ రెండు ముసాయిదాల్లో రక్షణ నినాదం అంగీకరింపబడింది. ఒక ముసాయిదాలో ఇలా వుంది :

"మన సరిహద్దులను రక్షించడంలో తమ ప్రాణాలను అర్పించిన వారికి జాతీయ సమితి జోహారు లర్పిస్తూంది. కమ్యూనిస్టుపార్టీ ఎల్లప్పుడూ దేశ రక్షణకై నిలబడుతూనే వచ్చింది. మన సరిహద్దుల రక్షణను పటిష్టం చేయాలనే కోరుతూ వచ్చింది. నేటి పరిస్థితుల్లో భారత దేశం ఏకపక్షంగా యుద్ధాన్ని విరమించే సమస్య లేనేలేదు. బలాధిక్యతకు తలవొంచే సమస్యా లేదు."

ఈ మాటలు నిజమైనవీ, నిజాయితీతో కూడుకొన్నవీ ననడంలో సందేహం లేదు

రెండవ ముసాయిదాలో ఇలావుంది :

"దేశాన్ని రక్షించడంలో చాలా కష్టాలను ఎదుర్కోవలసి వచ్చిన భారతీయ సైనికులకూ, సైన్యాధికారులకూ, జాతీయసమితి హృదయపూర్వకంగా జోహారులర్పిస్తూంది. దేశాన్ని రక్షించేటందుకు వీరోచితంగా పోరాడుతూ తమ అమూల్యమైన ప్రాణాలను బలియిచ్చిన వారందరికీ శ్రద్ధాంజలి ఘటిస్తూంది. ఈవిధంగా ఆత్మబలిదానం చేసినవారి కుటుంబాలకు హృదయపూర్వక సానుభూతిని తెలియజేస్తూంది.

"దేశరక్షణకు అవసరమైన చర్యలు తీసుకుంటూనే సరిహద్దు సమస్యను శాంతియుత సంప్రతింపుల ద్వారా పరిష్కరించడానికి భారత ప్రధాని జవహర్లాల్ నెహ్రూ అనుసరిస్తున్న విధానాన్ని జాతీయ సమితి హైదరాబాదు సమావేశం బలపరుస్తూ తీర్మానించింది.

"జాతీయసమితి చేసిన ఆ ప్రకటనను ఆధారం చేసుకొని కేంద్ర కార్యదర్శి వర్గం అక్టోబరు 17 వ తేదీన ఒక తీర్మానం చేసింది. అందులో, మాక్‌మాహన్ రేఖకు దక్షిణంగావున్న ప్రదేశాన్ని రక్షించే టందుకు భారత ప్రభుత్వం తీసుకునే చర్యలన్నీ న్యాయమైనవేనని తెలియజేసింది. చైనా సైన్యాలు మాక్ మాహన్ రేఖకు దక్షిణంగా వున్న ప్రదేశంలోకి వచ్చి, నేఫాలోను, లడక్‌లోనుకూడ ముందుకు సాగిపోతూండడంవల్ల జాతీయసమితి భారతప్రభుత్వంయొక్క రక్షణ చర్యలన్నిటినీ మరింతగా బలపరుస్తూంది.

"మనదేశంయొక్క హుందాతనానికీ, స్వాతంత్ర్యానికీ, మూల విధానాలకూ అనుగుణంగా రక్షణ కృషిని మెరుగుపరచేటందుకు సకల చర్యలు తీసుకోబడతాయని జాతీయ సమితి ఆశిస్తోంది."

ఈ మాటలుకూడ నిజమైనవే; నిజాయితీతో కూడుకొన్నవే.

కాబట్టి ఆనాడు రక్షణ నినాదం సరియైనదా కాదా అనే విష యంలో జాతీయ సమితి సభ్యుల్లో అభిప్రాయ భేదాలే లేవు. దేశాన్ని రక్షించుకోవాలనే నినాదంపై జాతీయ సమితి ఒకే అభిప్రాయాన్ని కలిగివుంది. దీని అర్థం జాతీయ సమితి ఏకగ్రీవంగా అభివృద్ధి నిరోధకు లకు అవకాశం కలిగించిందనా ? వారు తమ బాధ్యతనుంచి తప్పించు కొనేటందుకు వీలు కలిగించిందనా ? శాంతియుత సప్రతింపులు అవసరమనే నినాదాన్ని జాతీయసమితి నడనాడిందనా ? లేక దాన్ని నొక్కి చెప్పలేదని అర్థమా ? కానే కాదు.

అందువల్ల మెజారిటీ తీర్మానం మాత్రమే మార్క్సిజానికి వ్యతిరేకమైనదనీ, శ్రామికవర్గ అంతర్జాతీయతకు ద్రోహం చేసిందనీ, జాతీయ దురహంకారంతో అది నిండివుందనీ, మొత్తం పార్టీనే బూర్జువా ప్రభుత్వానికి తోకగా చేసిందనీ విమర్శించవలసిన అవసర మేమివచ్చింది ? ఆవిధంగా భారతదేశంలోని కమ్యూనిస్టుల్ని ఎందుకు 'పవిత్రులు – అపవిత్రులు' అనీ, 'నిజమైన మార్క్సిస్టులు – బూటకపు మార్క్సిస్టులు' అనీ విభజించాలి ?

## చీలికలను పెంచడానికి చైనావారి తోడ్పాటు

"దేశరక్షణ"ను గీటురాయిగా చేసుకొని, చైనా – సోవియట్ ఉదంతాన్ని ఆదర్శంగా తీసుకొన్నట్లయితే, మన మందరం "నిజమైన" వారితో సహా అపవిత్రులమే! ఇట్టి వాదనల ద్వారా చైనా నాయకులు మార్క్సిజం–లెనినిజంకి సహాయంచేయడంలేదు; పైగా మనపార్టీలో చీలికలు పెంచుతున్నారు. కాని, ఈ విషయంలో వారిని ఒప్పించడంఎలాగు?

ఈ విధంగా సిద్ధాంతాలను గురించీ, పాత్యగ్రంధాలను గురించీ దీర్ఘమైన వాదనలు పూర్తిఅయాక ఒకే ఒక విషయం ప్రముఖంగా పరీక్షకు నిలుస్తుంది. అదేమంటే, రెండు మిత్రదేశాల ప్రజలు ఒకరి నొకరు కాల్చి చంపుకున్నారు. ఇది అత్యంత బాధాకరమైన విషయం. కష్టజీవులైన ప్రజలు ఒండొరులు కాల్చి చంపుకోవడం ద్వారానే యుద్ధాలు ఎల్లప్పుడూ జరుగుతాయి.

తుపాకిగుండ్లు ఏ నిమిషంలో మాక్‌మాహన్ రేఖను లేవా, లడక్‌లో సరిహద్దును దూసుకొని వెళ్ళాయో, ఆ నిమిషంలోనే ఉభయ పక్షాల్లో శ్రామికవర్గ అంతర్జాతీయత రూపుమాసిపోయింది. ఏ పక్షం యొక్క మ్యాపులు సరియైనవో, ఏ పార్టీ యొక్క నినాదాలు సరియైనవో తెలుసుకొనేందుకు అవకాశమే లేకపోయింది.

పైకి యిది చాల స్వల్పవిషయంగా కనబడవచ్చు. కాని, సోషలిస్టుయుగంలో, ప్రపంచ యుద్ధాలు నిర్మూలింపబడే యుగంలో, ఇండియా–చైనాలవంటి దేశాలమధ్య సరిహద్దుయుద్ధాలను నివారించడం యింకా సులభమైన విషయం; అభివృద్ధి నిరోధకులొక దేశంలోను, పిడివాదులు రెండవ దేశంలోను ఎంత కవ్వించినప్పటికీ, ఈ సమస్యను శాంతియుత సంప్రతింపుల ద్వారా పరిష్కరించడం సాధ్యమే.

## భారతదేశం 1950 నుంచీ దురాక్రమణ దేశమేననే చైనా వాదన

రెండవ వివాదగ్రస్తమైన సమస్య దురాక్రమణకు సంబంధించినది.

చైనా దురాక్రమణ దేశమని ఇండియా అంటూంది; అలాగే ఇండియా దురాక్రమణ దేశమని చైనా అంటూంది. సోషలిస్టుదేశం

దురాక్రమణ చేయజాలదనీ, భారతదేశంకూడా యుద్ధాన్ని కోరడం లేదని యిదివరకొక తీర్మానంలో మేము తెలియజేశాం. కాని నవంబరు తీర్మానం (1962) చైనాను దురాక్రమణ దేశంగా పేర్కొంది. ఈ విధంగా, నూతన పరిణామాలను దృష్టిలో వుంచుకొని, యీ సమస్యపై యిదివరలో మనం అనుసరించిన వైఖరిని దిద్దుకున్నాం.

ఒకానొక ప్రదేశం వివాదగ్రస్తంగా వుంటూ, ఒప్పందంద్వారా సరిహద్దులు నిర్ణయింపబడనప్పుడు, వివాదగ్రస్తమైన సరిహద్దుల్ని దాటడం, లేదా వివాదగ్రస్తమైన ప్రాంతంలో ప్రవేశించడం దురాక్రమణ అనిపించుకోదని కొందరు అంటున్నారు. ఈ తర్కాన్ని మనం అంగీకరిస్తే, భారతదేశమూ దురాక్రమణ దేశంకాదు. చైనా దేశమూ దురాక్రమణ దేశంకాదు.

కాని, చైనా నాయకు లీవాదనను అంగీకరిస్తున్నారా ? లేదు. భారతదేశం 1950 నుంచీ పెద్దయెత్తున పదేపదే దురాక్రమణ చర్యలకు పూనుకొంటూ వచ్చిందని వారంటున్నారు. చైనా, అమెరికన్ సామ్రాజ్యవాదులు రెచ్చగొట్టిన కొరియా యుద్ధంలో యిరుక్కొని వున్న సమయంలో "చైనా భూభాగంలో 90,000 చదరపు కిలోమీటర్లకు పైగా వున్న భూమిని" – అంటే నేఫా ప్రాంతాన్ని – భారతదేశం 1950 లో బలాత్కారంగా లాక్కుందనీ, చైనా నాయకులంటున్నారు.

తర్వాత వారిలా అన్నారు : బ్రిటిష్ సామ్రాజ్యవాదులు చేయ సాహసించని పనిని భారత పాలకవర్గాలు సిగ్గువిడిచి చేశాయి. చైనాపై భారతదేశం చేసిన మొదటి దురాక్రమణ యిది.

రెండవ దురాక్రమణ, భారతదేశం తన విస్తరణ వాంఛను ఫలప్రద మొనర్చుకోడానికి "టిబెట్ లో తిరుగుబాటును రెచ్చగొట్టడం."

మూడవ దురాక్రమణ, ఇండియా – చైనాలమధ్య సరిహద్దులను చూపే మ్యాపులను భారతదేశం యథేచ్ఛగా, ఏకపక్షంగా మార్చివేసి, తూర్పుప్రాంతంలో 33,000 చదరపు కిలోమీటర్లు, మధ్య ప్రాంతంలో 2000 చదరపు కిలోమీటర్లు తనవిగా చెప్పుకోడం. ఈ భూభాగం "ఎల్లప్పుడూ చైనాపరిపాలనక్రిందేవుంటూంది"అని చైనావారంటున్నారు.

నాల్గవ దురాక్రమణ, "అనేక ప్రదేశాల్లో మాక్‌మాహన్ రేఖ అని పిలువబడే సరిహద్దును దాటడం."

భారతదేశం చైనా దురాక్రమణనుగురించి మాట్లాడడం ఆరంభించడానికి చాలాకాలం ముందే భారతదేశం చైనామీద పెద్ద దురాక్రమణలు జరిపినట్లు, ప్రధాన దురాక్రమణలు జరిపినట్లు, చెప్పబడుతోంది. వారు చెప్పే కథ 1950 లోనే ప్రారంభమైంది. కాని 1954 లో ఉభయదేశాలమధ్య మిత్రత్వ సంధి జరిగిందనే విషయాన్ని వారు గుర్తించినట్లు లేదు.

ఉభయదేశాల కోర్కెల్లోకి మేం వెళ్ళబోవడంలేదు. ఇక్కడ గమనించవలసిన విషయ మేమంటే, దురాక్రమణనుగురించిన మాటలు అనవసరమని చైనా నాయకులు ఒప్పుకోలేదు తగాదా ఒకటి ఉంది గనుక దాన్నెలా పరిష్కరించవచ్చో చూదాంఅన్నారు వారు. అప్పుడు భారత ప్రభుత్వం సరిగ్గా ఇదేవిధంగా ప్రత్యారోపణ చేసింది. అంతకన్నా ఎక్కువ రుజువులతో తన వాదనలను బలపరచుకొంది. ఉభయదేశాల ఉన్నతాధికారులు సమర్పించిన నివేదికల్లో యీ విషయం స్పష్టంగా గోచరిస్తుంది.

"మొదట్లో మా పార్టీ దురాక్రమణ అనే పదాన్ని ఏ పక్షానికీ ఉపయోగించగూడ దనుకొంది. ఎందుచేతంటే సోషలిస్టు చైనా బుద్ధిపూర్వకంగా, తెలిసివుండే దురాక్రమణ జరుపుతుందని మేము అనుకోలేదు. భారతదేశం విషయ మేమంటే, భారత ప్రభుత్వం శాంతి విధాన మవలంబిస్తూండడంచేత, స్నేహమార్గం అవలంబిస్తూండడంచేత చైనాపై దురాక్రమణ జరిపే ఉద్దేశంగాని, కారణంగాని లేదని మేము అభిప్రాయపడ్డాం.

కాని, 1962 అక్టోబరులో చైనా మాక్‌మాహన్ రేఖనుదాటి వచ్చినప్పుడు, అంటే తన వాగ్దానాన్ని ఉల్లంఘించినప్పుడు, మేము మా అభిప్రాయాన్ని మార్చుకున్నాం; దాన్ని దురాక్రమణగా పరిగణించాం.

చైనాయొక్క చర్యను అలా వర్ణించడం సరియైనదేనా అని కొందరు ప్రశ్నిస్తున్నారు. ఒక సోషలిస్టు దేశం తీసుకున్న చర్యను–అది తప్పేననుకున్నప్పటికి – వర్ణించడానికి దురాక్రమణ అనే పదాన్ని ఉపయోగించవచ్చునా – అని మళ్ళీ కొందరడుగుతున్నారు.

ఈ సమస్యపై సుదీర్ఘమైన తాత్విక చర్చల్లోకి వెళ్ళనవసరంలేదు. ఒక దేశంయొక్క సరిహద్దును మరొక దేశం చాటడమో, లేక మరొక దేశం తనదని చెప్పుకొనే భూభాగంలో ప్రవేశించడమో మాత్రమే అయితే, అది దురాక్రమణఅనిపించుకోదు–నిజమే. వర్గదృష్టితోఆలోచిస్తే, ఆ శబ్దానికి అంతకన్న విశాలమైన అర్థంవుంది.

19, 20 శతాబ్దాలలో పెట్టుబడిదారీ — సామ్రాజ్యవాదదేశాల చరిత్రను పరిశీలిస్తే, ఒకటి స్పష్టంగా బోధపడుతుంది. పెట్టుబడిదారీ – సామ్రాజ్యవాద దేశాలు ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికాలలో సాగించిన విస్తరణలన్నీ దురాక్రమణలే. వలస దేశాలను స్వాధీన పరచుకొనేందుకు వాటిని ఉపయోగించుకొనేందుకు పెట్టుబడుల్ని ఆ దేశాలకు ఎగుమతి చేసేందుకు, పెట్టుబడిదారీ గుత్తాధికార సంస్థలకు మార్కెట్లు, ముడి పదార్థాలు సంపాదించేందుకు జరిగిన యుద్ధాలన్నీ దురాక్రమణ యుద్ధాలే.

అప్పటికి సోషలిస్టుదేశాలులేవు. అట్టి దురాక్రమణ యుద్ధాలకు వ్యతిరేకంగా జరిగినపోరాటంలో మొట్టమొదటి సోషలిస్టు విప్లవం— అక్టోబరు విప్లవం — ఆవిర్భవించింది.

పెట్టుబడిదారీ – సామ్రాజ్యవాద ప్రభుత్వాలు తమ ఆర్థిక వ్యవస్థను సంక్షోభాలనుంచి రక్షించుకొనేందుకు దురాక్రమణయుద్ధాలు చేస్తాయి. కాని సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ అట్టి సంక్షోభాలవల్ల నష్ట పడదు. ఎందువల్ల అంటే, ఉత్పత్తిశక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య ఏర్పడే వైరుధ్యాలవల్ల ఆర్థిక సంక్షోభాలు ఏర్పడతాయి; ఈ సంక్షోభాలు పెట్టుబడిదారీ విధానంలోనే సంభవిస్తాయి; సోషలిజంలో కాదు.

# సోషలిస్టు సూత్రాలకు దురాక్రమణ వ్యతిరేకం

అందువల్ల ఇతర దేశాలమీద, ఇతర దేశాల ప్రజలమీద దురాక్రమణ జరపవలసిన అవసరం సోషలిస్టుదేశాలకు లేదు. వాటి అభివృద్ధిని శాసించే సూత్రాలకు అది వ్యతిరేకం. సోషలిజం అభివృద్ధి చెందేకొద్దీ దురాక్రమణ వెనక్కుతగ్గుతుంది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచంలో అనేక దేశాలు స్వతంత్రం సంపాదించుకోడం, జర్మనీ – ఇటలీ – జపాన్ – సామ్రాజ్యవాద ప్రభుత్వాలు ఓడిపోవడం, ఆంగ్లో – అమెరికన్ సామ్రాజ్యవాదం బలహీనపడ్డం, ప్రపంచసోషలిస్టు వ్యవస్థ బలపడ్డం – యీ పరిణామాలన్నీ దీన్నే నిరూపిస్తున్నాయి. ఈ ప్రపంచ పరిణామాల్లో సోషలిస్టు చైనా ఆవిర్భావం ఎంతో గొప్ప ప్రాధాన్యంగల విషయం.

సామ్రాజ్యవాదులు ఈజిప్టు, సిరియా, ఉత్తర వియత్నాం, ఉత్తర కొరియా, లావోస్ మొదలైన దేశాలపై జరిపిన దురాక్రమణ యుద్ధాలు పూర్తిగా విఫలమయ్యాయి. అనేకదేశాలు అంతకంతకు అధికసంఖ్యలో సామ్రాజ్యవాదుల బానిసత్వంనుంచి విముక్తిచెందాయి; అంతేగాని, దురాక్రమణ ఫలితంగా నయా వలసవిధానానికి బలిఅయి పోలేదు.

సామ్రాజ్యవాదులు ప్రజల మనోఫలకాలనుంచి తమ పాత చరిత్రను తుడిచివేయలేక, స్వాతంత్రోద్యమాలను అణచేందుకు తాము జరిపిన దురాక్రమణలను, విప్లవ విద్రోహ తిరుగుబాట్లను సమర్ధించుకోలేక స్వాతంత్రోద్యమాలకు సోషలిస్టుదేశాలు చేసే సహాయాన్ని "దురాక్రమణ"గా ఐక్యరాజ్యసమితి చర్చల్లో వర్ణిస్తున్నారు.

ఇలాగే నిరంకుశ ప్రభువులమీద అమెరికా ఏజెంట్లుగా పనిచేసే నియంతలమీద ప్రజలుచేసే విప్లవ తిరుగుబాట్లను కమ్యూనిస్టుల "అంతరంగిక దురాక్రమణ" అని ఆగ్నేయాసియా కూటమివంటి యుద్ధ ఒడంబడికల్లో వర్ణించుతున్నారు.

దురాక్రమణ అనే శబ్దం ఇన్ని అర్థాల్లో ఉపయోగింపబడుతోంది. కాని, మా నిర్వచనాల్లో యీ అర్థాలేవీ మా మనస్సుల్లోలేవు. చైనా

దురాక్రమణను గురించి మేము చెప్పినప్పుడు, ప్రజలంతా అనుకునే అర్థంలో ఆమాటను వాడేం. చైనా భారతదేశ సరిహద్దుల్ని అతిక్రమించిందనీ, సాయుధబలాలతో దండయాత్ర చేసిందనీ చెప్పడానికే మేము ఆమాటవాడేం. మన భూభాగంలోకి అది వచ్చిందనీ, దండయాత్ర జరిపిందనీ, అతిక్రమించిందనీ, ఆక్రమించుకుందనీ, దురాక్రమణ జరిపిందనీ – అనేక మాటలద్వారా మేము యీ ఘటనను వర్ణించాం.

## సామాన్య అర్థంలో దురాక్రమణ

పెట్టుబడిదారీ – సామ్రాజ్యవాద వ్యవస్థలలోవలె చైనా భారత భూభాగాన్ని అతిక్రమించడం దురాక్రమణ కాకపోయినా, ప్రజల పరిభాషలో అది దురాక్రమణేనని మేము అభిప్రాయ పడుతున్నాం.

చైనా చర్యను వర్ణించే సందర్భంలో సోషలిస్టుదేశాలూ, ఇతర దేశాల కమ్యూనిస్టుపార్టీలూ దురాక్రమణ అనే శబ్దాన్ని వాడ్డం లేదు కదా – అని కొందరంటున్నారు. కాని, ఇండియా విషయంలో కూడా అవి దురాక్రమణ అనే మాటను ఉపయోగించడంలేదు. అలా ఉపయోగించక పోవడంలో వారికిగల కారణాలు వారికున్నాయని మేము అభిప్రాయపడుతున్నాం. సోషలిస్టు దేశాలమాట అలా వుంచుదాం. ఐక్య అరబ్బు రిపబ్లిక్ ప్రధాని ఆలీసాబ్రీ సైతం ఆ పదాన్ని ఉపయోగించ లేదు. ఆయన భారత దేశంలో వున్నప్పుడు కొందరు భారతీయ విలేకరులు ఆయనమీద అసభ్యమైన ఒత్తిడి తీసుకువచ్చినప్పటికీ, ఆ శబ్దాన్ని ఉపయోగించడానికి ఆయన నిరాకరించాడు.

వారా శబ్దాన్ని ఏ ఒక పక్షం విషయంలోనైనా ఉపయోగిస్తే తాము యీ తగాదాలో తలదూర్చినట్లవుతుందని వారు అభిప్రాయపడి వుండవచ్చు; ఇది సమస్యా పరిష్కారానికి తోడ్పడదని వారు భావించియుండవచ్చు. నిజం చెప్పవలసివస్తే వారు ఆ శబ్దాన్ని ఉపయోగించియుంటే పరిస్థితి మరింత అధ్వాన్నమయ్యేదేమో.

అయినప్పటికీ సోవియట్ యూనియన్ యీ తగాదాలో తటస్థ వైఖరి అవలంబించడాన్ని చైనా నాయకులు తీవ్రంగా ఆక్షే

పించారు. టాస్ ప్రకటనలో సోవియట్ వైఖరి వ్యక్తం చేయబడింది. ఈ తగాదాలో తాము ఏ పక్షం తరఫునా లేమనీ, ఉభయ దేశాల స్నేహాన్ని తాము వాంఛిస్తున్నామనీ సోవియట్ యూనియన్ తెలియ జేసింది. ఈ తగాదాపట్ల తాము ఆందోళన చెందుతున్నామనీ, ఉభయ పక్షాలూ శాంతియుత సంప్రతింపులద్వారా దీన్ని పరిష్కరించుకోగల వని ఆశిస్తున్నామనీ స్పష్టం చేసింది. ఉద్రిక్తతను పెంచుతున్నందుకు సామ్రాజ్యవాదులను గర్హించింది.

సోషలిస్టు శిబిరానికి చెందిన ఒకదేశం ఆవిధంగా దురాక్రమణ అనే శబ్దాన్ని ఉపయోగించడం సమర్థించుకోడానికి వీలులేని విషయం. అలా ఉపయోగించడంవల్ల అంతర్జాతీయ రాజకీయ సంబంధాల్లో అవాంఛనీయమైన చిక్కులు చాలా వస్తాయి. కాని ఏ కారణాలవల్ల అవి ఆ వైఖరి నవలంబించినప్పటికీ, భారత కార్మికవర్గపార్టీ అయిన మేము ప్రత్యక్షంగా ఆ ఘటనలతో సంబంధం కలిగియుండి, పార్టీ మీదా, ప్రజలమీదా, మొత్తం దేశం మీద వాటి ఫలితాలను అనుభ వించ వలసి వచ్చింది. అట్టి పరిస్థితుల్లో మేము ఏది సరియైనదను కున్నామో, ఏది అవసరమనుకున్నామో అది చేశాం.

అంతేకాదు. చైనానాయకులు యెంతవరకు వెళ్ళవచ్చో ఎవరూ చెప్పలేని పరిస్థితి అది. తమ పొరుగుదేశాలు గత నూరు సంవత్సరా ల్లోనూ చేసుకున్న ఒడంబడికలను గురించి – వాటిని "సరిదిద్దుకోవా ళని" చరిత్ర కోరుతోంది – ఆ విధమైన శబ్దాలను ఉపయోగించడంలో యింకా ఏ అర్థాలు టాయో ఎవరూ చెప్పలేని పరిస్థితి అది.

హాంగ్‌కాంగ్, మకావోల విముక్తికి సంబంధించిన సమస్యలను అమెరికా కమ్యూనిస్టుపార్టీ లేవనెత్తినప్పుడు, చైనా కమ్యూనిస్టుపార్టీ సైతం ఇలా జవాబుచెప్పింది :

"మే మొక ప్రశ్న అడుగుతున్నాం. మీరు ఈ విధమైన సమస్య లను లేవనెత్తడంలో, అసమాన ఒడంబడికలకు సంబంధించిన సమస్య లన్నిటినీ లేవనెత్తాలనే మీ ఉద్దేశమా? అవన్నీ మొత్తంగా పరిష్క రింపబడాలని మీ అభిప్రాయమా? దానివల్ల కలిగే ఫలితా లెలా వుంటాయో ఎప్పుడైనా మీ బుర్రలతో ఆలోచించారా? దీనివల్ల

మీకు మంచికలుగుతుందని నిజంగా నమ్ముతున్నారా ?" ("అమెరికా కమ్యూనిస్టుపార్టీ ప్రకటనపై వ్యాఖ్య".)

మా తీర్మానంలో యింకొక అంశం ఉంది. అది మా పార్టీ మిత్రులలో కొంత ఆందోళన కలిగించింది. అది "ఏ దేశాన్నుంచైనా" ఆయుధాలు కొనుక్కోవచ్చుననే అంశం. సోవియట్ యూనియన్, తదితర సోషలిస్టు దేశాల్ని గురించీ, అమెరికా, తదితర సామ్రాజ్యవాద దేశాల్ని గురించీ చెప్పిన మాట అది.

అమెరికానుంచి భారతదేశానికి పెద్ద యెత్తున ఆయుధాలూ, వాటిని ఉపయోగించే సిబ్బందీ దిగుమతి అయినట్లయితే, భారతదేశం నెమ్మదిగా అమెరికా యుద్ధ స్థావరంగా తయారవుతుంది; ఆగ్నేయాసియా యుద్ధకూటమిలోకి యీడ్వబడుతుంది; ఆ విధంగా మన తటస్థ విధానం, స్వాతంత్ర్యం రూపుమాసిపోతాయి. నెహ్రూ ఉపన్యాసాలు చూస్తే అట్టి ప్రమాదాన్ని ఆయన గుర్తించినట్లు స్పష్టమవుతుంది.

## అనుమానాలు, భయాలు

అందువల్ల, మా పార్టీ అమెరికన్ ఆయుధాలను కొనుక్కోవచ్చునని చెప్పడంవల్ల ఒక ప్రమాదకరమైన ధోరణిని బలపరచడం లేదా ? మనంకూడా వారి వలలోకి యీడ్వబడ్డంలేదా ? ఇట్టి భయాలు ఏర్పడ్డం సహజమే. చరిత్రే దీనికి తార్కాణం.

కాని, మరో విషయంకూడా గమనించాలి. తీర్మానంలో, విదేశీ సేనల్ని, సిబ్బందినీ దిగుమతి చేసుకోడంవల్ల చాల ప్రమాదం ఏర్పడుతుందనే హెచ్చరికకూడా వుంది. అయితే, ఆయుధాలతోపాటు కొందరు మనుష్యులుకూడా వస్తారు. ఆవిధంగా చిక్కులు ప్రారంభమవుతాయి. కాబట్టి ఈ విషయమై చాల మెలకువతో ఉండడం అవసరం.

అభివృద్ధి నిరోధకుల, అమెరికన్ అనుకూలుర ఒత్తిడివల్ల అమెరికా ఆయుధాలకొరకు, అమెరికా "ఆకాశగొడుగు" కొరకు విపరీతంగా అభ్యర్థనలు వెళ్తున్నాయి. అభివృద్ధినిరోధక పత్రికలమీద, ఉన్నతోద్యోగాల్లో ఉన్న కొందరిమీద కూడ ఈ ఒత్తిడిఉంది. ఈ

ఒత్తిడికి వారు మెత్తపడుతూన్నట్లు వార్తలు వస్తున్నాయి. "ఆకాశ గొడుగు"కు అంగీకరించమనీ, ఆయుధస్థావరాలను, వాటికి సంబంధించిన యితర సౌకర్యాలను యివ్వమనీ వారు అడుగుతున్నారు.

పార్టీ యీ ప్రమాదాన్ని గుర్తించకపోలేదు. జాతీయసమితి 1963 ఫిబ్రవరి 11 న జరిగిన సమావేశంలో "పశ్చిమ రాజ్యాలు ఆయుధాల్ని గురించి చేసే ప్రతిపాదనల"పై ఒక తీర్మానం చేసింది. అందులో యిలా తెలియజేసింది :

"భారతదేశం యొక్క రక్షణకవసరమైన ఆయుధాలను సప్లయి చేసేవిషయంలో అమెరికా, బ్రిటిష్ ప్రభుత్వాలు యీ మధ్య కొన్ని షరతులు విధించినట్లు వార్తలు వెలువడుతున్నాయి. వీటిపట్ల జాతీయ సమితి తీవ్రఆందోళన ప్రకటిస్తోంది.

"ఈ వార్తలు ముఖ్యమయిన భారతదేశ దినపత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. వాటిని ఇంతవరకు భారతప్రభుత్వం ఖండించలేదు. పశ్చిమ రాజ్యాల ప్రతిపాదనల్లో ఈ క్రింది షరతులున్నాయి :

1. భారతదేశాని కీయబోయే కొన్నిరకాల మిలిటరీ సామాగ్రినీ, ప్రత్యేక ఆయుధాలనూ ఉపయోగించే అధికారం భారతీయుల చేతుల్లో కాకుండా, విదేశీయుల చేతుల్లో వుండాలి.

2. విదేశీ వైమానిక బలాలు భారతదేశంమీద ఒక "ఆకాశ గొడుగు"ను నిర్మించాలి. దాన్ని విదేశీ వైమానికులు, టెక్నీషియన్లే నిర్వహించాలి; విమానాశ్రయాలు, సామగ్రి మాత్రం భారతదేశానివయివుండాలి.

3. అట్టి విదేశీ వైమానిక బలాన్నీ, విమాన వాహకాలనూ అండమాన్, నికోబార్ దీవుల్లో ఉంచేటందుకు భారతదేశం అంగీకరించాలి.

"ఈ వార్తలు నిజమే అయితే, పశ్చిమరాజ్యాల ప్రతిపాదనలు భారతదేశం అనుసరిస్తున్న విధానానికి వ్యతిరేకమని జాతీయసమితి గట్టిగా అభిప్రాయపడుతోంది. ఈ విధానాన్ని భారత ప్రధాని పదేపదే విశదీకరించి యున్నారు. విదేశ ఏజన్సీలమీద ఆధారపడ్డం ద్వారా

కాక, దేశంయొక్క సర్వంసహాధికారానికి అనుగుణంగా మన సొంత రక్షణశక్తిని అభివృద్ధిపరచుకోవాలని ఆయన చెప్పారు.

"అంతేకాదు. పశ్చిమరాజ్యాల ప్రతిపాదనల్లో ఒక ప్రమాదం ఉంది. భారత భూభాగంమీద విదేశీ సైనిక స్థావరాలు నిర్మింపబడతాయి; భారతదేశం కొన్ని విధాలైన సైనిక ఒడంబడికల్లో ఇరికించబడుతుంది. ఇది మన తటస్థ విధానానికి, జాతీయ ప్రయోజనాలకూ వ్యతిరేకం.

"ఇవి ప్రమాదకరమైన ప్రతిపాదనలనీ, అందువల్ల ఆక్షేపణీయమైనవనీ జాతీయ సమితి అభిప్రాయపడుతోంది. దేశ రక్షణను అభివృద్ధిచేసుకోడంలో, పటిష్ఠం చేసుకోడంలో ఎట్టి షరతులు లేకుండా ఆయుధాలను కొనుక్కోవాలనే సూత్రాన్నీ, సర్వసహాధికారం భారతీయుల చేతుల్లోనే ఉండాలన్న సూత్రాన్నీ, భారత భూభాగంమీద విదేశీ స్థావరాలుగాని విదేశీ సైనిక బలాలుగాని ఉండకుండదనే సూత్రాన్నీ, భారతదేశం తన సొంత రక్షణశక్తిని నిర్మించుకోవాలనే సూత్రాన్నీ, సైనికకూటాల్లో చేరకూడదనే సూత్రాన్ని విడనాడకూడదు.

"బ్రిటిష్, అమెరికా, కెనడా రక్షణ బృందంవారు న్యూఢిల్లీకి తీసుకొచ్చిన పశ్చిమ రాజ్యాల ప్రతిపాదల్ని గురించి అనేక వార్తలు వెలువడుతున్నాయి. వాటివల్ల ప్రజల్లో అనేక భయాలు, అనుమానాలు కలుగుతున్నాయి. ఆ భయాలను, అనుమానాలను తొలగించవలసిందిగా జాతీయసమితి భారత ప్రభుత్వాన్ని కోరుతోంది. ఈ విషయంలో మరింత వివరణను కోరేటందుకు ఒక రాయబారవర్గాన్ని ప్రధాని వద్దకు పంపాలనీ, యీ విషయంలో పార్టీ దృక్పథాన్ని ఆయనకు తెలియజేయాలనీ జాతీయసమితి తీర్మానిస్తోంది."

## అప్రమత్తత అవసరం

భారతదేశ స్వాతంత్ర్యాన్నీ, ప్రజాస్వామ్యాన్నీ, శాంతి – తటస్థ విధానాన్నీ కాపాడేందుకు పార్టీ నిరంతరం అప్రమత్తతో మెలగాలి.

పై తీర్మానంలో వ్యక్తం చేయబడిన దృక్పథాన్ని గురించి ప్రజలకు బోధించాలి.

1963 ఫిబ్రవరి 13 వ తేదీన పార్టీ రాయబారవర్గం భారత ప్రధానిని కలుసుకొని మాట్లాడినప్పుడు, ఆయన ఆకాశగొడుగు పథకాన్ని అంగీకరించే సమస్యలేదనీ, విదేశీ ప్రభుత్వాలకు ఆయుధ స్థావరాలను యివ్వబోమనీ తెలియజేశారు.

అయినప్పటికీ, సామ్రాజ్యవాదులు చాల బలంగా ఉన్నారనే విషయాన్నీ, పాలకవర్గపార్టీ అయిన కాంగ్రెసులో కొన్నివర్గాలు వారిని బలపరుస్తున్నారనీ మనం మరచిపోకూడదు. మనం చాలా చిక్కు పరిస్థితుల్లో ఉన్నప్పటికీ, తటస్థవిధానంలోనూ, సామ్రాజ్య వ్యతిరేక పంథాలోనూ విశ్వాసం వున్న కాంగ్రెసువాదుల సహాయంతో, మితవాద అభివృద్ధి నిరోధకులవల్ల ప్రమాదం ఉందనుకునే కాంగ్రెసు వాదుల సహాయంతో ప్రజలు యీ ప్రమాదంపట్ల అప్రమత్తతతో మెలగేటట్లు పార్టీ చూడాలి.

ఒకానొకప్పుడు భారతదేశపు ఫ్యూడల్ రాజులు, చక్రవర్తులు తమ సేనలను కొత్త ఆయుధాలతో తర్ఫీదు చేయడానికి, కొత్తయుద్ధ కళను నేర్పడానికి బ్రిటిష్, ఫ్రెంచి ఆఫీసర్లనూ, "కంపెనీ సైనికులనూ" ఆహ్వానించారనే విషయాన్ని భారత ప్రజలు జ్ఞాపకముంచుకోవాలి.

దానివల్ల భారతదేశం తనస్వాతంత్ర్యాన్నికోల్పోయింది; బ్రిటిష్ వారికి, ఫ్రెంచివారికి లొంగిపోవలసివచ్చింది. ఇప్పుడు మళ్ళీ మనం సరిహద్దుల్లో చైనావారినిప్రతిఘటించేందుకు కొత్తఆయుధాల మోజులో, విమాన గొడుగుల మోజులోపడి మన స్వాతంత్ర్యాన్ని సామ్రాజ్య వాదులకు సమర్పించవద్దు. సరిహద్దుల్లో విజయం సాధించేందుకు దేశాన్ని బలియిచ్చేటంత మూర్ఖులం కావద్దు.

కాంగ్రెసునాయకుల్లో చాలమంది ఈ ప్రమాదాన్ని గుర్తించడం హర్షించతగ్గదే. తర్వాత మనం ప్రజాతంత్రవాదు లందరినీ — మన పార్టీతోసహా — యీ విధానం వెనుక ఐక్యపరిచేందుకు దృఢమయిన

పాలసీని, కార్యక్రమాన్ని చేపట్టాలి. ఈ విధమయిన రాజకీయ ప్రజా తంత్ర ఐక్యతను కార్యరంగంలో సాధించకపోతే, మన తీర్మానాలు విధిగా పవిత్రమయిన బోధనలుగానే ఉండిపోతాయి. ఇందుకు మార్గం తీర్మానాన్ని వ్యతిరేకించడం కాదు; దాన్ని సరిగా అమలు జరపడమే.

అత్యుత్తమమైన పరిష్కారమార్గం. యీ తగాదాను త్వరితంగా, శాంతియుత సంప్రదింపుల ద్వారా పరిష్కరించుకోడం. ప్రచ్ఛన్న యుద్ధస్థితిలో దాన్ని నానపెట్టకూడదు; ప్రత్యక్ష యుద్ధంగా అది పరిణమించనూకూడదు.

# 6

# ట్రేడ్ యూనియన్ విధానం శ్రామికవర్గ ప్రయోజనాలకు అనుగుణమే

ఎ. ఐ. టి. యు. సి. ప్రధాన కార్యదర్శిగా నేను 1962 నవంబరు 16 న జనరల్ కౌన్సిలు సమావేశానికి ఇచ్చిన నివేదికను, ముఖ్యంగా జాతీయ అత్యవసర పరిస్థితులలో పారిశ్రామిక తగాయిదా నివారణ సమస్యలను గురించి వ్రాసిన భాగాలను వక్రంగా చిత్రించేందుకు "ప్రతిబింబం" వ్యాసకర్తలు ప్రముఖంగా వాడుకున్నారు.

వారు సందర్భ రహితంగా సగంసగం మాటలను, ఆ నివేదికలో వేర్వేరు ప్రదేశాలనుంచి వేర్వేరు వాక్యాలలో సగమూ, పాతికా తుంచి, మెలితిప్పి, మాటలుగా చేసి అప్రతిష్ఠాకరమయిన అర్థాలు తీశారు. వాటి సహాయంతో "ప్రతిబింబం" వ్యాసరచయితలు ఈవిధంగా తీర్పు యిచ్చారు :

"ఇక్కడ డాంగే, ప్రభుత్వంయొక్క వర్గ స్వభావాన్ని పూర్తిగా తోసిపుచ్చి, బడాబూర్జువా, బడాభూస్వాముల నియంతృత్వంక్రిందఉన్న ప్రభుత్వాన్ని ప్రజలకు చెందిన ప్రభుత్వం అని బహిరంగంగా వర్ణించాడు. అయన పూర్తిగా బూర్జువావర్గం పక్షంగా తిరిగిపోయాడు. బూర్జువా వర్గానికి కాదనకుండా సాయంచెయ్యమని బహిరంగంగా

పిలుపిచ్చాడు. వర్గపోరాటంగురించిన మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా విస్మరించి, బాహాటంగా వర్గసామరస్యాన్ని బోధించాడు. డాంగే, ఆయన మిత్రులు పూర్తిగా పతనం అయ్యారు. భారతదేశపు బడా బూర్జువావర్గం చేతిలో పనిముట్లుగా తయారయ్యారు."

ఆ 'ప్రతిబింబం'లో అంత వికృతంగా చూపిస్తున్న దాని అసలు స్వరూపం ఏమిటి ?

అత్యవసరకాలంలో పారిశ్రామిక తగాదా నివారణ సమస్యలను చర్చించేందుకై భారత ప్రభుత్వం నవంబరు ప్రారంభంలో కార్మిక సంఘాల, యజమానుల, ప్రభుత్వంయొక్క ప్రతినిధులతో త్రైపాక్షిక సమావేశం పిలిచింది.

చైనా సైన్యాలు ముందుకు తోసుకువస్తూండడాన్నీ, ప్రజలలో వున్న మానసిక స్థితినీ అడ్డంపెట్టుకొని యజమానులు సమ్మెలను, జీతాలు పెంచాలనే కోర్కెలనూ, అధికోత్పత్తి వాంఛలను పూర్తిగా నిషేధింపచెయ్యాలని చూశారు. అంతే కార్మికుల కాళ్ళు చేతులు కట్టేసి; వారి జీవనపరిస్థితులూ, జీతాలు క్షీణింప చేసేటందుకు వారింత వరకూ చెయ్యలేకపోయిన దానిని సాధించ పూనుకున్నారు.

ధరల పెరుగుదలనూ, స్వార్థ ప్రయోజనపరుల అధిక లాభాలనూ సాగకుండా చేస్తానని ప్రభుత్వం ప్రకటించింది. కాని అవి వట్టి ప్రకటనలు మాత్రమే. ప్రజానీకం కదిలితే తప్ప ప్రభుత్వం తనకుతానై బడా బూర్జువావర్గంమీద వాటిని అమలు జరుపలేదు. పారిశ్రామిక శాంతి తీర్మానం సరిగ్గా ఆ ప్రజానీకం కదలకుండా చేస్తూంది.

ఇతర పార్టీలు చిత్తు తీర్మానాన్ని అంగీకరించాయి. కాని ఎ. ఐ. టి. యు. సి. ధరల పెరుగుదలనుంచి కార్మికుల జీతాలను కాపాడేటందుకై దానికి కొన్ని సవరణలు చేయించడానికై ప్రయత్నించింది. కాని, ఏవో మాట హామీలు తప్ప తీర్మానం చిత్తును మార్చడం సాధ్యంకాలేదు.

ఎ. ఐ. టి. యు. సి. జనరల్ కౌన్సిల్ 1962 నవంబరు 16 న సమావేశం అయింది. పారిశ్రామిక శాంతి గురించి చర్చించింది. యుద్ధాలూ, యుద్ధ పరిస్థితులలో డబ్బుచేసుకొనే అధికలాభపరుల

చేతులనుంచి ప్రజాప్రయోజనాలను రక్షించేటందుకూ, దేశరక్షణ విషయంలోనూ భవిష్యత్కార్యక్రమాన్ని స్పష్టంచేసుకొంది. రాష్ట్రాలనుంచి నివేదికలను సేకరించింది.

'ప్రతిబింబం' తాను ప్రతిబింబింప చేశాననుకొన్న ఆ నివేదిక భాగాలను ఇక్కడ వ్రాస్తే, ఆ వక్రీకరణకు మూలం ఏమిటో అర్థం అవుతుంది. అవక్రత్వం నివేదికలోనేవుందో, ఇతరత్రావుందో అర్థంఅవుతుంది

## అపవాదులు బహిర్గతం చేయబడ్డాయి

"జాతీయ అత్యవసర పరిస్థితుల దృష్ట్యా ... ఎ. ఐ. టి. యు. సి. కి చెందిన ట్రేడ్‌యూనియన్లు కంపెనీలతో వుండే సామాన్య సంబంధాలను తాత్కాలికంగా సర్దుబాటు చేసుకొంటాయి ..." అంటూ "ప్రతిబింబం" ఆ నివేదికలో కొంత భాగాన్ని ఉల్లేఖించింది. కాని, దానికి ముందూ, వెనుకా నున్న భాగాలను తీసేసి ఆ పేరా ఒక్కదానినే వారుదహరించారు. ఆ భాగాన్నిక్కడ ఇస్తున్నాము:

"వర్గ సంబంధాల సవరణ అవసరం. దానినే పారిశ్రామిక శాంతి అంటున్నాం; బూర్జువావర్గంతో మన సంబంధాలను సవరించుకోవలసిన అవసరం వున్నదని అమోదించినట్లయితే, పారిశ్రామిక సంబంధాలలోకి రాజకీయ దృక్పధాలు చొరబడతాయి. అదే తగాదా విరమణ అవుతుంది. నా వాదం అది.

"జాతీయావసర పరిస్థితి ఏర్పడివున్నప్పుడు, దేశరక్షణ అవసరం అయినప్పుడు, దేశంలో ఇంచుమించు యుద్ధపరిస్థితులు ఏర్పడి వున్నప్పుడు ఎ. ఐ. టి. యు. సి లోని ట్రేడ్‌యూనియన్లు బూర్జువా వర్గంతో వుండే మామూలు సంబంధాలను మార్చుకోవాలని అంటున్నారు. అవి పనిచేసే పద్ధతులూ, శ్రామికవర్గ సమస్యలపై దాని దృక్పధమూ మారాలి. సవరించుకొనేటందుకు అంగీకరిస్తే, ఎల్లా సవరించాలో, ఆ సవరణ ఏ పాటిదిగా వుండాలో ఆలోచిద్దాం.

"కొంతమంది ఈ విధంగా ప్రశ్నిస్తారు : జాతీయావసర పరిస్థితి దోపిడీని లేకుండా చేస్తుందా ? పోటీని పోగొడుతుందా ? శ్రామికవర్గంమీద భారమూ, విపరీత లాభాల ఆశా తగ్గుతుందా ?

లాభాలన్నీ వదలుకొంటామనో, దేశాని కిచ్చివేస్తామనో జాతీయ బూర్జువా వర్గం ప్రకటిస్తుందా? ప్రకటించదు. వాళ్ళా షరతు అంగీకరించకపోతే, దోపిడీదార్ల దాపులనుండి శ్రామికుడనుగా ఆత్మ రక్షణ చేసుకొనేటందుకు నాకున్న హక్కును నేను వదలుకోను. వాళ్లూ సవరించుకోవాలి."

బూర్జువావర్గం ప్రక్క చేరిపోవడం అంటేనూ, వారికి "కాదన కుండా సాయం ఇవ్వడం" అంటేనూ ఇదేనా? ఆ రిపోర్టులో ఇంకా ఇంకా ఇలా వుంది :

"బూర్జువావర్గంలోనే కొన్ని తరగతులవారిమీద బూర్జువా ప్రభుత్వం తీసుకొన్న చర్యలను [బంగారం మొదలయినవాటిలో చట్టావ్యాపారాన్ని నిషేధించడం వగైరాలు] శ్రామికవర్గం వినియో గించుకోవాలి. ఇంకా అటువంటిచర్యలు తీసుకొనేటట్టు మనం ఒత్తిడిచెయ్యాలి? ఉదాహరణకు : బ్యాంకుల్ని ప్రభుత్వం తీసు కోవాలని కోరాలి... అదేమాదిరిగా బ్యాంకుల తాలూకు రహస్య నిధులను రక్షణబాండ్లుగా మార్పించమని మనం అడగవచ్చు"

"యుద్ధరంగంలో రక్షణప్రయత్నం అంటే ప్రజలనుకూడా రక్షించాలనేదే అర్థమని, దీనినిగురించి నేను ప్రధాన మంత్రికి వ్రాశాను. యుద్ధంఅనేది బూర్జువావర్గానికి ధనం సంపాదించుకొనే టందుకోమార్గం. దాని మూలసూత్రం అది. అయితే దానిని వారు అదుపు చెయ్యాలి"

'కాదనకుండా సాయమివ్వమ'నే దీని అర్థమా? బూర్జువావర్గం యొక్క, దాని ప్రభుత్వంయొక్క వర్గస్వభావాన్ని, వర్గపోరాటాన్ని మరచిపోయినట్లే కనబడుతూందా?

కాని 'ప్రతిబింబం' ఈ విషయాన్ని గమనించదు. వర్గాల్ని గురించీ, తటస్థవిధానం గురించీ నివేదికలో ఇలా వుంది :

"శ్రామికవర్గం ఎన్నడూ తటస్థంగా వుండదు. యావత్ ప్రపంచంలోని శ్రామికవర్గంతో—పెట్టుబడిదారీ సోషలిస్టుదేశాలు రెండింటిలోని శ్రామికవర్గంతో—మనం వుంటాం. కాని ఈనాడు

ఇండియాలోవున్న మాదిరిగా బూర్జువావర్గమూ, వారి ప్రభుత్వమూ, వారి పాలనలోవున్న దేశము మాత్రమే తటస్థంగా వుండగలవు."

అంతర్జాతీయతను మరచిపోయామనే ఈ పేరా చెపుతూందా ?

'ప్రతిబింబం' వాక్యంలో అరభాగాన్ని ఉదహరించింది. కాని ఈ దిగువ ప్రతిజ్ఞను అది ఎక్కడా ఎత్తుకోనేలేదు :

"భారతప్రభుత్వం రేపు సామ్రాజ్యవాద శిబిరంలో చేరిపోతుందనుకోండి. దేశంలో ఫాసిజాన్ని నెలకొల్పి, శాంతి - తటస్థ విధానాలను విసర్జించి, ఆయుధాలు తీసుకొని దురాక్రమణకు తలపడుతుందనుకోండి. అప్పుడు మన జాతీయత అభివృద్ధికర లక్షణాన్ని కోల్పోతుంది."

ఇంకా దానిలో ఇలావుంది :

"భారతదేశం నేడు అభివృద్ధిగామి. సామ్రాజ్యవాదవ్యతిరేకం. ఇక్కడి జాతీయత అభివృద్ధిగామీ, సామ్రాజ్యవాద వ్యతిరేకమూ కూడా. ఇది అంతర్జాతీయతకు అనుగుణంగానేవుంది. అంతర్జాతీయ దృక్పథాని కనుగుణమైన విధంగా శాంతి, సహజీవన సూత్రాలనది అనుసరిస్తూంది. రెండుదేశాల మధ్యనున్న సమస్యలను యుద్ధం ద్వారా పరిష్కరించబూనుకోరాదనేది అంతర్జాతీయతకు అనుగుణమే.

"తటస్థ విధానం అన్నివిధాలా సామ్రాజ్యవాద వ్యతిరేకత వలన వచ్చిందే. అది అంతర్జాతీయతా దృక్పథమే. దీనినిబట్టి మన జాతీయవాదం అభివృద్ధికరమైనదే. అంతర్జాతీయత కది విరుద్ధం కాదు - ఇది స్పష్టం."

## సగం సగం వాక్యాలే ఉదహరించారు

'ప్రతిబింబం' తన కనుకూలంగా వుండే ఒక్క పావు భాగం వాక్యాన్ని ఉదహరించి, మిగిలిన మూడువంతులూ వదిలేస్తుంది. "మనం జాతీయతను కాపాడుకోవలసి వస్తూంది..." అన్న వాక్యాన్నందులో ఉదహరించారు. వారు వదలివేసిన మాట లివి :

"యుద్ధమూ – శాంతి సమస్యమీదనూ, రెండు దేశాల మధ్య సమస్యలను శాంతియుతంగా పరిష్కరించుకోవాలనే విషయంలోనూ, ఎదిరిపక్షం అంతర్జాతీయతను విడనాడారు. కాబట్టి మనం మన జాతీయతను కాపాడుకోవలసి వస్తూంది."

వర్గ సహకారాన్నిగురించిన వాక్యాన్నికూడా వారు సగం సగమే ఉదహరించారు. పూర్తి వాక్యం యిదిగో :

"పారిశ్రామిక శాంతి తీర్మానం అంటే ఒక విధంగా వర్గ సహకారమే. అయితే దానిని మనం బుద్ధిపూర్వకంగా ఆమోదిస్తున్నాం. ఇప్పుడు రెండు వర్గాలనూ ఒకే సమస్య యెదుర్కొంటూంది. శాంతిని వాంఛిస్తున్న, అభివృద్ధి పొందుతున్న స్వతంత్ర దేశాన్ని ప్రమాదం చుట్టుకొంటూంది."

అదే సందర్భంలో పారిశ్రామిక శాంతిపై ఎ. ఐ. టి. యు. సి. చేసిన తీర్మానం ఇతర విషయాలతోపాటు ఈ హెచ్చరిక చేస్తూంది :

"ఈ బాధ్యతను తన దేశభక్తియుత కర్తవ్యంగా నిస్సంశయంగా ఎ. ఐ. టి. యు. సి. స్వీకరిస్తున్నా, ప్రస్తుత వ్యవస్థలో ఉత్పత్తిమీద అధికారం కార్మికుల చేతులలో లేదని ఇది ఎరుగును. అది పెట్టుబడిదారీ వ్యవస్థ దీనిలో అధికభాగం ప్రైవేట్ వ్యక్తుల చేతులలో వుంది. పరిశ్రమలను సక్రమంగా వుంచడంలోనూ, అదుపులో వుంచడంలోనూ ప్రభుత్వానికి, కార్మికులకు అవకాశం వుండదు."

"చాలమంది యజమానులు దేశ ప్రయోజనాలను కాపాడాలని మనస్ఫూర్తిగా కోరుతున్నప్పటికి, ఎందరో దేశభక్తికన్నా లాభాల కెక్కువ విలువనిచ్చేవా రున్నారని ఎ. ఐ. టి. యు. సి. ఎరుగును. స్వార్థపరులైన అధికలాభపరులు ప్రస్తుతం ఏర్పడిన అత్యవసర పరిస్థితులవంటి సందర్భాలను తమ స్వలాభాని కుపయోగించుకుంటారు ధరలు పెంచుతారు. శ్రమజీవుల్ని పిండేస్తారు. తాము ధనికులవుతారు. ఇది మన అనుభవం.

"అందుచేత అటు సైన్యాలకూ, ఇటు పౌర ప్రజకూ అత్యవసరంగా కావలసిన వస్తువులనూ, పనులనూ సమకూర్చేటందుకు

తమ తమ శక్తినంతనూ వినియోగించగలిగేట్లు కార్మికునికి సరాసరి సహాయం చెయ్యవలసి వున్నదని ఎ. ఐ. టి. యు. సి. భావిస్తూంది.

"పని నిలుపుదలలు పనికిరావనడం అవసరమే కాని అంతతో చాలదు. పనివాని ఉత్పత్తిశక్తికిగల నిరోధాలన్నీ తొలగించాలి. కార్మికుని శక్తినీ, అతని దేశభక్త్యుత్సాహాల్నీ నీళ్లుకార్చే అవకాశం స్వార్థపరు లెవ్వరికీ కలిగించకూడదు. 1962 నవంబరు 3 నాటి పారిశ్రామిక శాంతి తీర్మానంలో వున్న లోపం అదే."

సత్యం చూపించే ఆ 'ప్రతిబింబం' ఈ మాటల నెందుకు మరచిపోయింది?

మా ప్రతిబింబాన్ని ఆ 'అద్దం' ఎలా వికృతంగా చూపిస్తూందో చెప్పడానికే గాక, ట్రేడ్ యూనియన్లు తమ మూలసూత్రాలను వదులుకోకుండా, నూతన పరిస్థితుల కనుగుణంగా ఎలా సర్దుకొంటున్నాయో చూపించటం కూడా ఈ వాక్యాల నిక్కడ వుదహరించడంలో మా వుద్దేశం.

## జాతీయ దురహంకారాన్ని గూర్చి హెచ్చరిక

జాతీయ దురహంకారం విషయమై కార్మికులను హెచ్చరిస్తూ ఆ నివేదిక ఇలా చెపుతోంది:

"ఇక్కడో ప్రశ్న వస్తుంది. ఈ సమస్యను జాతీయదురహంకార దృక్పథంతో చూసే అవకాశం వుందా? వుంది. ఆ విషయమై ట్రేడ్‌యూనియన్లలో మనం చాల జాగ్రత్తతో వుండాలి. మరో దేశ ప్రజలయెడ ద్వేష ప్రచారంచేయడం జాతీయదురహంకారం. అభివృద్ధినిరోధకులు మనల్ని ఎంత నిందించినా, రెండు దేశాల ప్రజలమధ్య మనం ద్వేషం రగుల్కొల్పలేం.

సమస్య శాంతియుతంగా పరిష్కారం కావడానికి మనం ప్రయత్నించాలి. జాతీయ దురహంకారాన్ని అవలంబిస్తే దీర్ఘకాల యుద్ధం అవుతుంది. కాని శాంతియుత పరిష్కారం జరగదు. విజ్ఞత కలిగిన బూర్జువా రాజకీయవేత్తలుకూడా అటువంటి పని

చేయరు. కొందరు మతిమాలిన ట్రేడ్‌యూనియను కార్యకర్తలు ఒక్కొక్కప్పుడు ఆ పనిచేయబోవచ్చు. ఏమంటే ఆ మార్గం పట్టేక అంతర్జాతీయతతో పొత్తులేని జాతీయతావాదాన్ని అనుసరిస్తారు. అందుచేత రెండు దేశాల ప్రజలమధ్య ద్వేషప్రచారం జరగనీయరాదు."

ఎ. ఐ. టి. యు. సి. తీర్మానం కార్మికుల డిమాండ్లను పేర్కొని చివర నిలా వ్రాసింది :

"తమ దేశరక్షణకు పూనుకొని, కార్మికవర్గం జాతీయ దురహంకారానికి లోనుగావద్దనీ, తమ అంతర్జాతీయ బాధ్యతలను విస్మరించరాదనీ, ఎ. ఐ. టి. యు. సి. విజ్ఞప్తి చేస్తూంది. యుద్ధపరిస్థితులలోనైనా సరే మరోదేశపు ప్రజలయెడ జాతిద్వేషం బోధించడం విజయానికి తోడ్పడదు. శాంతికి, సోషలిజానికి సహాయపడదు. ఒకజాతి మరోజాతిని నిర్మూలించలేదు. అన్ని దేశాలలోని ప్రజలూ మృత్యుంజయులు. అన్నిజాతులతో, అందరు ప్రజలతో శాంతీ-సఖ్యతలతో మెలగాలనే ఉత్తమాదర్శాన్ని భారతీయ సంస్కృతీ సంప్రదాయం ఎప్పుడూ బోధిస్తూనే వుంది. ఈ సంప్రదాయాన్ని శ్రామిక వర్గం కొనసాగించాలి "

ఈ విధంగా వ్రాతలుంటూంటే ఆ 'ప్రతిబింబం' వ్యాసం చూపించిన వికృత రూపాల కెవ్వరూ మోసపోరు.

నెహ్రూ పేరు చెప్తే "ప్రతిబింబ" మనేవ్యాసాని కెంతో ద్వేషం. అందుచేత ఆయన 73 వ జన్మదినం రోజున మేము అభినందన సందేశం పంపడం దానికి నచ్చలేదు. దేశంలోనూ, విదేశాలలోనూ వున్న అభివృద్ధి నిరోధకులందరూ కలిసి ఆయనను పదవి నుంచి తొలగించాలనీ, ఆయన అనుసరిస్తున్న శాంతి – తటస్థతా విధానాలను రద్దుపరచాలనీ కుట్ర చేస్తున్న సమయంలో వచ్చింది ఆ జన్మదినోత్సవం. ఆ సమయంలోనే ఆ అభినందన సందేశం పంపడం చాలా అవసరం, పంపించాం.

ఇది మామూలు మర్యాదకోసం చేసింది కాదు అంటుందీ 'ప్రతిబింబం.' నిజమే. కేవల మర్యాదకోసం చేసిందికాదు. అలాగని యావత్తు సమస్యలమీద కమ్యూనిస్టుపార్టీ ఏమిటంటుందో ఆ సందేశంలో చెప్పవలసిన పని లేదు. 1962 నవంబరు 14 నాడు అభివృద్ధి

నిరోధకుల పక్షాలన్నింటికి నెహ్రూ పెద్ద ఆటంకంగా వున్నాడు. అందుచేత ఆయన సమర్థిస్తూన్న, సమర్థించ వలసిన విధానాలను గురించి నొక్కిచెప్పడం చాలా ముఖ్యం. మంచి క్లిష్ట సమయంలో పంపిన అభినందన సందేశం అది. అందుచేత దానిలో ఒక విధానాన్ని గురించి ఎత్తుకున్నాం. విజయవాడ సిద్ధాంత వ్యాసం పంపడం దాని వుద్దేశం కాదు.

## నెహ్రూయెడ దృక్పథం

నెహ్రూ భారతదేశంలో సోషలిజం నిర్మిస్తున్నారని మా పార్టీ ఎప్పుడూ చెప్పలేదు. ఆ సందేశంలోనూ ఆ మాట లేదు. శాస్త్రీయం కాకపోయినా ఏవో కొన్ని సోషలిస్టు ఆశయాలను గురించి నెహ్రూ మాట్లాడుతూంటారు.

1959 మే 6 వ తేదీన ఈ 'ప్రతిబింబాన్ని' చూపించిన పత్రిక పీపుల్స్ డైలీయే ఇలా వ్రాసింది :

"మన పొరుగునున్న మిత్ర భారతదేశ ప్రధాని ప్రపంచం యావత్తూ మన్నించే రాజకీయ దురంధరులలో ఒకరు. ఆయన చైనాకు మిత్రుడనీ, సామ్రాజ్యవాదుల యుద్ధ-దురాక్రమణ విధానాలకు వ్యతిరేకియనీ ప్రత్యేకించి మేం మరచిపోలేము. అంతేకాదు. సమాజాభివృద్ధి గురించి ఎంతో విజ్ఞతతోకూడిన ప్రకటన లెన్నింటినో ఆయన చేశారు."

ఆనాటి ఈ చిత్రం 1963 నాటి 'ప్రతిబింబం'లో వికారరూపం ధరించింది. కాని ఆయనలో ఎన్నో లోపాలూ, తటపటాయింపులూ వున్నా, కార్మికవర్గానికి వ్యతిరేకంగా ఎన్నో చర్యలు చేసినా, 1962 నవంబరులో మేము ఆయనను ఇంకా సామ్రాజ్యవాద వ్యతిరేకిగానే పరిగణిస్తున్నాం చైనా దండయాత్రను అవకాశంగా తీసుకొని అమెరికను సామ్రాజ్యవాదులు ఒకమూల భారతదేశవిధానాలమీదకు కుట్రలు చేస్తుంటే, మేము ఆయనను చిరంజీవిగా వుండాలని కోరడం తప్పా? "సంపన్నమైన సోషలిస్టు భారతదేశాన్ని నిర్మించాలనే ఆశయాలు"

సఫలం చేసుకోనేటందుకై ఆయన దీర్ఘకాలం జీవించాలని కోర కూడదూ ?

"మీ ఆదర్శాలను గురించి మాత్రమే మేమిది చెపుతున్నాం. కాని, నువ్వో బూర్జువావి. సోషలిజం గురించి నువ్వు చెప్పేదంతా వట్టి పెట్టుబడిదారీ మోసం" – అనే మాటల్ని ఆ జన్మదిన సందేశంలో చేర్చ డానికి మా సంస్కారం అడ్డువచ్చింది.

'ప్రతిబింబా'నికున్న సంస్కారమూ, ధైర్యమూ మాకు లేదు. కనక అటువంటి ఘోరం చెయ్యలేకపోయాం. ఎవరిలోవున్నా అభిప్రాయా లను మాత్రమే మేము అభినందిస్తాం. వానిని సరిగ్గా అమలు జరప నప్పుడు దేనిని ఎప్పుడు ఎక్కడ విమర్శించాలో అప్పుడు అక్కడ విమర్శిస్తాం.

చైనా నాయకత్వం మా విషయంలో ఎంత తప్పుగా వ్యవహ రిస్తూ ఉందో చూపడానికే మేము ప్రయత్నిస్తున్నాం. మా ప్రకటనలనూ, విధానాలనూ మెలితిప్పి తప్పు వ్యాఖ్యానం చెయ్యడంతో వారు తృప్తి పడలేదు. ప్రపంచంలో ఏ కమ్యూనిస్టుపార్టీ మరొక పార్టీని ఎన్నడూ తిట్టివుండని విధంగా చవకబారు ఆరోపణలు, తిట్లు మామీద సాగించే టంతవరకు దిగిపోయింది.

సరిహద్దులలో చైనావారు వేగంగా చొచ్చుకు వస్తూంటే భారత ప్రభుత్వం దేశవ్యాప్తంగా కమ్యూనిస్టుల్ని అరెస్టు చేయడం ప్రారం భించింది. చైనా సైన్యాలు అస్సాం సరిహద్దులోకి వచ్చేసరికి అరెస్టులు పెద్ద ఎత్తున సాగేయి.

జాతీయ సమితి సభ్యుల్ని, పార్లమెంటు, శాసనసభల, మునిసి పాలిటీల సభ్యుల్ని, ట్రేడ్ యూనియన్ కార్యకర్తల్ని, మహిళా కార్య కర్తల్ని అరెస్టు చేశారు. పార్టీ ప్రధాన కార్యదర్శిని కూడా అరెస్టు చేశారు. కాని, పార్టీ గట్టిగా చెప్పే సరికి ఒక వారంలోపలనే ఆయన్ని వదలిపెట్టారు.

ఈ అరెస్టులను ప్రపంచంలోని కమ్యూనిస్టు పార్టీ పత్రికలన్నీ ఖండించాయి.

చైనా వేగంగా చొచ్చుకురావటం వలన కలిగిన ఆదుర్దా

చూశాక, పార్టీని ఎదుర్కొనే ధైర్యం అభివృద్ధి నిరోధక శక్తులకు లభించింది. పార్టీని నిషేధించాలనీ, నాయకుల్ని అరెస్టు చెయ్యాలనీ డిమాండు చేయసాగాయి. ట్రేడ్ యూనియన్లనూ, మనకున్న ప్రజా పునాదులనూ నిర్మూలించాలని కూడా వారు ప్రయత్నించారు. అరెస్టు చేసినది తీర్మానాన్ని వ్యతిరేకించా లనుకొన్న వాళ్ళనే కాదు.

నవంబరు 2న చేసిన తీర్మానాన్ని పూర్తిగా అమలుజరప బూను కొన్నవారిని కూడా అరెస్టు చేశారు; నిజం చెప్పాలంటే ఒక దశలో అటువంటివారి సంఖ్యే చాల రాష్ట్రాలలో, అరెస్టయినవారిలో ఎక్కువ వుంది.

ప్రపంచంలోని ఇతర పార్టీలు ఈ విషయంలో వ్యవహరించిన దానికీ, చైనావారి వ్యవహారానికీ భేదంవుంది. మితవాద దృష్టినుంచి అమెరికను సామ్రాజ్యవాదులూ, అభివృద్ధి నిరోధకులూ మా మీద దాడి జరుపుతుంటే, చైనా నాయకత్వం మా మీద అతివాద ధోరణి లోంచి దాడి సాగించింది. అది చూస్తే మా విషయంలో వారెంత వరకూ పోయారో అర్థం చేసుకోవచ్చు.

"అతఃపూర్వమే తమకిచ్చిన పేర్ల పట్టీ చేతబట్టుకొని" భారత ప్రభుత్వం కమ్యూనిస్టుల్ని అరెస్టు చేసిందని పెకింగ్ రేడియో ప్రసారం చేసింది, ప్రభుత్వ గూఢచారి శాఖకు ఏ సమాచారమూ తెలియదనీ, వారికెవరి పేర్లూ తెలియవనీ కాబోలు!

అయితే ఆ పట్టీ ఎవరిచ్చారనికి పెకింగ్ రేడియో ఉసి ఇచ్చింది. దానిని కొందరు వ్యక్తులు పట్టుకొని రహస్యంగానూ బహిరంగంగానూ ప్రచారం చేశారు. దానిని మళ్ళీ ఈ 'ప్రతిబింబం' నమోదుచేసింది. దానిని డాంగే ముఠా వాళ్ళు ఇచ్చారంది.

"రివిజనిస్టుల ప్రతిబింబం" అనే వ్యాసంలో ఇలా వుంది :

"...డాంగేముఠా భారత పాలకవర్గాల బలాన్ని వినియో గించుకొని భారత కమ్యూనిస్టుపార్టీలో తమతో ఏకీభవించనివారిని పక్కకు నెట్టేశారు. పార్టీని రెండుగా చీల్చారు".

"డాంగే ముఠా పరిస్థితులను వుపయోగించుకొంది. తమకు నమ్మకస్తులయినవారిని పోలీసులవెంట పంపింది. అనేక రాష్ట్రాల పార్టీ కమిటీలలోని ముఖ్యసంస్థలను తమ చేతిలోకి తెచ్చుకొన్నారు. బడా బూర్జువావర్గంయొక్క ప్రయోజనాలకు ఉపయోగపడేవిధంగా కమ్యూనిస్టుపార్టీని పునర్నిర్మించేటందుకే డాంగేముఠా యీ చర్యలకు పూనుకొంది."

చైనా నాయకత్వానికి భారతదేశంలోనూ, బయటావున్న వార్తాహరులు హడావిడిగా, సంగతులు తెలుసుకోకుండా సమాచారం అందించినట్లు కనబడుతుంది. రెండు రాష్ట్రాలలో తప్ప మరెక్కడా పార్టీ కమిటీల ముఖ్యసంస్థల్ని తీసుకోలేదు. పశ్చిమబెంగాల్ కమిటీలో అధిక సంఖ్యాకులు ఖైదులో వుండటం చేత కేంద్ర సూచన ప్రకారం అక్కడి కమిటీ యొక్క ముఖ్య సంస్థను తీసుకొన్నాము. అప్పుడయినా తాత్కాలికంగా పని సాగించ వలసిన ఆ సంస్థలో వెనుకటి దాంట్లోని వారే వున్నారు.

## భారత కమ్యూనిస్టు పార్టీ నాయకత్వం

ఒక్క రెండు రాష్ట్రాలలో తప్ప మరెక్కడా మార్పు లవసరం కాలేదు. గత పార్టీ మహాసభలో జాతీయ సమితికి ఎన్నుకోబడిన వారిలో అత్యధిక సంఖ్యాకులు పెకింగ్ రేడియో అభిమానానికి పాత్రులు అయ్యేవారు కాదు మాతో పోరాడమని ప్రోత్సహించినా, మా నుంచి విడిపొమ్మన్నా వినేవారు కాదు. ఆ సంగతి 'అద్దా'నికి తెలియదు.

ఏకగ్రీవంగా ఎన్నుకోబడిన నాయకత్వాన్ని ఒక 'ముఠా' అనడం చూస్తే, పెకింగ్‌లోని ఈ వ్యాసకర్తలు ఎంత గుడ్డిద్వేషం పెంచుకొన్నారో కనబడుతుంది. ఇంకా కార్యదర్శి వర్గంలోంచి రాజీనామా యిచ్చినవారిగురించి రాజీనామాలివ్వవద్దని పొడూగునా వారి నడుగుతూనేవున్నాం. వారికి సముచితమైన మర్యాద, పదవి, పని ఇవ్వటానికి మేమెప్పుడూ నిరాకరించలేదు. కేంద్రంతో భేదాభిప్రాయాలుగల

శా(మేడ్సు తమ మనస్సులు మార్చుకొని తిరిగి వస్తారనే ఆశతో ఆ పదవులను భర్తీ చేయలేదు.

భారతదేశంలో "విప్లవోద్యమం" సరియైన విధంగా వృద్ధిపొందడానికి సాయం చెయ్యాలనే చైనా నాయకత్వం కోరుతూవుండివున్నట్లయితే పైన చెప్పిన మాదిరి అసహ్యాకరమైన కథలను సృష్టించివుండేది కాదు. వారి చర్యలు మన దేశంలోని వుద్యమంలోనూ, ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలోనూ ఐక్యతకు తోడ్పడేటట్లుగా లేవు.

వారికి మా విధానాలు నచ్చకపోవచ్చు, తప్పేముంది ? మమ్మల్ని రివిజనిస్టులనమనండి. సంస్కరణవాదులు, పిడివాదపరులు, మరేమన్నా అనమనండి, కనీసం అవి రాజకీయ విమర్శయొక్క రూపం. "పోలీసులకు సాయపడుతున్నార"నీ "పార్టీని చీల్చడానికై ప్రభుత్వాన్ని వుపయోగించుకుంటున్నా"రనీ తిట్టడం రాజకీయ విమర్శ కాదు, దానికి ఋజువులు లేవు. ఆ వ్రాసినవారు ఎంత గౌరవనీయులైనా వ్రాసింది మాత్రం నీచమైన అభాండం.

అయితే ఆ విషయమై మేమెక్కువ బాధ పడడం అనవసరం. అల్లాంటి నీచమయిన తిట్లు తిన్నది మేమొక్కళ్ళమే కాదు. ఎంతో మన్నన పొందిన ఇతర దేశాలపార్టీల వారిని, విప్లవాలు, ఫాసిస్టు వ్యతిరేక పోరాటాలు, యుద్ధాలు నడిపిన వారిని సామ్రాజ్య వాదుల ఏజంట్లనీ, జాతీయ విముక్తి వుద్యమాలకు ద్రోహం చేశారనీ, రెండో మ్యూనిక్ ఒడంబడిక గాళ్ళనీ, పిరికి పందలనీ, ఒక టేమిటి నోటికి వచ్చినట్టల్లా తిట్టారు.

ఈ బిరుదుపదాలను ప్రపంచం నలుమూలలకీ విసురుతున్నారు. వాటిలో భారతదేశంలో వున్న మాకు ముట్టినవి చాలా తక్కువ. దానిలో నిజానిజాలను చరిత్ర తేలుస్తుంది, వదిలేద్దాం. అయితే విచారకరమైన సంగతి ఏమంటే, ఇప్పుడు ఐక్యతకోసం ఎంతో కృషి సాగుతున్నా, కొంతమంది "వుద్యమాన్ని బద్దలు చెయడానికి" సంసిద్ధత చూపుతున్నారు. శ్రామిక వర్గమూ, ప్రజలూ వారికి సరియైన మార్గం చూపగలరనే ఆశిద్దాం.

ఆ విధమైన ఆశలు వెలిబుచ్చడంతప్ప మనం చెయ్యగలది ఏముంది? 70 కోట్లమంది జనంవున్న పెద్దదేశాన్ని పాలిస్తున్నది చైనా కమ్యూనిస్టుపార్టీ. వాళ్ళ వ్యవహారాలలో కల్పించుకొని ఇదిల్లా చెయ్యండి, అదల్లా చెయ్యండి అని సలహాలుచెప్పే హక్కు మాకు లేదు.

కాని, మా పార్టీ అంతరంగిక వ్యవహారాలలో కలగచేసుకొనే హక్కు వారి కెక్కడుంది? మా దేశపు బూర్జువా సర్కంతో మే మెలా వ్యవహరించాలో మాలో "నిజమైన మార్క్సిస్టు విప్లవకారు లెవరో, ఎవరు "పార్టీని విచ్ఛిన్నం" చేస్తున్నారో చెప్పేహక్కు వారి కెక్కడిది?

## మావ్ సే - టుంగ్ భావన

చైనా నాయకత్వం తాము సర్వజ్ఞులం అనుకొంటున్నట్లు తోస్తూంది. తమ విప్లవాన్ని తాము సరిగ్గా నిర్మించుకొన్నామంటే వారికి సంతృప్తి లేదు. ప్రపంచానికంతకూ సలహాలివ్వాలనే కోరికతో వున్నారు. చైనాపార్టీకి మంచివే అయినా కొన్ని యితరులకు మంచివి కాకపోవచ్చు. ఒక ఉదాహరణ చూడండి.

ప్రపంచంలోని కమ్యూనిస్టుపార్టీ లన్నీ మార్క్సిజమ్-లెనినిజానికి కట్టుబడి పనిచేస్తామని తమ నిబంధనావళిలో వ్రాసుకుంటారు. అందరికీ తెలిసిన సంగతి అది. అయితే చైనా కమ్యూనిస్టుపార్టీ తమ అనుభవం మీాదా, తమ విప్లవంయొక్క అవశ్యకతలమీాదా ఆధారపడి, దానికింకొకటి జతచెయ్యటం అవసరం అనుకొన్నారు.

1945 జూన్‌లో జరిగిన తమ పార్టీ 7 వ మహాసభలో వారు పార్టీ నిబంధనావళిని ఆమోదించారు. ఆ నిబంధనావళిలో రెండో అంశం ఇలావుంది—

"పార్టీ సభ్యుని" కర్తవ్యాలివి :

(అ) తనలో చైతన్యాన్ని పెంచుకొనేటందుకూ, మార్క్సిజం - లెనినిజం ప్రాథమిక సూత్రాలను, మావ్-సే-టుంగ్ భావనను తెలుసుకొనేటందుకు కృషి చెయ్యాలి. (పుట 149, పార్టీ గురించి - లీషావ్-చీ.)

ఇందులో 'భావన' ఏదో ఆషామాషీగా గాక ఒత్తి చెప్పారనేది గమనించతగిన విషయం.

అంటే మార్క్సిజం – లెనినిజం ప్రాథమిక సూత్రాలతోపాటు, చైనా పార్టీకి తమజాతి మహానాయకుడయిన మావ్–సే–టుంగ్ భావన బలంకూడ వుందన్నమాట. ఇంకే ఇతర పార్టీలకుంది అలాంటి అదృష్టం? అటువంటి మహావ్యక్తి గాని, ఆయన వ్యక్తి పూజగాని, ఆయన భావన గాని మాకు దరిదాపులలోకూడా వుందనుకొనే అవకాశం లేదు.

ఈ విషయంలో కూడా మేము వారిని అనుసరించవలసిందేనా? తన భావనను అమలు జరిపేటందుకు స్టాలిన్ మిగతావన్నీ చేశాడు, కాని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిబంధనావళిలో లెనినిజంతోపాటు ప్రక్క ప్రక్కన తన 'భావన'ను కూడా చేర్పించేపాటి సాహసం ఆయన చెయ్యలేకపోయాడు. అందులోను సోవియటు కమ్యూనిస్టుపార్టీ 20 వ మహాసభ, 81 పార్టీల సమావేశమూ జరిగిన అనంతరం అటువంటి ధైర్యం, అవకాశం మాకు బొత్తిగా లేవు.

అదే విధంగా చైనా విప్లవంలో జంగ్ – కై – షేక్ 1926 లో విప్లవానికి ద్రోహం చేసిననాటినుంచి మహాహంతకుడుగా ప్రసిద్ధి కెక్కాడు. అయినా 1936 లో జపానువారు చైనాపై దాడిచేసినపుడు, ఆ జంగ్‌తో ఐక్యసంఘటనను చైనా పార్టీ ప్రతిపాదించింది అసంతుష్టి చెందిన సేనాధిపతు లాయనను బందీగా పట్టుకొన్నారు. జపాను వ్యతిరేక ఐక్య సంఘటనకు ఒప్పుకోలేదనీ, ప్రజాతంత్ర సంస్కరణలు ప్రవేశ పెట్టడానికి అంగీకరించలేదని వా రాతనిని చంపివేయ దలచారు. కాని పార్టీ అతనిని విడుదల చేయించింది. అదే సియాన్ సంఘటనగా ప్రసిద్ధి కెక్కింది. అటు తర్వాత కొమింటాంగు ఐక్య సంఘటన కూర్చుకోవటానికి కొన్ని ప్రయత్నాలు చేసింది. కాని అవి ఎంతో అనుమానిస్తూనే చేసింది.

## చైనాపార్టీ : జంగ్-కై షేకు

"కమ్యూనిస్టులు, ఇతర ప్రజాతంత్రవాదులతో సహా ప్రజలంతా కొమింటాంగు ప్రభుత్వంమీద యెన్నో ఆశలు పెట్టుకొన్నారు... కాని

అదంతా నిష్ప్రయోజనమే అయిపోయింది ... ఎంతోమంది దేశభక్తులయిన రాజకీయఖైదీలు ఇంకా జైళ్ళల్లో వున్నారు." [మావ్ సె-టుంగ్-సెలెక్టెడ్ వర్క్సు] తర్వాత రెండో ప్రపంచ యుద్ధకాలంలో ఒక మాదిరి "సంఘటన" ఏర్పడింది. అది భగ్నమయింది. మళ్ళీ ప్రతిపాదించారు. అదీ అల్లాగే జరిగింది. అదంతా చైనా చరిత్రలో ఒక భాగం.

మన ప్రస్తుత సమస్యకుగాని, భారత-చైనా తగాదాకుగాని, ఆ యుద్ధంతో మేము పోలికతేవడం లేదు ఐక్యసంఘటన ఎత్తుగడలను, అందులోనూ ఆ హంతకుడు చంగ్ కై-షేక్ తో చైనాపార్టీ ఎంత ఓపికతో అమలుజరిపిందో చూపడమే మా వుద్దేశం.

మా పార్టీ అటువంటి మంచిస్థితిలోనూ లేదు; మా దేశపు బూర్జువావర్గం ఆ దుర్మార్గానికి పూనుకోనూ లేదు. కాని '30 ఏళ్ళ క్రితం' నాటి పాఠాన్ననుసరించమని మాకు సలహా ఏమిటి ? ఆ ఎంపలతో మాకు విలువ ఏముంది ? వారు చెప్పినట్లు మేము చెయ్యకపోతే, మా పనిలో అడ్డంవచ్చి మావ్ సె-టుంగ్ భావనను మామీద రుద్దడం ఏమిటి, మా పరిస్థితులనూ, మార్క్సిజం-లెనినిజాన్ని అర్థం చేసుకోవడంలో మా పరిజ్ఞానం తక్కువుంటే మాత్రం ?

ప్రతి దేశానికి దాని ప్రత్యేకత లుంటాయి. దాని దారి దానిది. ఇండొనీషియాలోని ప్రత్యేక పరిస్థితులు వేరు. వారి పద్ధతి వారికి వుంది వారిది ఆసియాలోని పెద్ద పార్టీలలోకల్లా రెండోది. జాతీయ విముక్తి వుద్యమంలో మంచి ధీరత్వం చూపించారు. అయినా వారిప్పటికీ "చోదిత ప్రజాస్వామ్యం" లోనే జీవించవలసి వచ్చింది. అధ్యక్షుడు సోకర్నో అదుపులో వుంటున్న సైనిక పరిపాలనలోని చిక్కులన్నింటికి తలవొగ్గి వుండవలసి వస్తూంది.

వారి ఐక్య సంఘటనలూ, వారి మైత్రీసంఘటనలూ వారి ప్రత్యేక పరిస్థితులకు అనుగుణం. సోకర్నో నాయకత్వాన మిశ్రమ ప్రభుత్వంలో పార్టీ కూడా కలిసివుంది. అలా అయినా జీవిత వ్యయ ప్రమాణం ఎంతగానో పెరిగిందనీ, కార్మికులు బాధపడుతున్నారనీ ఈ మధ్య వచ్చిన నివేదికనుంచి తెలుస్తూంది ప్రభుత్వంలో చేరి

బూర్జువా వర్గంతో సహకరించి పనిచేస్తున్నా, పార్టీ ఆ సమస్యను పరిష్కరంచలేకనే పోయిందని ఆ పార్టీ అధ్యక్షుడు ఐదిత్ చెప్పాడు. అయినా ఇండొనీషియాలోని వివిధశక్తుల బలాబలాలు, అది నిర్వహించవలసిన సామ్రాజ్యవాద, ఫ్యూడల్ వ్యతిరేక బాధ్యతలు గమనించి, ఆ పంథాను అనుసరించవలసి వస్తూంది అన్నారు. అల్లా చేస్తున్నందుకాయన్ని విమర్శించాలా ? మేము మాత్రం అటువంటి పనిచెయ్యం. వాళ్ళ మంచి వాళ్ళెరుగుదురు.

అదే విధంగా భారతదేశంలో మేముకూడా మార్క్సిజం – లెనినిజం పునాదిమీద మా మార్గాన్ని వెతుక్కోవాలి. చైనావారిది కానీండి, రష్యా వారిది కానీండి, బ్రిటిష్ వారిది కానీండి, ఇండొనీషియాది కానీండి, ఇతరుల పంథా మాకు నప్పదు. అయితే అందరి అనుభవాలు చూసి నేర్చుకోడానికి సందేహంలేదు. ఎనభైయొక్క పార్టీల సమావేశం నడవవలసిన దిక్కు చూపింది. మార్గం వేసుకొనే పని మాది. అలాంటప్పుడు చైనా నాయకత్వం మాలో చీలికలు తెచ్చే పనికెందుకు పూనుకోవాలి ?

నేడు ప్రపంచ కమ్యూనిస్టు వుద్యమంలో ఐక్యత ఏకాభిప్రాయం మీద ఏర్పడాలి. అంతేగాని ఎవరి భావనో తప్పు చేయజాలదనే పద్ధతి మీద మాత్రం కాదు.

# 7

# ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంతో భారత కమ్యూనిస్టుల ఐక్యత

**నవంబరు 21వ తేదీ రాత్రి చైనా తనంతట తాను యుద్ధ విరమణ ప్రకటన చేయడం, డిసెంబరు 1 వ తేదీనుండి సైన్యాలను అదివరకు 'ఆచరణలో స్వాధీనంలో వున్న రేఖ' వరకు ఉపసంహరించుకోవడం సముచితమైనదే. వారుకూడ నిజంగా శాంతియుత పరిష్కారం కోరుతున్నారని ప్రపంచానికి మరల ఒకసారి కన్పించవచ్చు.**

భారత దేశం తనవైపునుంచి కూడ యుద్ధ వివరణను అమలు జరుపుట ద్వారా సహకరించింది. "ఆచరణలో స్వాధీనంలో వున్న రేఖ" వరకుగాక 1962 సెప్టెంబరు 7 వ తేదీ నాటికి వున్న స్థావరాలకు సైన్యాలను ఉపసంహరించుకుంటే, సంప్రతింపులు ప్రారంభించడానికి సంసిద్ధతను తెలిపింది

యుద్ధవిరమణానంతరం మరొక వాదన బయలుదేరింది. "ఆచరణలో స్వాధీనంలో వున్న రేఖ" అంటే 1959 నాటికి చైనా స్వాధీనంలో వున్న ప్రాంత మని ప్రకటించారు. ఈ రేఖ భారత ప్రభుత్వ మడిగిన 1962 సెప్టెంబరు 7 వ తేదీకి వున్న శ్రేణికంటే కూడ కొన్ని విషయాలలో మెరుగని చైనావారు వాదించారు. అలాంటపుడు 1962 సెప్టెంబరు 7 వ తేదీ శ్రేణిని ఎందుకు అంగీకరించరు ?

ఈ లోగా అరబ్ రిపబ్లిక్, ఘనా, సింహళం బర్మా, ఇండోనీషియా, కంబోడియాప్రభుత్వాల ప్రతినిధులు సమావేశమై, ఉభయుల సైన్యాలను ఎచటికి ఉపసంహరించాలనే సమస్యపై మధ్యవర్తిత్వం వహించడానికీ, శాంతియుత సంప్రతింపులకు అవకాశం కలగజేయడానికి పూనుకున్నారు. ఈ తగాదాలో పై ఆరు కొలంబో రాజ్యాల మధ్యవర్తిత్వానికి ఉభయులూ అంగీకరించారు.

## కొలంబో రాజ్యాల ప్రతిపాదనలు

ఆరు కొలంబో రాజ్యాల ప్రతిపాదనలు వివరణలతో సహా భారతదేశానికి, చైనాకు అందజేయబడ్డాయి. భారతప్రభుత్వం వాటిని పూర్తిగా అంగీకరించింది. ఇండియా అంగీకారం తెలుపకముందు, చైనా నాయకత్వం సుముఖత్వాన్ని (పాజిటివ్ రెస్పాన్స్) తెలిపింది కాని భారతదేశం పూర్తి అంగీకారం తెలిపి, చైనాకూడా అలాగే అంగీకరించాలని కోరినపుడు, చైనా నాయకత్వం నిరాకరించింది.

కొలంబో సమావేశ నాయకులు ఉభయపక్షాలకు ఒకేరకమైన వివరణలు యివ్వలేదనికూడ చైనా ప్రముఖులు కొందరు ఒక దశలో వాదించారు. ఇది సరికాదని కొలంబో సమావేశకర్తలు నిరూపించిన తర్వాత, చైనా నాయకులు ఏమీా చెప్పకుండా తటపటాయించారు ; కాని కొలంబో ప్రతిపాదనలను అంగీకరించక ప్రతిష్టంభన కలిగించారు.

భారతదేశంలోని అభివృద్ధి నిరోధకులు, ప్రపంచ సామ్రాజ్య వాదులు తమ కుట్రలను కొనసాగించడానికి ఈ ప్రతిష్టంభన అవకాశం కలిగించింది.

ఆసియా – ఆఫ్రికా తటస్థ దేశాలైన ఆరు కొలంబో రాజ్యాలు చైనా – భారతదేశాలు రెండింటికి మిత్రులే. కాని వారి ప్రతిపాదనలను కూడ చైనా నిరాకరించుటద్వారా ఏకపక్ష యుద్ధవిరమణవల్ల కలిగించిన సదభిప్రాయాన్ని చైనా కోల్పోయింది. యుద్ధవిరమణను "కనివిని యెరుగని ఔదార్యమ"ని మెచ్చుకున్నవారు సైతం, కొలంబో ప్రతిపాదనలను చైనా అంగీకరించకపోవడంపట్ల ఆశ్చర్యచకితులయ్యారు.

భారత డిటెన్షన్ క్యాంపుల్లో చైనా పౌరులను వేధించడం, బాధించడం గురించి అనేక ఆరోపణలు చేసిన అనంతరం, చైనా ప్రభుత్వం తమ స్వాధీనంలోవున్న భారత ఖైదీ లందరినీ విడుదలచేస్తామని ప్రకటించింది. భారతదేశంలోవున్న చైనాజాతీయులు స్వదేశానికి వెళ్లాలని కోరితే, వారి తరలింపుకు చైనా తన ఓడలను పంపితే ఆమోదించడానికి భారతప్రభుత్వం సంసిద్ధతను తెలిపింది.

యుద్ధవిరమణానంతరం, కొలంబో రాజ్యాల మధ్యవర్తిత్వం తర్వాత భారతదేశంలో పరిస్థితికొంతమార్పు చెందినప్పటికీ కొలంబో ప్రతిపాదనలను చైనా అంగీకరించకపోవడంవల్ల సందిగ్ధావస్థ అలాగే కొనసాగింది. "చైనా మరల ఎపుడు మొదలిడుతుంది?" అనే ప్రశ్నకు సమాధాన మొస్తుందా అని ప్రజలు ఆతురతతో చెవి యొగ్గుతున్నారు. 1963 ఏప్రిల్ 15వ తేదీన సమావేశమైన కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యనిర్వాహకవర్గం యిలా తీర్మానించింది :

**"తాను ఏకపక్షంగాచేసిన ప్రతిపాదనలకోసం చైనా ప్రభుత్వం అసంబద్ధంగా పట్టుబడుతూ, భారతదేశానికి వ్యతిరేకంగా దుష్ప్రచారం సాగిస్తూండడానికి కేంద్ర కార్యవర్గం సంతాపం తెలుపుతూంది.**

"ఇండియా – చైనాల సంబంధాలలో ప్రతిష్టంభన కొనసాగడం వలన రాజకీయ వాతావరణంలో చైనా అంటే అనుమానమూ, బెరుకూ నిలచిపోతుంది. భారతదేశంలోని మితవాదశక్తులు సామ్రాజ్యవాదుల నుంచి సైనిక సహాయం తెచ్చుకోవాలనే ప్రచారానికి దానిని సాధనంగా ఉపయోగించుకొంటున్నారు. నెహ్రూ ప్రభుత్వంయొక్క అభివృద్ధికర విధానాలను సవాలుచేస్తున్నారు. ఇండియా – చైనాలమధ్య సంప్రతింపులు జరగరాదనీ, శాంతియుత పరిష్కారం జరగరాదనీ కోరే వారినే చైనా దృక్పథం బలపరుస్తూంది.

"చైనావారి మొండితనమూ, బెదిరింపు వుత్తరాలూ, విచ్ఛిన్నకరములయిన వ్యవహారాలూ అన్నీ కలిసి పశ్చిమ రాజ్యాలనుంచి అధికాధికంగా సైనిక సహాయం కోరేటట్లు చేస్తున్నాయి. దానివలన కలిగే

పరిణామాలు చాల ప్రమాదకరంగా వుంటాయి. భారతదేశాన్ని అంతరంగికంగానూ, అంతర్జాతీయంగానూ బలహీన పరుస్తాయి.

**"అమెరికా తెస్తున్న 'ఆకాశ గొడుగు' ప్రతిపాదన విషయంలోనూ, భారత భూభాగంమీద ఆశ్రయాలు కావాలనే కోరిక విషయంలోనూ ప్రజలు జాగరూకులై వుండాలని కేంద్ర కార్యవర్గం ప్రబోధిస్తూంది.**

"అంతే కాదు. కాశ్మీరును పాకిస్తానుచేతుల్లో పెట్టడానికి అంగీకరిస్తేనే ఆర్థిక – సైనిక సహకారాన్ని కొనసాగిస్తామన్న తమ అభిప్రాయాన్ని అమెరికా ప్రభుత్వం దాచుకోలేదు."

తీర్మానమింకా ఇలా చెబుతోంది : "భారతదేశం అనుసరిస్తున్న మూల విధానాలు మారాలన్న అమెరికా డిమాండును భారతప్రభుత్వం నిరాకరించింది. కాని, అత్యవసర పరిస్థితుల పేరున ఎన్నో సౌకర్యాలను కలిగించింది. ఢిల్లీలో అమెరికా సైనిక రాయబారవర్గం వుండడానికి అంగీకరించింది. పరిశీలనా వగైరాలు సాగించేటందుకు అమెరికా సైనిక పరిశీలకులకు హక్కు నిచ్చింది ఆ విధంగా వారు రక్షణవ్యవహారాలలో జోక్యం కలిగించుకునేటందుకు అనుమతించింది. భారత దేశపు తటస్థవిధానానికి వ్యతిరేకంగా వత్తిడి హెచ్చుగా సాగించేటందుకూ, భారతదేశపు సర్వతంత్రాధికారాన్ని నష్టపరిచేందుకూ, దీనివలన అమెరికన్ సామ్రాజ్యవాదులకు ప్రోత్సాహం లభిస్తూంది.

"స్వతంత్రంగా తన శక్తిమీదనే ఆధారపడిన దేశరక్షణ విధానాన్ని భారతదేశం దృఢంగా అనుసరించినట్లయితే, మనకు కావలసిన సైనిక అవసరాలన్నిటిని మిత్రదేశాలనుంచి తెచ్చుకోగలుగుతాం. మన మూలవిధానాలను వదులుకోనక్కరలేదు. సామ్రాజ్యవాదుల ఒత్తిడికి లొంగితే, భారతదేశంలో మితవాద శక్తులకు ప్రోత్సాహం కలిగిస్తుంది. తటస్థతను బలహీనపరుస్తుంది. శాంతికాముక దేశాలన్నింటా నిరుత్సాహం కలుగుతుంది.

"చైనాతో మనకున్న తగాదాను సైనిక పద్ధతులలో పరిష్కరించుకోడానికి భారతదేశం వ్యతిరేకమని ప్రధాని నెహ్రూ పదేపదే చెప్పారు. రాయబారాలు విఫలం అయితే, మధ్యవర్తి పరిష్కారానికి

నివేదించుదామని భారత ప్రభుత్వం చేసిన ప్రతిపాదనను భారత కమ్యూనిస్టుపార్టీ పూర్తిగా బలపరుస్తూంది.

## పన్నుల ప్రతిపాదనలకు వ్యతిరేకత

ప్రతిష్టంభన కొనసాగడం, యుద్ధంలాంటి పరిస్థితి వుండటం వల్ల దేశరక్షణకు, అభివృద్ధి కార్యకలాపాలకు అదనంగా ఆర్థిక వనరులను చేకూర్చుకోవలసి వుంటుంది. రక్షణావసరాలకు అదనంగా డబ్బవసరమని, ఎక్కువ పన్నులు పడతాయనీ ప్రజలెరుగుదురని కొత్త సంవత్సర బడ్జెటు తయారుచేసినవారు గుర్తించారు. ప్రజలపైన భారమైన పన్నులను కొత్త బడ్జెటు విధించింది.

కొత్తపన్నులు తమపైనే అతి భారంగా పడినందుకు శ్రామిక ప్రజలు వ్యతిరేకించారు. 1963 ఏప్రిల్ 14వ తేదీ కేంద్ర కార్యనిర్వాహకవర్గం చేసిన తీర్మానంలో ఈ విషయం గుర్తించబడింది. "జాతీయాభివృద్ధికి, జాతీయ రక్షణకు అవసరమైన ఆర్థిక వనరులు : బడ్జెటు ప్రతిపాదనలు" అను తీర్మానంలో యిలా స్పష్టపరచింది :

"మన ఆర్థికాభివృద్ధిని కొనసాగించడానికి, దేశరక్షణశక్తిని పెంపొందించడానికీ, అదనపు ఆర్థిక వనరులను సమకూర్చుకోవాలన్న విషయంలో రెండభిప్రాయాలు వుండజాలవు. అవసరమైన వనరులను ఎలా ఎచట సమకూర్చుకోవా లన్నదే ప్రశ్న.

"దేశ ప్రయోజనాలను రక్షించాలిసిన అవసర మొచ్చినపుడు ఎంత త్యాగమైనా చేయడానికి ప్రజలు సంసిద్ధమేనని గత కొలది నెలల చరిత్ర రుజువు చేసింది. జీవితావసరాలు తీరక బాధపడుతున్నప్పటికీ, మన దేశంలోని శ్రామికప్రజలు రక్షణనిధికి ఎక్కువగా విరాళాలిచ్చారు. కోటీశ్వరులు, గుత్తవ్యాపారులు, తదితర భాగ్యవంతులు అలాంటి త్యాగనిరతిని చూపలేదు. తద్విరుద్ధంగా అత్యవసర పరిస్థితిని వినియోగించుకుని, అధికలాభాలను గడించడానికి పూనుకున్నారు. అందుచేత జాతీయావసరాల దృష్ట్యా, భాగ్యవంతులపైన ఎక్కువ పన్నులు విధించే ప్రతిపాదనలు కొత్త బడ్జెటులో వుంటాయని ఆశించబడింది.

"భాగ్యవంతుల నుండి అదనపు పన్నుల ద్వారాను, మన ఆర్థిక విధాన మంతటికి కీలకమైన బ్యాంకులను, నూనెపరిశ్రమ వగైరా జాతీయం చేయడం ద్వారాను ఆర్థికవనరులను చేకూర్చుకోడానికి బదులు, ఇదివరకే పన్నులభారంతో క్రుంగుతున్న ప్రజాసామాన్యంపై కొత్త బడ్జెటు ప్రతిపాదనలు అదనపు భారాన్ని వేశాయి.

"ఎక్సైజు సుంకాలు పెంచడం వల్లనూ, నిర్బంధ పొదుపు వల్లనూ, ఆదాయపుపన్నుపై సర్‌చార్జీ వేయడంవల్లనూ డబ్బు సేకరించాలని కేంద్ర బడ్జెటు ప్రతిపాదించింది. జీవితావసర వస్తువులన్నిటిపైనా యిదివరకే పన్నులున్నాయి. ఐనప్పటికి కిరోసిన్, పుగాకు, పంచదార, తేయాకు, సబ్బు, కార్డులు వగైరాపై అదనంగా పన్నులు వేశారు."

అందుచేత బ్యాంకులను, నూనె కంపెనీలవంటి కొన్ని గుత్త వ్యాపార సంస్థలను జాతీయం చేయడంద్వారా ఆర్థికవనరులను చేకూర్చుకోవాలనీ, ప్రజాసామాన్యంపై అదనపుభారం వేయరాదనీ తీర్మానం స్పష్టపరచింది.

పై తీర్మానాలు ఏమి సూచిస్తున్నాయి? నవంబరులో యుద్ధ సంక్షోభం ఏర్పడినపుడు అత్యవసర పరిస్థితుల్లో దేశరక్షణకు సర్వ విధాల తోడ్పడాలని పిలుపు యిచ్చినప్పటికి, ప్రజల ప్రయోజనాలను రక్షించడం వదలి వేయలేదు. దేశరక్షణకు, అభివృద్ధికి డబ్బు అవసరమనిగుర్తిస్తూనే, ఆ వనరులు ఎచట వున్నాయోకూడ పార్టీ సూచించింది. సంపదను ఉత్పత్తిచేసేవారిపైన నిజంగా దేశరక్షకులైన శ్రామిక వర్గాలపైన, మోయలేని బరువు వేయరాదని, బ్యాంకులు వగైరా స్వాధీనం చేసుకోవాలని సూచించింది. బీద ప్రజలను దెబ్బతీయడం, ధనికులను రక్షించడం దేశరక్షణకు అవసరంకాదని నిరూపించింది. మేము అనుసరించాల్సిన పంథా అదే; అలాగే మేము ఆలోచించాం.

ఈ దశలో సైతం కార్మిక సంఘాలు ప్రభుత్వాన్నుంచి, యజమానుల నుండి వేతనాల పెంపుదలను, తదితర సౌకర్యాలను సంపాదించాయి. కార్మిక సంఘ కార్యకర్తలపై దాడి జరిగినప్పటికీ, ఇనుము, ఉక్కు పరిశ్రమలలోనూ, బొగ్గు పరిశ్రమలలోనూ, కాఫీ పనివారికి, జీవిత భీమా కంపెనీ పనివారలకు జీతాల విషయంలో అనుకూలమైన తీర్పు

లను, ఒడంబడికలను సాధించుకున్నాం. చైనా నాయకత్వం నిందా ప్రచారం చేస్తున్నట్లుగా కార్మికుల వర్గ హక్కుల రక్షణను అఖిల భారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు విడనాడలేదు.

అత్యవసర పరిస్థితిని వినియోగించుకుని గుత్తవ్యాపారులు ప్రయివేటు పెట్టుబడుల స్థానాన్ని బలపరచుకునేందుకు ప్రయత్నించారు. వృద్ధిపొందుతున్న ప్రభుత్వరంగంలోని ఓడల నిర్మాణం, నూనెపరిశ్రమ వగైరాల్లోకి చొరబడటంలో కొంత విజయం సాధించారు. దొంగ బంగారం దిగుమతులను ఆపుచేసేందుకు, బంగారు ధరను తగ్గించేందుకు, ప్రవేశపెట్టబడిన బంగారం కంట్రోల్ ఆర్డరు వారికి రుచించలేదు. స్పెక్యులేషన్ మార్కెట్టులు కొన్నిటిని నిషేధించడంకూడ వారికి గిట్టలేదు.

సామ్రాజ్యవాదుల కూటమితో వర్తకం, "సహాయం" పెంపొందించుకునేందుకు ఒడంబడికలు జరిగాయి. అలాగే సోషలిస్టుదేశాలతో వర్తకం, వారి సహాయంకూడా పెరిగింది. తద్వారా స్వతంత్ర భారత ఆర్థిక విధానం బలపడింది.

కొత్త సంవత్సరంలో అభివృద్ధిచెందుతున్న పరిస్థితులను గురించి మా పార్టీ దృక్పథ మిది.

దేశరక్షణను బలపరచుతున్నప్పటికీ ప్రజా హక్కుల రక్షణను విడనాడనందుకు ప్రతీఘాతక శక్తులూ, ప్రభుత్వమూ, పార్టీనాయకులను, కార్మిక నాయకులను అరెస్టు చేశారు. మా పార్టీని బలహీనపరచేందుకు, విచ్ఛిన్నం చేసేందుకు ప్రయత్నించుతున్నారు.

## కమ్యూనిస్టుల విడుదలకై ఆందోళన

పార్టీ జాతీయ సమితి కేంద్రకార్యదర్శివర్గం, మా కామ్రేడ్స్ విడుదలకై అనేక చర్యలు తీసుకొంది. మొదట అరెస్టులు సాగిన నాటినుండి నేటివరకూ అనేక రాయబారాలు నడిపాము. ప్రధానినీ, హోం మంత్రినీ, రాష్ట్ర ముఖ్యమంత్రులనూ ఇందుకోసం అనేకసార్లు కలుసుకున్నాం.

కామ్రేడ్స్‌ను విడుదల చేయాలని కోరుతూ పెద్ద మీటింగులు జరిపాము. పార్లమెంటులోనూ, రాష్ట్రశాసన సభల్లోనూ, అరెస్టయిన కామ్రేడ్స్‌పై వేసిన అభాండాలకు జవాబు చెప్పేందుకు ప్రశ్నలు వేయబడినాయి. పార్టీ పత్రికలన్నీ వారి విడుదలకై ఆందోళన సాగించాయి. ఈ ఉద్యమ ఫలితంగా కొన్ని రాష్ట్రాలలో అనేక మంది కామ్రేడ్సు జైళ్ళ నుండి విడుదల అయారు. మిగిలిన కామ్రేడ్సు విడుదల జరిగే వరకూ యీ ఉద్యమం కొనసాగుతుంది.

ప్రతి రాష్ట్రంలో ఈ ఉద్యమం కొత్త బలాన్ని పెంపొందించుకుంటూవుంది. కార్మిక ప్రజలపైన, కష్టపడి పని చేసే మేధావుల జీవితంపైన గుత్త పెట్టుబడిదారులు చేసే దాడికి వ్యతిరేకంగా, కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన, ఎర్రజండా నాయకత్వాన బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరుగుతున్నాయి.

ఉదాహరణకు తమిళనాడులో, స్వతంత్రపార్టీకి, దాని అభివృద్ధి నిరోధక విధానాలకు వ్యతిరేకంగా 40 వేలమంది ప్రజలు పెద్ద ప్రదర్శన చేశారు. కార్మికవర్గంనుండి, కష్టపడి పనిచేసే రైతాంగంనుండి వేల కొలదిమంది కొత్తగా పార్టీ సభ్యులుగా చేరుతున్నారు.

అనేక రాష్ట్రాలలో, పార్టీనిధి ఉద్యమానికి ఉత్సాహపూరితమైన ప్రోత్సాహం లభించింది. ప్రజానీకానికి ద్రోహంచేసిన పార్టీ, మార్క్సిజం – లెనినిజంను గంగలో కలిపి "రివిజనిజం" అవలంబించిన పార్టీ స్వరూపం ఇలాగే ఉంటుందా ?

కొలంబో సూచనలను ఆమోదించే విషయంలో చైనా నాయకులు అవలంబించే వైఖరి ప్రచ్ఛన్న యుద్ధానికి దారితీసింది. దానివల్ల మొత్తం భారత కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా అత్యవసర పరిస్థితిని శాశ్వతంగా ఉంచాలనే, భారత కమ్యూనిస్టుపార్టీపై మొత్తంగా దానిని ఉపయోగించాలనే అభివృద్ధినిరోధకులకు ఒలాన్నిచ్చింది.

ప్రజాతంత్ర శక్తులను విభజించుటద్వారా, అభివృద్ధినిరోధక శక్తులు కమ్యూనిస్టు వ్యతిరేక ఆందోళనను కొనసాగించుతూ వచ్చాయి. అయినప్పటికీ, ఈ చిక్కులకు వెనుకాడక, కమ్యూనిస్టుపార్టీకి చెందిన వివిధయూనిట్లు, తమ విధిని అచంచలంగా నెరవేర్చుతున్నాయి.

# చీలికలు పెట్టేవారికి వ్యతిరేకంగా ఐక్యతను కాపాడండి

ఆ విధంగా, నవంబరు తీర్మానం ప్రధాన పోకడ, మితవాద అభివృద్ధినిరోధక ఎత్తులను చెడగొట్టింది; పార్టీని ప్రజలనుండి వేరుచేసి తద్వారా దానిని చంపాలని కోరుకొనే మితవాద అభివృద్ధి నిరోధకుల, సామ్రాజ్యవాదుల ఎత్తుగడలను విఫలం చేసింది. పార్టీ తన స్థావరాలకు, తన వర్గానికి అంటిపెట్టుకొని యుండేటట్లు చేసింది.

తర్వాత పరిస్థితిలో వచ్చిన మార్పులు, దాని ననుసరించి చేసిన తీర్మానాలు గుత్తవ్యాపారులకు, పెద్దభూస్వాములకు, వారి స్వార్థపరాన్న భుక్తత్వ ప్రయోజనాలకూ వ్యతిరేకంగా, ప్రజలను కార్యోత్సాహకులుగా చేయడానికి, దేశ ప్రయోజనాలతో ప్రజల వర్గ ప్రయోజనాల రక్షణను సమన్వయపరచడానికి తోడ్పడ్డాయి.

ప్రజానీకం మనస్సులను వశపరచుకొని వారిపై జాతీయ విరుద్ధమైన, ప్రజా వ్యతిరేకమైన తమ విధానాలను రుద్దాలనిచూసే సామ్రాజ్యవాదుల, మితవాద అభివృద్ధినిరోధకుల ఆటను, మరింత అభివృద్ధి చెందిన పార్టీప్రధాన పోకడ విఫలం చేసింది.

ఈ విషయాలను చైనా నాయకత్వం బహుసులభంగా విస్మరించవచ్చు. కాని పెద్ద రణగొణధ్వని ద్వారా, ప్రపంచంలోని అభ్యుదయ శక్తులకు సత్యం చెప్పకుండా అది దాచలేదు.

అభివృద్ధినిరోధకులు దాడి చేస్తున్నా, కమ్యూనిస్టుపార్టీకి వ్యతిరేకంగా ప్రభుత్వం అత్యవసర పరిస్థితి చట్టాలను ఉపయోగించుతున్నా, దేశ అభివృద్ధి, రక్షణల అవసరాలను బలపరచాలనే ఉద్యమంతో కలిపి ఈ క్రింది మూడు ఉద్యమాలు భారత కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన కొనసాగాయి.

అవి : కార్మికుల, శ్రామికప్రజల జీవనస్థాయిని రక్షించే ఉద్యమం, బడ్జెటులో విధించిన బీదలపై పన్నులకు వ్యతిరేకంగా ఉద్యమం, కమ్యూనిస్టు ఖైదీల విడుదలకై ఉద్యమం,యివిచైనాకమ్యూనిస్టుపార్టీ చేసే

అబద్ధపు, నిందాపూర్వక ఆరోపణలకు, దానిని బలపరచేవారికి ఇవి తిరుగులేని జవాబులు.

ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ ప్రయోజనాలకు విరుద్ధంగా, చైనా నాయకత్వం ఈ ఆరోపణలద్వారా, భారత కమ్యూనిస్టుపార్టీ అనుయాయులలో చీలికకు వాస్తవంగా పిలుపిచ్చింది.

ప్రపంచ వ్యాపితంగా, మార్క్సిస్టు-లెనినిస్టులకు మిక్కిలి ప్రియతమమైన అంతర్జాతీయ కమ్యూనిస్టు ఐక్యత, భారత కమ్యూనిస్టుపార్టీ ఐక్యత రక్షింపబడుతుందనీ, చైనా నాయకత్వానికి చివరకు జ్ఞానోదయమవుతుందనీ, చీలికలు కల్గించే కార్యకలాపాలను వారు మానుకొంటారనీ మేము విశ్వసించుతున్నాం.

చీలికలు కల్గించే ప్రతిచర్యను ఓడించడానికీ, కమ్యూనిస్టు ఐక్యతా పతాకను నిలబెట్టడానికీ, భారత కమ్యూనిస్టుపార్టీ తన సర్వశక్తులనూ ఒడ్డి పని చేస్తుంది.

# అనుబంధం

## "రివిజనిస్టుల ప్రతిబింబం"

("పీపుల్స్ డెయిలీ" 1963 మార్చి 9వ తేదీ సంపాదకీయం)

భారత ప్రజలకు, కమ్యూనిజానికి, చైనాకు వ్యతిరేకంగా భారతదేశపు బడా బూర్జువావర్గం, బడా భూస్వాములకు చెందిన పాలకముఠాలు పెద్దపెట్టున సాగించిన ప్రచారోద్యమాన్ని అవకాశంగా తీసికొని, డాంగే నాయకత్వాన రివిజనిస్టుల ముఠా గత 12 నెలలలో భారత కమ్యూనిస్టుపార్టీ నాయకత్వాన్ని కైవసం చేసుకొంది. వారు మార్క్సిజం – లెనినిజంకు, శ్రామికవర్గ అంతర్జాతీయతకు ద్రోహం చేశారు. భారతదేశ ప్రజల, శ్రామికుల విప్లవ ఆశయానికి ద్రోహం చేశారు. జాతీయ దురహంకార పంథాను, వర్గదాసోహ మార్గాన్ని చేపట్టారు. ఆ విధంగా భారత కమ్యూనిస్టుపార్టీలో పూర్తిగందరగోళాన్ని సృష్టించారు. భారతదేశ బడాబూర్జువాలకు, బడాభూస్వాములకు అనుబంధంగా, నెహ్రూ ప్రభుత్వానికి బంటుగా భారత కమ్యూనిస్టుపార్టీని మార్చడం వారి ఉద్దేశం.

డాంగే అండ్ కంపెనీ (ముఠా) ఎంత దిగజారిపోయారు ? 1962 నవంబరు 14 న, ప్రధాని నెహ్రూ జన్మదినోత్సవ సందర్భంగా ఆయనకు అభినందనలు తెలియజేస్తూ డాంగే వ్రాసిన లేఖను మొదట చూద్దాం.

ఇదీ ఆ లేఖ పూర్తి పాఠం :

"ప్రియమైన పండిట్ జీ,

మీ 73 వ జన్మదినోత్సవ సందర్భాన భారత కమ్యూనిస్టుపార్టీ తరఫున, మా హృదయపూర్వక అభినందనలను తెలియజేస్తున్నాము.

జాతీయ స్వాతంత్ర్యంకోసం భారతజాతి సాగించిన పోరాటంలో మీరు దానిని ఉత్సాహపరచి వీరోచితంగా నడిపారు.

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాతికాలంలో, ప్రణాళికాబద్ధ అభివృద్ధి, ప్రజాతంత్రం, సోషలిజం, శాంతి, తటస్థత, వలసవిధాన ప్రాతికూల్యం–అనే విధానాలు అవలంబించే నూతన భారతదేశానికి పునాదులను మీరు వేశారు.

చైనా దురాక్రమణవల్ల ఉత్పన్నమయిన ఈ తీవ్ర సంక్షోభ సమయంలో, ఈ నాడు, దేశగౌరవం, ప్రతిష్ఠ, సార్వభౌమాధికారాలను రక్షించడానికి దేశం యావత్తూ ఒక్క వ్యక్తిలా మీ ప్రక్కన నిలబడింది.

'జాతీయ రక్షణ, జాతీయ ఐక్యత' అనే మీ విధానాలను బేషరతుగా బలపరచడానికి భారత కమ్యూనిస్టుపార్టీ వాగ్దానం చేస్తున్నది.

సంపద్వంతమైన సోషలిస్టు దేశాన్ని నిర్మించాలనే మీ ఆశయాలు నెరవేరేందుకు మీరు చిరకాలం జీవించాలని కోరుతున్నాను.

భవదీయుడు,

ఎస్. ఎ. డాంగే"

భారత కమ్యూనిస్టుపార్టీ ఛైర్మన్.

ఇది మామూలు మర్యాదకోసం వ్రాసిన ఉత్తరం కాదు. ఈ ఉత్తరంలో (1) డాంగే, భారత అభివృద్ధి నిరోధకుల పక్షాన పూర్తిగా నిలబడుతున్నారు. సోషలిస్టు చైనాను తీవ్రంగా ఎదిరించుతున్నారు. (2) చైనాకు వ్యతిరేకంగా, కమ్యూనిజానికి వ్యతిరేకంగా భారత ప్రజలకు వ్యతిరేకంగా ఉద్దేశింపబడిన నెహ్రూ ప్రభుత్వ "జాతీయ రక్షణ, జాతీయైక్యత విధానాల"ను భారత కమ్యూనిస్టుపార్టీ

బలపరుచుతుందని డాంగే వాగ్దానం చేస్తున్నారు. ఆ బలపరచటం కూడా సాధారణంగా గాక, "బేషరతుగా బలపరచు" తున్నారు. (3) భారతదేశంలో సోషలిజం తేడానికి బడాబూర్జువా, బడా భూస్వాముల ప్రతినిధియైన నెహ్రూపైన డాంగే ఆధారపడుతున్నారు.

భారతదేశ శ్రామికవర్గ ద్రోహానికి డాంగేముఠా చేసిన ప్రమాణమే ఈ ఉత్తరం; భారతీయ బడా బూర్జువాలకు, బడా భూస్వాములకు, నెహ్రూ ప్రభుత్వానికి తాము అమ్ముడుపోతూ వ్రాసిన ఖరారు పత్రం అది.

1959లో చైనా-భారత సరిహద్దు సంఘర్షణను నెహ్రూ ప్రభుత్వం రెచ్చగొట్టిననాటనుండీ, డాంగే ముఠా తమ రివిజనిస్టు స్వభావాలను మరీ మరీ స్పష్టంగా బయట పెడుతూ వచ్చింది. గత మూడేళ్లుగానో ఆపైనో, బడా బూర్జువా, బడా భూస్వాముల వైఖరితో వారు ఏక మయ్యారు; చైనా వ్యతిరేక ప్రచారంలో నెహ్రూ ప్రభుత్వానికి కృపాణ ధారులుగా, ఆ ప్రభుత్వాన్ని వెనక వేసుకు వచ్చేవారుగా పనిచేశారు.

1. భారత - చైనా సరిహద్దు విషయంలో చారిత్రక పూర్వ రంగాన్ని, వాస్తవ పరిస్థితిని గమనించకుండా, చైనానుండి తనకు రావాల్సిన భూభాగాలంటూ నెహ్రూ ప్రభుత్వం చెప్పేవాదనలను డాంగే ముఠా బేషరతుగా బలపరచింది. భారత - చైనాసరిహద్దులోని తూర్పురంగంలో, అక్రమమైన మాక్‌మాహన్ శ్రేణి "దాదాపు ఎల్ల ఏర్పరచిన సరిహద్దు శ్రేణి"యేనని వారు వాదించుతున్నారు; అది "భారతదేశ సరిహద్దు" అని అంటున్నారు. భారతచైనా సరిహద్దులోని పడమటి, మధ్యరంగాల్లో నెహ్రూ ప్రభుత్వపు అసమర్థనీయమైన వాదనలను "కరెక్టు" అని వారు వర్ణించుతున్నారు.

2. దేశంలోను, విదేశాలలోను తమ రాజకీయ అవసరాలకు గాను భారత పాలక ముఠాలు కావాలని సరిహద్దు ఘర్షణను రెచ్చగొట్టారనే విషయాన్ని పూర్తిగా త్రోసిపుచ్చి, డాంగేముఠా, "భారత దేశ పరిస్థితిపై చైనాకు తప్పుడు రాజకీయ అవగాహన వుందనీ, అందు చేత ఈ తగాదా సృష్టించబడిందనీ" ఆరోపించుతూ, సరిహద్దు సంఘర్షణకు బాధ్యతను చైనాపై నెట్టడానికి ప్రయత్నించారు.

3. గత మూడేండ్లుగానూ, అంతకుముందూ, భారత సైనికులు చైనాపై నిరంతరం చేస్తున్న అక్రమణలను బయటపెట్టడానికి బదులుగా, నెహ్రూను అనుసరించుతూ డాంగే ముఠా, అనేకసార్లు భారతదేశపు అభివృద్ధి నిరోధక పాలకముఠాల అభీష్టాలకు అనుగుణంగా, చైనాను మిక్కిలి చెడ్డగా నిందించి దాడిచేశారు. చైనా "నమ్మకద్రోహం చేసింది" అని అన్నారు. "సాయుధబలంతో భారతదేశంతో సరిహద్దు వివాదాన్ని పరిష్కరించుకోవాలని చైనా కోరుతూంది"ని అన్నారు. "తమ పాత చక్రవర్తులనాటి పాత భూగోళ పటాలనుగురించి" చైనా "పట్టుబట్టుతున్నది" అని వారన్నారు.

"తన చారిత్రక, భౌగోళిక, జాతీయరాజ్యం అని భావించే రూపాన్ని పునరుద్ధరించాల"ని చైనాకు "అమితమయిన పట్టుదలతో కూడిన అత్యాశవున్నద"ని అన్నారు. "తన పొరుగువానికి వ్యతిరేకంగా, సోదరునికి వ్యతిరేకంగా", "ఒక అంగుళం గట్టుకోసంగూడా పోరాడి చైనా తన ప్రాణం అర్పించుతుంది" అని అన్నారు. చైనా "సైనికధోరణి, తన్ని తగిలివేసే ధోరణి"ని అవలంబించింది అనీ, "ఇపుడు ప్రపంచ శాంతికి కూడా ప్రమాదం తెచ్చింది" అనీ, ఇంకా ఏమేమో వ్రాశారు.

4. చైనా– భారత సరిహద్దు సమస్యపై ఉద్రిక్తతను కొనసాగించుతూ శాంతియుత పరిష్కారాన్ని కాలదన్నుతూవున్నా, నెహ్రూ ప్రభుత్వ మొండివైఖరిని ఖండించడానికి బదులుగా, సంప్రతింపులను తిరస్కరించే నెహ్రూప్రభుత్వవైఖరిని సమర్థించడానికి తమకు సాధ్యమయినదంతా చేశారు. సంప్రతింపులు తిరిగి కొనసాగడానికి నెహ్రూ ప్రభుత్వం పెట్టిన ముందు షరతును "పూర్తిగా బలపరచుతూ" తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

5. చైనాకు వ్యతిరేకంగా భారత సైనికులు పెద్దపెట్టున చేసిన దాడులకు 'ముసుగు'గా డాంగే ముఠా సిగ్గులేకుండా ఉపయోగపడింది. 1962 అక్టోబరు 12 న – చైనా సరిహద్దు కాపలా దళాలు (గార్డ్సు) సంరక్షించుతున్న చైనా ప్రదేశాన్ని "విముక్తి" చేయవలసిందిగా నెహ్రూ ఉత్తరువుచేసిన ఏడురోజుల తర్వాత– "మాక్‌మాహన్ శ్రేణికి దక్షిణంగా చైనా సేనలు చొచ్చుకు రావడం, ఆ విధంగా భారతదేశ సరిహద్దును

ఉల్లంఘించడం" గురించీ డాంగే ఒక ప్రకటన చేశారు. "ఈ విషయంలో భారత దేశ రిపోర్టు నిజమని భావిస్తున్నాం" అని ఆయన అన్నారు.

6. చైనాపై నెహ్రూ ప్రభుత్వం పెద్దపెట్టున సాయుధ దాడి సాగించిన తర్వాత, డాంగేముఠా "మాతృదేశ సంరక్షణ"కు పెద బొబ్బలు పెట్టసాగారు. 1962 నవంబరు 1న, డిసెంబరు 2వ తేదీన, 1963 ఫిబ్రవరి 12న వరుసగా చైనా వ్యతిరేక తీర్మానాలు చేశారు. వాటిలో "జాతీయ సంరక్షణ, జాతీయ ఐక్యత" అనే నెహ్రూ ప్రభుత్వ విధానాలను పూర్తిగా సపోర్టు చేశారు; ప్రజలు "ఐచ్ఛికంగా గొప్ప త్యాగాలు చేసేటట్లుగా"ను, "ఏ దేశంనుండియైనా సరే ఆయుధాలను కొనడం"లో నెహ్రూ ప్రభుత్వాన్ని బలపరచేటట్లుగానూ, అమెరికా సామ్రాజ్యవాదంతో కలిసి పనిచేసే ప్రభుత్వ విధానాన్ని బలపరచేటట్లుగానూ, ప్రజలను వంచించారు.

అభివృద్ధినిరోధకమైన జాతీయమన స్తత్వాన్ని (సెంటిమెంటును) రెచ్చగొట్టుతూ, చైనా-భారతదేశాల స్నేహాన్ని కూలద్రోస్తూ, ప్రజలను మోసపుచ్చడంలో నెహ్రూ ప్రభుత్వం వహించలేని పాత్రను, కమ్యూనిస్టుల ముసుగువేసుకొన్న డాంగేముఠా వహించిందని సుస్పష్టమే. నెహ్రూ ప్రభుత్వంలోని దేశీయ వ్యవహారాల మంత్రి సంబరంతో ఇటీవల ఇలా అన్నాడంటే ఆశ్చర్యం ఏమీలేదు :

"చైనా వైఖరిని ఖండించుతూ, భారతప్రభుత్వ వైఖరిని సమర్థించుతూ ఈ దేశంలోని కమ్యూనిస్టుపార్టీ నాయకుడు శ్రీ డాంగే స్వయంగా చెప్పిన జవాబుకన్న మంచి సమాధానం ఏమి ఉంటుంది ?"

భారత శ్రామికవర్గ ప్రయోజనాలకే గాక, భారత ప్రజలలో అత్యధిక సంఖ్యాక ప్రజల ప్రయోజనాలకు, అంటే భారతదేశ జాతీయ ప్రయోజనాలకు విరుద్ధంగా డాంగే ముఠా జాతీయ దురహంకార తత్వం పనిచేస్తున్నది. దేశంలో, భారతదేశ బడాబూర్జువా, బడా భూస్వాముల అభివృద్ధినిరోధక జాతీయ ప్రయోజనాలకు డాంగే ముఠా జాతీయ దురహంకారతత్వం ఊడిగం చేస్తున్నది; విదేశ వ్యవహారాల్లో, భారతదేశంలో నయావలస విధానాన్ని పెంపొందించుతున్న అమెరికా సామ్రాజ్యవాద ప్రయోజనాలకు ఊడిగం

చేస్తున్నది. భారత ప్రజలను అణచివేయడంలోను, జాతీయ స్వాతంత్ర్యానికి నష్టకరంగా సామ్రాజ్యవాదానికి తాకట్టు పడటం, నెహ్రూ ప్రభుత్వానికి సపోర్టుచేసే విధానం, వారి జాతీయ దురహంకార విధానం. అంతర్జాతీయ శ్రామిక వర్గానికేగాక, భారత ప్రజలకు కూడా వారి విధానం ద్రోహం చేస్తున్నది.

నెహ్రూ ప్రభుత్వం పెద్ద పెట్టున సాయుధ దాడి సాగించిన మొదటి రోజులనుండి, రోజురోజుకూ మరింతగా నెహ్రూ ప్రభుత్వ "జాతీయ రక్షణ, జాతీయ ఐక్యత" విధానాలను బలపరచే కార్యకలాపాలు, వరుసగా డాంగే ముఠా కొనసాగించారు. వర్గదాస్యోహ విధాన పోకడను వారు మరింత ఖచ్చితంగా కొనసాగించారు.

ఇదుగో ఇందుకు చక్కని ఉదాహరణ: చైనా సరిహద్దుపైన భారత సేనలు బలమంతా ఉపయోగించి దాడి చేసిన నాల్గు రోజుల తర్వాత, కార్మికులు "సమ్మెలు చేయవద్ద"ని నెహ్రూ విజ్ఞప్తి చేసిన తర్వాత, ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి హోదాలో డాంగే నెహ్రూకు గబగబా ఒక ఉత్తరం వ్రాశారు. "ఉత్పత్తి రంగం, రక్షణ సమస్యల"ను గురించి చర్చించడానికి, కార్మికుల, యజమానుల ప్రభుత్వ ప్రతినిధులతో గూడిన త్రైపాక్షిక సమావేశం జరపాలని ఆయన సూచించారు. నెహ్రూ ప్రభుత్వం వెంటనే ఆయన సలహాను అంగీకరించి, అలాంటి త్రైపాక్షిక సమావేశాన్ని ఏర్పరచడంలో కాలం వ్యర్థం చేయలేదు. కార్మికులు సమ్మె చేయరాదనీ, లేక పని మందకొడిగా చేయరాదనీ నిషేధిస్తూ ఈ సమావేశం ఏకగ్రీవంగా తీర్మానించింది; "జాతీయ రక్షణనిధి"కి విరాళంగా అదనపు గంటలు పని చేయాలనీ "రక్షణబాండ్లు" కొనాలనీ తీర్మానించింది.

కార్మిక ఉద్యమాన్ని విధ్వంసం చేయడానికి, కార్మికులకు వారి ప్రధాన హక్కులు లేకుండాచేసి, కార్మిక ప్రజలపై దోపిడి తీవ్రతరంచేసి వారిని బానిసలుగా ఉంచడానికి ఈ చర్యద్వారా, భారత బడా బూర్జువాలకు డాంగే నేరుగా సహాయపడ్డారు. భారత కమ్యూనిస్టుపార్టీ ఛైర్మన్‌గాను, అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ ప్రధానకార్య

దర్శిగాను, డాంగే చేసిన ఈ సిగ్గుమాలినపనితో కార్మికవర్గాన్ని, కార్మిక ప్రజలను అణచడానికి, పాలకవర్గానికి ఒక సాధనంగా ఆయన పూర్తిగా తయారయ్యారు.

ఇక్కడ మరో చక్కని ఉదాహరణ ఇస్తున్నాం. 1962 నవంబరులో డాంగే ముఠాలో ఒక సభ్యుడూ, భారత కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కార్యనిర్వాహక కమిటీ సభ్యుడూ అయిన శ్రీ యస్. జి. సర్దేశాయి, ఒక కరపత్రాన్ని పంచారు. అందులో కొన్నిభాగాలివి :

"ఒకానొక సోషలిస్టుదేశం మనపై దాడిచేసినపుడు, సోదర దేశీయులకంటే మన దేశాన్ని రక్షించడానికి మన నైతిక బాధ్యత ఎక్కువేగాని తక్కువకాదు."

"పాలకవర్గపార్టీకి, జాతీయ కాంగ్రెస్‌కు, ఇతర దేశభక్త పార్టీలన్నిటికీ మా చిత్తశుద్ధితో కూడిన హృదయపూర్వకమైన విజ్ఞప్తి ఏమంటే, మన విభేదాలన్నిటినీ ఈ క్లిష్టసమయంలో అవతలకు నెట్టి ఉమ్మడి జాతీయపతాక క్రింద ఐక్యం కావాలనేది. ఈ సమయంలో ఒకే ఒక పరీక్ష, ఆలోచన—"జాతీయ రక్షణ—ఐఉండాలి..."

"...జాతీయరక్షణ సమిష్టి కృషి నుండి మమ్మల్ని వదలివేసినా సరే, అదే ఆశయం కోసం మా శక్తినంతా ధారపోస్తాం అని మేం స్పష్టంగా చెబుతున్నాం ... సోదరదేశీయులు కొందరు మమ్మల్ని అస్పృశ్యులుగా చూడటానికి ప్రయత్నించినా, ఏ మాత్రం ప్రతిఫలం కోరకుండా మేం రక్షణ కృషికి పని చేస్తాం...

"ప్రధాని నెహ్రూను బలపరచడానికి ఆయన ఆదేశాలను నెరవేర్చడానికి ప్రధాని నెహ్రూను అకుంఠితంగా సపోర్టుచేయడమే నేటి క్లిష్టపరిస్థితిలో అవసరం; అదే మన దేశభక్తికి గీటురాయి. ఆయన మనదేశ సుప్రీం ఫీల్డ్ మార్షల్, సర్వసేనాని."

చూడండి! నెహ్రూపట్ల డాంగే ముఠాకు గలభక్తి ఎంత ఖచ్చితంగా ఉందో చూడండి! భారత కాంగ్రెసుపార్టీ దయాధర్మం కోసం వారు ఎంత రోతపుట్టేటట్లు ప్రవర్తిస్తున్నారు! ఎంత మూఢ జాతీయ దురహంకారం! భారత బడాబూర్జువా, బడాభూస్వాముల ప్రయోజనాలకు సేవచేయడానికీ, సోషలిస్టు చైనాకు వ్యతిరేకంగా భారత

ప్రజానీకాన్ని నిలబెట్టడానికి వారు తాపత్రయపడుతున్నారు! శ్రామిక వర్గ అంతర్జాతీయతకూ, నిజమైన భారత దేశభక్తికీ, దీనికీ ఏమైనా సామ్యం ఉందా?

ఇక్కడ మరొక చక్కని ఉదాహరణ. 1962 నవంబరులో అఖిల భారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ సర్వసభ్య సమావేశాని కిచ్చిన రిపోర్టులో డాంగే ఇలా అన్నారు:

"మన దేశాన్ని రక్షించేవిషయంలో మనం షరతులు విధించబోము. ఎందువల్లనంటే దేశం ప్రజలకు చెందింది. మన ఈ పరిస్థితిలో ఈ దేశం మనదా లేక జాతీయ బూర్జువాదా? అని ప్రశ్నించడం ద్వారా మన ప్రవర్తినను నిర్ణయించాలని నె నభిప్రాయ పడటంలేదు."

"...యుద్ధ ప్రయత్నాన్ని మనం బేషరతుగా బలపరుచుతాం." "నెహ్రూ ప్రభుత్వానికి రక్షణ విషయంలో బేషరతుగా నా సపోర్టు వుంది."

"మన జాతీయత పక్షాన మనం నిలబడవలసి యుంటుంది..."

"...జాతీయ అత్యవసర పరిస్థితి, రక్షణ, దాదాపు యుద్ధ పరిస్థితులలో ఎ.ఐ టి.యు.సి. కి చెందిన కార్మిక సంఘాలు తాత్కాలికంగా బూర్జువాతో తమకుండే మామూలు సంబంధాలను మార్పు చేసుకోవాలి కార్మికవర్గ సమస్యల విషయంలోను, తమ పనివిధానంలోను మార్పుచేసుకోవాలి."

"...సమ్మె పోరాటాలు, ఆ పద్ధతిద్వారా మన వర్గ ప్రయోజనాలను కాపాడటం, తాత్కాలికంగా మనం ఆపివేద్దామని కార్మికవర్గంగా మనం చెబుతాం."

"పారిశ్రామిక శాంతి ఒక విధంగా 'వర్గసామరస్యమే'. కాని తెలిసివుండే దీనిని అంగీకరించుతున్నాం."

"చరిత్రాత్మకమైన ఈ సమయంలో జాతీయ బూర్జువాకు మినహాయింపు లేకుండా సపోర్టుచేసే సమస్య, కార్మికవర్గ ఉద్యమ సిద్ధాంతాలకు విరుద్ధమైన విషయం కాదు."

"అందుచేత మనం యుద్ధకృషిని బలపరుస్తున్నాం. మనం జాతీయ

బూర్జువాతో కలిసివున్నాం... సంకోచించకండి. మీరు సంకోచించిన కొలదీ మరింత గందరగోళ పడతారు."

ఇక్కడ ప్రభుత్వ వర్గ స్వభావాన్ని పూర్తిగా డాంగే తిరస్కరించి, బడా బూర్జువా, బడా భూస్వాముల నియతృత్వం క్రింద ఉన్న ప్రభుత్వం ప్రజలకు చెంది వున్నదని వర్ణించుతున్నారు. ఆయన పూర్తిగా బూర్జువా పక్షం వైపు వెళ్లిపోయి, బూర్జువాకు మినహాయింపు లేకుండా సపోర్టు చేయాలని బహిరంగంగా కోరారు. వర్గ పోరాటం అనే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని పూర్తిగా వదలివేసి, ఆయన వర్గ సామరస్యాన్ని బహిరంగంగా బోధించుతున్నారు. డాంగే ముఠా పూర్తిగా పతనం చెంది, భారత బడా బూర్జువా చేతిలో సాధనం (నిప్పులో జీడిపప్పును కోతికోసం తీసే పిల్లి చేతి పంజా) అయ్యారు.

ఇంతకంటే ఇంకా ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, "జాతీయ ఐక్యత" అనే పేరుతో, నెహ్రూ ప్రభుత్వంతో కలుస్తూ, కమ్యూనిస్టు పార్టీలో తమతో అంగీకరించనివారిని నెట్టివేయడానికీ, పార్టీని బాగా చీల్చడానికీ భారత పాలకముఠాల అధికారాన్ని డాంగేముఠా ఉపయోగించింది. యుద్ధవిరమణ ప్రకటించి, తన సరిహద్దు కాపలాదళాలను తన చొరవతోనే చైనా ఉపసంహరించుకొన్న తర్వాత, నెహ్రూ ప్రభుత్వం తన కదిపరకే ఇచ్చిన పేర్లను ఆధారం చేసుకొని దేశవ్యాపితంగా అరెస్టులు సాగించింది; శ్రామిక వర్గానికి, ప్రజలకు విశ్వాసవంతులైన కమ్యూనిస్టులను, భారత కమ్యూనిస్టుపార్టీలో వివిధ స్థాయిలలో ఉన్న ముఖ్య కార్యకర్తలను సభ్యులను ఎనిమిది లేక తొమ్మిది వందలదాకా నెహ్రూ ప్రభుత్వం జైళ్ళలోకి త్రోసింది. "అరెస్టులవల్ల సభ్యులెవ్వరూ రెచ్చిపోరాదనీ, ప్రశాంతంగా, నెమ్మదియైన కృతనిశ్చయంతో పార్టీ విధానాలను కొనసాగించాలని," కోరుతూ డాంగేముఠా పరిస్థితిని ఉపయోగించుకొని, పోలీసుల అడుగువెంట అడుగువేసి, అనేక రాష్ట్రాలలో పార్టీ కమిటీల ముఖ్యశాఖలను తమ చేతుల్లోకి తెచ్చుకొనేందుకు, నమ్మకమైన తమ అనుయాయులను డాంగే ముఠా పంపించింది. ఈ చర్యల ఉద్దేశ్యం భారత కమ్యూనిస్టుపార్టీని పునర్నిర్మాణం చేయడానికీ, భారత విప్లవ

పోరాటాన్ని భగ్నం చేయడానికిని. ఆ విధంగా బడాబూర్జువా ప్రయోజనాలను కాపాడటానికే.

ఇంతేగాక, నెహ్రూ ప్రభుత్వం తన బూటకపు "సోషలిజం"తో ప్రజలను మోసపుచ్చటంలో డాంగేముఠా దానికి సహాయపడుతున్నది. "జాతీయ ఐక్యతకు చిహ్నంగా" నెహ్రూను పొగడుతూ, "దేశ అధిపతిగా అలాంటి వ్యక్తి ఉన్నప్పుడు మనం (డాంగే ముఠా) ఉమ్మడి సంఘటనలో సరియైన స్థానం పొందుతాం. భవిష్యదభివృద్ధికి నాయకత్వ శక్తిగా సంఘటన మారుతుంది. ఎలాంటి దా భవిష్యదభివృద్ధి? "సోషలిజంకోసం జరిగే అభివృద్ధి" అని ఆ ముఠావా రన్నారు.

బూర్జువా రాజకీయవేత్తలు వాగాడంబరంతో వల్లించే సోషలిస్టు నినాదాలను కమ్యూనిస్టులు బట్టబయలు చేయాలని మాస్కో ప్రకటన (ప్రపంచ కమ్యూనిస్టు సభ ప్రకటన–అను.) స్పష్టంగా తెలియ చేసింది. అయితే సోషలిజం అని పిలువబడే నెహ్రూ సోషలిజంను బట్టబయలు చేయడానికి డాంగేముఠా ఏమీ చేయకపోగా, నెహ్రూ నిజంగా సోషలిస్టు విధానాన్ని అనుసరించుతున్నాడని భారత కమ్యూనిస్టులను, భారత ప్రజలను ఒప్పించడానికి ప్రయత్నించారు. పైగా మినహాయింపులు లేని సపోర్టు ఇవ్వాలని అన్నారు. నెహ్రూ ప్రభుత్వ నాయకత్వాన సోషలిజం నిర్మించడానికి భారత కమ్యూనిస్టుపార్టీతో సహకరించవలసిందిగా కాంగ్రెస్‌పార్టీని బహిరంగంగా కోరారు. నెహ్రూపైన, అతని కాంగ్రెస్ పార్టీపైన, సోషలిజం సాధించడానికి ఆధారపడవచ్చునని డాంగేముఠా నమ్మినట్లయితే, డాంగేముఠా పెత్తనం కింద ఉండే కమ్యూనిస్టుపార్టీ అవసరం దేనికి?

పైన ఉదహరించిన అనేక ఘటనలు డాంగే ముఠా రివిజనిజం వైపుకు మరీ మరీ దిగజారిపోతున్నదని స్పష్టం చేస్తున్నాయి. వర్గ పోరాటం స్థానే, వర్గ సామరస్య సిద్ధాంతాన్ని వారు ప్రతిపాదించి, సోషలిజం స్థానే బూర్జువా సోషలిజాన్ని నిలబెట్టారు. బడా బూర్జువా బడా భూస్వాముల నియంతృత్వాన్ని వారు శ్రద్ధతో సంరక్షించుతున్నారు. భారత శ్రామికవర్గం, భారత ప్రజల విప్లవ ఆశయాన్ని

గాలికి వదలివేశారు. అమెరికా సామ్రాజ్యవాదానికి తాకట్టు పెడుతున్న నెహ్రూ ప్రభుత్వ విధానాన్ని బేషరతుగా వారు బలపరచుతూ, సామ్రాజ్యవాదంతో పోరాడే కర్తవ్యాన్ని పూర్తిగా విసర్జించారు. చైనా-భారత ప్రజల మైత్రిని వారు కాలిక్రింద నలిపి వేస్తున్నారు. చైనాకు వ్యతిరేకంగా నెహ్రూ సాగించే ఉద్యమంలో బాకా ఊదేవాళ్లుగా పని చేస్తున్నారు. శ్రామికవర్గ అంతర్జాతీయత స్థానే, బూర్జువా జాతీయ దురహంకారాన్ని నెలకొల్పుతున్నారు. క్లుప్తంగా చెప్పాలంటే, వారు మార్క్సిజం – లెనినిజంకు, శ్రామికవర్గ అంతర్జాతీయతకు ద్రోహం చేసేటంత పతనం చెందారు. వర్గదాసోహం, జాతీయ దురహంకారం అనే ఊబిలోకి, మరింత దిగబడిపోతున్నారు.

డాంగే ముఠాలాంటి రివిజనిస్టులు కమ్యూనిస్టుపార్టీలో తలయెత్తడం చరిత్రలో ఇది మొదటిసారి కాదు.

రెండవ ప్రపంచయుద్ధంనుండీ, అనేక దేశాల కమ్యూనిస్టుపార్టీలలో రివిజనిస్టు ధోరణులు తలయెత్తాయి. అమెరికాలో బ్రౌడర్, గాట్స్‌లు; డెన్మార్కులో లార్సెన్; జపాన్‌లో షోజిరో కసుగా లాంటి మార్క్సిజం – లెనినిజంలకు ద్రోహులు (రెనగేడ్స్) తలయెత్తారు. పెట్టుబడిదారీ దేశాలలోని కమ్యూనిస్టు పార్టీలలోనేగాదు ఇలాంటి ద్రోహులు (రెనగేడ్స్) తలయెత్తింది; ఒకానొకప్పుడు శ్రామికవర్గం అధికారంలో ఉన్న యుగోస్లావియాలో కూడా మార్క్సిజం – లెనినిజంకు ద్రోహం చేసిన రివిజనిస్టు టిటో ముఠా తలయెత్తింది. కమ్యూనిస్టు ఆశయానికి ఈ విద్రోహముఠాలు కల్గించిన నష్టం నుండి ప్రపంచమంతటా కమ్యూనిస్టులు గుణపాఠాలు నేర్చుకోవడం ముఖ్యం.

టిటో ముఠా 'అద్దం'లాంటిది. ఒక విద్రోహుల ముఠా రివిజనిస్టు పోకడను అనుసరించుతూ పార్టీని ఎలా కలుషితంచేయగలదో, సోషలిస్టుదేశాన్ని పెట్టుబడిదారీ దేశంగా పతనంచెందేటట్లు చేయగలదో అది బయటకు పెడుతుంది.

డాంగే ముఠా మరొక అద్దం. పెట్టుబడిదారీ దేశంలోని ఒక కమ్యూనిస్టుపార్టీ రివిజనిజం అనే పంథాను చేబట్టి, ఎలా ఆ పార్టీని

దిగజార్చి, బూర్జువాకు తోకగా, నౌకర్లుగా తయారుచేస్తుందో ఇది బయట పెడుతుంది.

ఈనాడు భారత కమ్యూనిస్టులు, భారత ప్రజలు చాలా చిక్కు పరిస్థితిలో ఉన్నారు. కమ్యూనిస్టు ఆశయంకోసం, భారత శ్రామికవర్గం కోసం, మహోజ్వలమైన విప్లవ సాంప్రదాయంగల భారత ప్రజల కోసం ఎడతెగకుండా పోరాడే ఆ భారతీయ కమ్యూనిస్టులపట్ల చైనా కమ్యూనిస్టుపార్టీ, చైనా ప్రజలూ గాఢసానుభూతినీ, వారి విషయమై తీవ్ర ఆందోళననూ వెలిబుచ్చుతున్నారు. భారత ప్రజల పురోగతిని, ఏ అభివృద్ధి నిరోధకులూ, ఏ రివిజనిస్టులూ అడ్డుకోజాలరు. శ్రామికవర్గంమీద, ప్రజా బాహుళ్యంమీద ఆధారపడి మార్క్సిస్టు–లెనినిస్టు శక్తులు చిట్టచివరకు అన్ని కష్టాలను అధిగమించుతారు; సంక్లిష్టమైన, బాధాకరమయిన పోరాటాలద్వారా అభివృద్ధి చెందుతారు. సత్యాన్ని, న్యాయాన్ని దృఢంగా నిలబెట్టేవారు, మార్క్సిజం–లెనినిజంను, శ్రామికవర్గ అంతర్జాతీయతను దృఢంగా అంటిపెట్టుకొనే వారు, భారత ప్రజల, భారత జాతియొక్క ప్రయోజనాలకు నిజమైన ప్రతినిధులు అని చరిత్ర రుజువు చేయగలదు.

ఈ నాడు చైనా, భారతదేశాలమధ్య సంబంధాలు కష్టమైన దశలో ఉన్నాయి. భారత అభివృద్ధి నిరోధకులు, రివిజనిస్టులు, చైనా భారత ప్రజలమధ్య స్నేహాన్ని కూలద్రోయడానికి ప్రయత్నించుతున్నారు. సామ్రాజ్యవాదులు కూడా, ఈ తగాదాను పురస్కరించుకుని లాభపడడానికి, కలహబీజాలు నాటడానికి తమ శక్తి కొద్దీ పని చేస్తున్నారు.

అయితే ఈ రెండుదేశాల ప్రజలమధ్య వున్న స్నేహబలాన్ని, దీర్ఘ కాలంగా ఉన్న సంప్రదాయాన్ని తక్కువ అంచనా వేయకుండా ఉండటానికి అన్ని విధాల అవకాశం ఉంది. ఈ స్నేహ బలంతో పోల్చి చూసుకున్నప్పుడు భారతదేశ అభివృద్ధి నిరోధకులు, డాంగే రివిజనిస్టు ముఠా వేళ్ళ మీద లెక్క బెట్టతగిన మరుగుజ్జులు. చిట్ట చివరకు తేల్చే దేమంటే, భారత–చైనా ప్రజల స్నేహాన్ని, లేక చైనా కమ్యూనిస్టుల, భారత కమ్యూనిస్టుల స్నేహాన్ని ఎవరూ కూల ద్రోయలేరనే.

ప్రచురణ నెం: 497
ప్రథమ ముద్రణ :
ఏప్రియల్, 1963
2000 కాపీలు

వెల : *0.50* న. పై.

ముద్రణ :

స్వతంత్ర ఆర్టు ప్రింటర్సు,
విజయవాడ-4.